OBM/1638 TEL

# క్రొత్త స్టేఫ్రీ బెల్టులేని నేప్‌కిన్లు




## లూపులు, బెల్టులు, పిన్నులు ఇక ఏమి అవుసరంలేదు. మీకు కావసిన పూర్తిరక్షణతో, మీరు కోరుకున్న పూర్తిస్వేచ్ఛ

మీరు ప్రతిఒక్కరోజు సద్వినియోగం చేయాలని కోరేస్త్రీ అయితే, మేము మీకు అతి ప్రత్యేకమైన దానిని సమర్పించ కోరుతున్నాం: **స్టేఫ్రీ** బెల్టులేని నేప్‌కిన్లు.

### మీరు కోరుకున్న పూర్తి స్వేచ్ఛ

మీరు లూపులు, పిన్నులు, తాళ్ళు లేక బెల్టులతో బాధ పడాల్సిన రోజులు పోయాయి. **స్టేఫ్రీ** నేప్‌కిన్లు సరైనట్లు అమరుటకోసం ఎడ్హెసివ్ పట్టీలు ఉన్నాయి. మీ బిగువైన చెడ్డీల లోపల దీనిని నొక్కండి. మీరు తీసివేసేదాకా చెమ్మను పీల్చి సురక్షితంగా అక్కడే ఉంటుంది. **స్టేఫ్రీ** నేప్‌కిన్లు మీరు ఏ దుస్తులతోనైనా




ధరించ వచ్చును ఏంకావలసినా చేయవచ్చును. అవి నిజంగా అమర్చినచోట అట్లానే ఉంటాయి.

### మీకు కావలసిన రక్షణ

**స్టేఫ్రీ** మీకు కావలసిన రక్షణ నిశ్చయంగా ఇచ్చేటట్లు ప్రత్యేకంగా డిజైను చేయబడ్డది. అధికంగా చెమ్మనుపీల్చి లోపలి మడతలలో చెమ్మ నిలిచి పోతుంది. మరి. 3–వైపులా ప్లాస్టిక్ షీల్డ్ నేప్‌కిన్ దిగువభాగము మరియు. ప్రక్కల మరకలు పడనీయదు. నేడే ఒక ప్యాక్ కొనండి. బెల్టులేని దాని స్వేచ్ఛను అనుభవించండి. మరి మీ రెప్పటికీ లూప్‌లు లేక బెల్టులు, పిన్నులు, తాళ్ళ జోలికి పోరు !

భారత దేశంలో తయారు చేయువారు జాన్సన్ & జాన్సన్ లిమిటెడ్, బొంబాయి–400 036
లైసెన్స్డ్ యూజర్. స్టేఫ్రీ, జాన్సన్ & జాన్సన్ యు.ఎస్.ఎ. వారి ట్రేడ్‌మార్క్ © J & J '79

# వనిత:

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి : 5 సంచిక : 4

అక్టోబర్ : 1979

విడి ప్రతి : రెండు రూపాయిలు

సం॥ర చందా : ఇరవైనాలుగు రూపాయిలు

శ్రీలంక : రూ. 2.00 (ఇండియా)

మలేసియా : 90 సెంట్స్

చిరునామా :

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026




### కాలక్షేపం కబుర్లు ఎందుకు?

ఉద్యోగం చేసే "స్త్రీ"ల మాటలా వుంచి, ఏ ఉద్యోగం లేని వనితల విషయానికొస్తే, ఊసూ-పాసూ లేని ఈ ఊకదంపు "కబుర్ల-కాలక్షేపం" ఇంచుమించు ఇంటింటా కన్పిస్తుంది మనకు. ఆ మాటలు విజ్ఞానదాయకంగా గానీ, ప్రపంచ జ్ఞానాన్ని తెలియచేసేవిగా గానీ వుంటాయా అంటే అది కూడా అనుమానాస్పదమే! అసలు ఆ 'కబుర్లు' – 'ఫలానా' కోవకు చెందినవీ, లేక 'ఫలానా' విషయానికి సంబంధించినవీ అని ఇతమిత్థంగా తేల్చి చెప్పడం కష్టసాధ్యమే అవుతుంది. రైలుపెట్టె సంభాషణకు మల్లె ఎక్కడో ప్రారంభమయిన సంభాషణ ఇంకెక్కడో అంతమవుతుంది. నియమితకాలం గానీ, విషయం గానీ లేని ఈ కాలక్షేపం కబుర్ల వలన కలిగే ప్రయోజనం ఏమిటి? ఎవరికి?

కొందరు వనితలు....ఈ కాలక్షేపం కబుర్ల కోసమే ప్రత్యేకించబడ్డారా అన్పిస్తుంది. ఎందుకంటే కబుర్లలో పడి అటు ఇంటి పనీ, ఇటు వంట పనీ రెంటినీ విస్మరించి గంటలకొద్దీ కబుర్లు చెప్పడం వీరి 'హాబీ'!....ఇరుగు పొరుగు అమ్మలక్కలతో కలుపుగోరుగా మసలుకోవడం వాంఛనీయమే కానీ, కేవలం "కబుర్ల"నే జీవన పరమావధిగా - విలువైన కాలాన్ని, అంతకంటే విలువైన 'మాటల్ని' ఇలా వృధాగా ఖర్చు చేయడం అంగీకార యుక్తం కాదు. అంతేకాక, ఇహం పరం తేడా కూడా తెలియని ఈ కబుర్ల లోకంలో పడడం వలన, వంట ఇంటిలో అగ్ని ప్రమాదాలు సంభవించే ప్రమాదం వుందన్న మాటా సత్యదూరం కాదు. ఇల్లాలిగా ఇంటిని చక్కదిద్దుకుని, ఇరుగు - పొరుగుతో కలిసి కట్టుగా వుండాలే కానీ, ఇలా వ్యర్థమైన సంభాషణలతో విలువైన కాలాన్ని వృథా చేయడం మహిళల పురోగమనానికి ఎంతమాత్రం దోహదకారికాదు.

ఎమ్. హరిప్రియ — శ్రీకాకుళం

### అభ్యుదయవాదం – వేదం కావాలి!!

సెప్టెంబర్ వనితలో శివలెంక రా. దేవిగారి ఉత్తరం ఎంతో సమంజసంగా ఉంది. స్త్రీకి అన్యాయం జరిగిపోతూందన్న కంఠశోష ప్రతిచోటా విన్పించేదే. కాని, ఎంతవరకూ నేటి స్త్రీ చైతన్య రథం వైపుకి సాగుతూందన్నది ప్రశ్న. దీనికి జవాబు శూన్యం. ఓ వంక స్త్రీలు ప్రధానులుగా రాణిస్తూ ఎన్ని ఉత్సాహకరమైన కార్యక్రమాల్లో పాల్గొంటుంటె....మరో వంక సాధారణ స్త్రీలు గృహ నిర్వహణ కార్యక్రమాల్లో తప్ప మరే ఇతర కార్యక్రమాల్లోను పాల్గొనరు. సరికదా ప్రగతి పథంవైపు పయనించాలనుకొనేవార్ని వెక్కిరించి వేళాకోళం చేస్తారు. ఇది స్త్రీలలో బాగా జీర్ణించుకుపోయున్న అలవాటు. అసూయ వీళ్ళని 'డామినేట్' చేయటంతోటే ఇలాంటి పరిణామాలు సంభవిస్తుంటాయి. స్త్రీలలో మొదట రావాల్సింది మానసిక వికాసం, దృక్పథం. మనసంతా మాలిన్యాన్ని నింపుకొన్న మానిని బయట ప్రపంచాన్నెలా ఉద్ధరించగలదు? ఇలా ఎన్ని మూతి విరుపుళ్ళ మధ్య, చెవుల కొరుకుళ్ళ మధ్య .. మరెన్నో గుసగుసల మధ్య-మనం రోజు కదలాడ్తూ కలిసి బ్రతకాలి. స్త్రీ ఆలోచనలు కేవలం వంటింటివరకే పరిమితం కాకూడదు. ఆమె ఆలోచించాల్సినవీ....చేయాల్సినవీ ఎన్నో ఉన్నాయి. మార్పన్నది ప్రతి మనిషి అంతరాంతరాల్లోంచీ రావాలి. అభ్యుదయం అన్నది ఎక్కడో దూరంగా వ్రేలాడదీసిలేదు. మన మధ్యనే మన మనసుల్లోనే ఉంది. మన నరనరంలో సంక్షిప్తమై ఉంది. ఋజువర్తనతో దాన్ని వెలికి తీయగలిగిననాడే తిరోగమనాన్ని తరిమికొట్టి....మనం అభివృద్ధిని సాధించగలం.

'స్నేహ' — కొత్తపేట

### పొగ త్రాగడం మాన్పించ లేమా?

సెప్టెంబర్ సంచికలో మీరు ప్రచురించిన 'పొగ త్రాగటం మాన్పలేరా?' వ్యాసం ఎంతో ఉపయుక్తంగా వుంది. పొగ త్రాగటం వల్ల సంభవించే నష్టాలన్నీ లిస్టుగా వినిపించినా .... ఒక్కసారి అలవాటు పడ్డవాళ్ళు మానటం కష్టం. మనం ఎన్ని చెప్పినా వాళ్ళముందు చెవిటివాడి ముందు శంఖూది నట్టే ఉంటుంది. ఇది నా స్వానుభవం. మా వారికి చదువుకొనే రోజుల్లో ఈ పొగ త్రాగే దురలవాటు మొదలయింది. పెళ్ళయి ఆరేళ్ళు కావస్తూంది. అప్పట్నుంచీ ఎన్నోవిధాల ప్రయత్నించాను. కానీ ఏమీ ఫలితం కనిపించలేదు. దానివల్ల చేతులు వణకటం లాంటి నరాల జబ్బులు కూడా వచ్చాయి. ఇక నేను వూర్కోలేక బెదిరించి చూశాను. దాంతోనూ లాభం లేకపోయింది. నేనెంత సీరియస్‌గా తీసుకున్నా ఆయనంతా నవ్వులాటగా తీసుకునేవాళ్ళు. 'సిగరెట్ తాగనివాడు దున్నపోతు' అంటూ వెక్కిరించేవారు. ఆయన ఓ డాక్టరయి కూడా ఈ పరిణామాల్ని లెక్క చేయకపోటం, ఆరోగ్య సూత్రాల్ని పాటించకపోవటంతో నా బాధ రెట్టింపయింది. యాధాలాపంగా వనిత తిరిగేస్తూన్న నాకు మీరు ప్రచురించిన వ్యాసం అగుపడింది. ఆయనకంతా చదివి విన్పించి మనసుకి నా బాధ ఏమిటో అర్థమయేలా విప్పి చెప్పాను. దాంతో ఆయన్లో కొంతైనా మార్పు వచ్చింది. రోజుకి రెండు పాకెట్లైనా తగలేసే ఆయన ఇప్పుడు చాలా వరకు తగ్గించుకోగలిగారంటే ఆ ఘనత మీకే దక్కుతుంది.

యన్. రమాదేవి — మదనపల్లి

### వస్త్రధారణలో స్వేచ్ఛ కావాలి!

ఇటీవల ఓ దిన పత్రికలో "మద్రాసులో వస్త్ర

ధారణలో స్వేచ్ఛకై విద్యార్థినుల ఆందోళన'' అన్న వార్త చదివాను. తమకు సౌకర్యంగా ఉండే పరిస్థితులను తాము కల్పించుకుంటున్నపుడు ఎదురయ్యే ఆటంక పరిస్థితులను అణచుటకు ఆ విద్యార్థినులు జరుపుతున్న ఆందోళన సమంజసమైనదే. దూరంగా ఉండే విద్యాలయాలకు బస్సులలోను, రైళ్ళలోను వెళ్లే విద్యార్థినులు చీరలు, లంగాలు, ఓణీలు మొదలైనవి ధరించి వెళ్ళాలంటే కాస్త ఇబ్బంది ఉందన్నమాట పూర్తిగా సత్యం. ఉదయం పదికి, సాయంత్రం అయిదుకి రద్దీతో కూడుకున్న బస్సులలో గాలికి ఎగిరిపోయే ఓణీలు - కుచ్చెళ్ళు సర్దుకుంటూ, జారిపోయే పుస్తకాలు, మీల్స్ బాక్స్



ఈ సంచికలోని 49వ పేజీలో 'పూజా పుష్పము అన్న గేయం వుంది. ఆ గేయం రాసిన శ్రీమతి తిమ్మరాజు హైమావతి (శ్రీకాకుళం) అంతకు ముందు చాలా రచనలు చేసి, రచయిత్రిగా పేరు గడించారు. జన్మస్థలమైన రాజమండ్రిలో చదువుకున్నారు. సంస్కృతం నేర్చుకున్నారు; వీణా వాద్యం నేర్చుకున్నారు. చాలా కాలంగా పలు పత్రికల్లో వ్యాసాలూ, గేయాలూ రాస్తున్నారు. శ్రీమతి హైమావతి సాంఘిక కార్యక్రమాల్లో కూడా ఎక్కువగా పాల్గొంటూ వుంటారు. ఎన్నో సంస్థల్లో ముఖ్య కార్యకర్తగా వుండి, సాధించారు, సాధిస్తున్నారు. ప్రస్తుతం శ్రీకాకుళంలోని శ్రీనివాస మహిళామండలికి అధ్యక్షురాలిగా వుంటున్నారు. విశేషం ఏమిటంటే, 54 సంవత్సరాల వయసు దాటిన తర్వాత హిందీ భాష నేర్చుకుని 'విశారద' పాసయ్యారు. తను నేర్చుకున్న విద్యలు ఇవాళ తమ మండలిలో బోధిస్తున్నారు. శ్రీమతి హైమావతి భర్త శ్రీ శివరావు ప్రసిద్ధి చెందిన పత్రికా రచయిత. ఈ దంపతులకు నలుగురు అబ్బాయిలూ, ముగ్గురు అమ్మాయిలూ సంతానం.




పట్టుకుని, పడిపోకుండా (బస్సులు మలుపు తిరుగుతున్నప్పుడు, బ్రేక్స్ వేస్తున్నప్పుడు) కమ్మీలు పట్టుకుని ఫీట్లు చెయ్యడం అంటే మాటలా! ఆ క్షణంలో అయినా అవసరం తీరేంతవరకైనా ఓ పది చేతులు అర్జెంటుగా ప్రసాదించమని మన దేవతలని ప్రార్థించాలి అన్పిస్తుంది. ఒకసారి రద్దీగా ఉన్న బస్సులో మా సహ విద్యార్థిని జారిపోతున్న పమిట సర్దుకోడంలో, అసరాగా పట్టుకున్న చేయి వదిలింది. అంతలోనే బస్సు అకస్మాత్తుగా మలుపు తిరగడం దురదృష్టవశాత్తు ఆమె ప్రక్కనే ఉన్న మా కళాశాల విద్యార్థిపైనే ఒరగడం జరిగింది. అది పొరపాటుగా జరిగినా పలుమంది పలురకాలుగా అన్నారు. ఇది కట్టు కథ అని అనుకోవద్దు నా కళ్ళతో చూసిన నిజం! ఇలాంటి ఘోరమైన కష్టాలు అనుభవించేవారికే తెలుస్తాయి కాని ఇతరులకు కట్టు కథలు అని అన్పించవచ్చును. వంట ఇంట్లో కూర్చొని, "అవ్వ, ఈ కాలం ఆడపిల్లలు ఎలా మారిపోయారే తల్లీ – మగపిల్లల్లా ఆ షర్టులేమిటి? ఆ ప్యాంట్లేమిటి? సిగ్గులేకుండా" అని బుగ్గలు నొక్కుకుంటూ మాట్లాడడం మాత్రమే మన వారికి తెలుసును. ఎదురుతిరిగి అడిగితే 'మేమంతా చీరలలో వెళ్ళటంలేదూ' అంటారు. ఏదో ఒకరోజు ఏ పెళ్ళికో, సినిమాకో రిక్షాలలో వెళ్ళి రావడంతోనే సరా! ఒంటికి నిండుగా రక్షణ ఇచ్చే వస్త్రాలు ధరించడంలో తప్పు ఏమిటి? "అది మన రాష్ట్రపు దుస్తులు కావు, అలవాట్లు కావు" అనడం నిజంగా అవివేకం. మనది కానిది మనం ధరించడం ఎందుకు? అని అనుకుంటే ఇతర విషయాలకు కూడా అవన్నీ వర్తించాలి కదా! సభ్యత, సంస్కారం కట్టుబొట్టులో బంధిస్తే రావు. సభ్యతను దాటి, అసభ్యత చోటు చేసుకోనంతవరకు పెద్దలు ఈ వస్త్రధారణ విషయంలో తప్పక అంగీకరింపవచ్చును. ప్యాంట్లు, షర్టులు వేసుకొనేవారిని తప్పుదారులు త్రొక్కేవారుగా భావించే దుస్వభావాన్ని వదులుకోవాలి. చదువు విషయంలో నేడు యువతులకి స్వేచ్ఛ ఇచ్చినట్లే వస్త్రధారణ విషయంలో కూడా స్వేచ్ఛ ఇవ్వడం సముచితం.

వీరాబత్తుని నిర్మల — నెల్లూరు

అపర ఆదర్శ పురుషులు!

సెప్టెంబరు వనితలో కాకాని ప్రమదగారి చిట్టికథ 'గుణపాఠం' చదివాక నా అభిప్రాయం వ్రాయకుండా ఉండలేకపోతున్నాను. శశి తన భర్తకు శశి నాన్నగారు మూడు వేలు డ్రాఫ్టు పంపించగానే శశి ఉద్యోగంలో చేరి అప్పు తీరేదాకా పుట్టింట్లో ఉండి అప్పు తీర్చి, తరువాత కాపురానికి వస్తానంటుంది. ఇది కథగా చదువుకోవటానికి బావుంటుంది కానీ ఇలా ఆచరించే వనిత లెందరు? ఒకవేళ అలా ఆచరించే స్త్రీని ఈ సంఘం అనే మాటలు మనకు తెలియనివా? కానీ కట్నం తీసుకోలేదు అంటారు కానీ కట్నానికి నాలుగు రెట్లు పెళ్ళయి సంవత్సరం కాకుండానే రాబట్టుకుంటారు.

మరి కొందరు ప్రబుద్ధులెలా ఉంటారంటే పెళ్ళిలో ఓ పదివేలు కట్నంతీసుకొని అన్ని లాంఛనాలతో పెళ్ళి చేసుకుంటారు! తర్వాత ఓ పదేళ్ళకు కట్నాల డిమాండ్ పెరిగి తన మామగారు మరదలు పెళ్లి ఓ పదిహేను వేలిచ్చి చేశాడనుకోండి. అక్కడ్నించి మొదలవుతుంది గునుపు. "నాకంటె అన్నింటిలోను తక్కువ అయిన అతనికి పదిహేను వేలిచ్చాడు మీ నాన్న అంటాడు. ఒకటేమిటి? అత్తగారుంటే ఇక చెప్పక్కర్లేదు. తన కొడుకు పెళ్ళప్పటికి, ఈ పెళ్ళప్పటికి జరిగిన లాంఛనాలు మొదలుకొని అప్పడాల వడ్డన వరకు పోలుస్తూ తెగవాగుతుంటుంది! ఆ కోడలి అవస్థ వర్ణనాతీతం! మరి వీళ్ళిద్దరి వాగుడు ఆగాలంటే ఆమె ఏం చెయ్యాలి? భర్త పిల్లల తండ్రి అయినా కూడా తేడా వచ్చిన కట్నం డబ్బు ఇచ్చుకోవాల్సిందేనా? ఈ అపర ఆదర్శ భర్తలను ఏ చట్టానికి అప్పచెప్పాలి? ఏ శిక్ష విధించాలి? ఇలాటి మొగుడొద్దంటూ ప్రమదగారి కథలోని శశిలాగా ప్రవర్తించే సాహసం ఎంతమంది స్త్రీలకుంటుంది? కోరలు తీసేసిన పాముల్లాగా కక్కలేక మ్రింగలేక బ్రతకటం తప్ప!!

ఎ. జయలక్ష్మిరాజు — అనంతపురం

సెప్టెంబర్ సంచిక 'వనిత'లో 'ఆడపిల్ల' కథానిక చాలా బాగుంది.

—ఆర్. వాసంతి, తెనాలి

సెప్టెంబర్ '79 వనితలో పొగ త్రాగే దురలవాటు ఏ విధంగా ఏర్పడుతుందో, వాటివల్ల ఎలాంటి దుష్ఫలితాలు సంభవిస్తాయో పొగ త్రాగడం మాన్పించరూ?' అన్న శీర్షికలో చాలా చక్కగా వివరించారు. తల్లికి, బిడ్డకు మధ్యగల సంబంధం ఎంత దృఢమైనదో ఆకెళ్ళ వరలక్ష్మి గారి కథ 'మమతలు' తెలిపింది. చిట్టి కథలలో 'ఊహల వీణ' కథ బాగుంది. 'శ్రీ కూర్మం' గురించిన విశేషాలు, మా కళ్ళకు కట్టినట్టుగా చిత్రించారు.

—కె. జి. హేమలత, కుప్పం

సెప్టెంబర్ వనిత ముఖచిత్రం చూసి ఎంత చక్కగా ఉంది ఈ అమ్మాయి అనుకున్నాము. ఆమె గురించి చదివి పోలియో వలన నడవలేదని తెలిసి చాలా బాధపడినాము. శ్రీకూర్మం దేవాలయం గురించి, ఫొటోతో సహా మనస్సుకు హత్తుకునేలా వ్రాసినారు. అవి-ఇవి శీర్షిక మాకు చాలా ఉపయోగకరంగా ఉంది.

—ఆర్. రజనీరెడ్డి, కోరగుంటపల్లి

సెప్టెంబర్ వనితలోని 'మమతలు' కథ వాస్తవానికి దగ్గరగా వుండి నా మనస్సునెంతగానో ఆకట్టుకుంది. రచయిత్రి వరలక్ష్మిగారికి ధన్యవాదములు. వాసిరెడ్డి సీతాదేవిగారి నవల 'నింగినుండి నేలకు' ఊహించని మలుపులతో మరెంతో ఇంటరెస్టింగ్‌గా సాగుతోంది.

—వి. సాధనా చక్రపాణి, రాజమండ్రి

సెప్టెంబర్ సంచికలో 'మమతలు' ఆకెళ్ళ వరలక్ష్మి కథానిక వాస్తవానికి దగ్గరగా ఉంది. శ్రీ రూపాబోస్ గారి ప్రత్యేక గోష్ఠి ద్వారా క్రికెట్ గురించి తెలిసికొనగలిగాము.

—కళ్యాణి, నవిపేట్




సెప్టెంబర్ నెల 'వనిత'లో జర్మనీ దేశపు స్త్రీల గురించి మాకు తెలియచేసినందుకు చాలా సంతోషం.

—కె. అనూరాధ, డి. కాంత, భువనగిరి

సెప్టెంబర్ 'వనిత'లో ప్రచురించిన చిట్టి కథలలో 'గుణపాఠం' కథ చాల బాగున్నది. వాసిరెడ్డి సీతాదేవిగారి నవల 'నింగినుండి నేలకు' చాల ఇంటరెస్టింగ్‌గా ఉంది.

—యం. పుష్పవతి, యం. వేదవతి, కుప్పం

సెప్టెంబరు 79 సంచికలో మీరు ప్రచురించిన ముఖచిత్ర వనిత షిరీన్ పీటర్స్‌ను గూర్చిన విషయాలు చదివిన తరవాత భగవంతుడు ఆమెపట్ల ఎందుకంత నిర్దయ చూపాడా? అనిపించింది. రవివర్మ చిత్రాలను యింకనూ ప్రచురిస్తారని ఆశిస్తున్నాను. ఈ సంచికలో ప్రచురితమైన చిట్టి కథలు నాకెంతగానో నచ్చాయి.

—సత్యవతీ శేషాద్రి, జగన్నాథపురం

సెప్టెంబర్ నెల 'వనిత'లో మీరు ప్రచురించిన 'ఆడపిల్ల' కథ చక్కగా వుండటమేకాక వ్యక్తుల మంచి మనసుల్ని తెలియచేసింది. 'నింగినుండి నేలకు' సీరియల్ కొత్త పంథాలో రసవత్తరంగా సాగుతోంది.

—కె. సరోజ, సికింద్రాబాద్

సెప్టెంబర్ 'వనిత' ముఖచిత్రం చాలా ఆకర్షణీయంగా వున్నది. తర్వాత ఆమె (షిరీన్ పీటర్స్) వృత్తాంతం తెలుసుకొన్న తరువాత చాల విచారం కలిగినది. కమలా వరదాచారిగారి రచన 'బాలల స్వర్గం' వ్యాసం, ఫొటోలు చాలా చక్కగా నున్నవి.

—ఆర్. ఇందిర, కోరగుంటపల్లె

సెప్టెంబరు 'వనిత' సంచికలో బామ్మగారి పేజీ, పెరటితోట పెంపకం శీర్షికలు మాకు వుపయోగకరంగా వున్నాయి. మన దేవాలయాలు శీర్షికలో శ్రీకూర్మం గురించి వ్రాసినందుకు సంతోషం.

—అయితా రాజరాజేశ్వరి, సూళ్లూరుపేట

సెప్టెంబర్ '79 'వనిత' సంచికలో 'బామ్మగారి పేజీ'లో పొట్లకాయ + కోడిగ్రుడ్డు తినడం - ఏ విధంగానూ అపాయం—అనారోగ్యకరం కాదు. 'రజ్జు సర్పభ్రాంతి' వంటిదే ఈ నమ్మకం - పొట్లకాయ ఆకారంలో పాము పోలికలు. అంతే! నేను పొట్లకాయ, కోడిగుడ్డు కూర తిని చూచాను 30 ఏండ్ల నాడు. మర్నాడు అనుభవం గల వైద్యునితో చర్చించాను. అలా తిన్నంత మాత్రంతో ఏ విధమైన ప్రమాదం, వగైరా జరుగవు; నాకు జరుగలేదు!

—వి, తాడేపల్లిగూడెం

## వనిత మాటల కొలువు – 50

**సరైన సమాధానం:**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 ఔ | 14 ద | ల | ■ | 2 జ | 15 ల | 16 ని | ధి |
| 3 చి | క్క | ■ | 4 అ | య | న | ము | ■ |
| 5 తి | ను | ■ | క్ర | ■ | ■ | ■ | 17 ప్రే |
| ■ | ■ | 6 రొ | య్యి | ■ | 7 తొ | 18 లు | త |
| 8 ప్ర | 19 మ | ద | ■ | 9 న | క | పా | ము |
| 10 తి | ట్టు | ■ | 11 ము | డి | ■ | ■ | ■ |
| ని | ■ | 20 ట | ■ | 12 రే | గు | 21 పం | డు |
| ధి | ■ | 13 గుం | డ్రా | యి | ■ | ట | ■ |

పై సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారు ఆరుగురు. వారు:

1. టి. ఈశ్వరి, టిటాఘర్ 2. డి. నాగవేణమ్మ, ఆదోని 3. బి. లక్ష్మీరావు, దుర్గాపూర్ 4. జి. సునందాశర్మ, అలంపూరు 5. వై. వి. వంశీ, శ్రీకాకుళం 6. జి. శిరీష, శ్రీకాకుళం

**బహుమతి మొత్తం రూ. 150 లను సమానంగా పంచి వారికి అందజేస్తున్నాము.**

## లోపల



శ్రావణమాసం వచ్చిన తర్వాత, వరసగా పండగలు వస్తూనే వుంటాయి. ముఖ్యంగా స్త్రీలకి, శ్రావణమాసం అంతా కూడా 'పండగ మాసం'లాగానే గడుస్తుంది. తర్వాత వినాయకచవితి వస్తుంది; విజయదశమి వస్తుంది: దీపావళి వస్తుంది. ఐతే ఈ సంవత్సరం పండగలన్నీ కాస్త ముందుగానే వచ్చేశాయి. సాధారణంగా దీపావళి నవంబర్లో వస్తుంది. కాని, ఈసారి అక్టోబర్ ఇరవయ్యో తేదీన వచ్చేసింది. అక్టోబర్ ఒకటి, రెండు తేదీలు విజయదశమి తేదీలు. ఈ కారణంగానే 'వనిత' అక్టోబర్ సంచిక 'దసరా – దీపావళి' సంచికయింది. ఈ పండుగలకని ప్రత్యేకంగా వ్యాసాలూ, రచనలూ ఇవ్వక పోయినా ముఖచిత్రం మాత్రం 'దీపావళి' శోభకి చెందినదే. తాను దీపాల తోరణాలు వెలిగిస్తూ, ప్రతి ఇంటా ఇలాంటి వెలుగులు కలగాలని, 'వనిత' తరపున ఆకాంక్షిస్తున్న వనిత–కుమారి శాంతి నారాయణ్. శాంతి మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీ విద్యార్థిని; బి. ఎ. చదువుతోంది. ఆమె మెట్రికులేషన్‌లోనూ, ఎతిరాజ్ కళాశాలలో పి. యు. సి లోనూ 'డిస్టింక్షన్'తో పాసయింది. తాను చదువుకున్న 'కార్పొరేట్ సెక్రటరీషిప్' కోర్సు ద్వారా చార్టెడ్ అకౌంటన్సీ చదవాలనీ, మంచి సంస్థలో ఉద్యోగం చెయ్యాలనీ – ఆమె ఆశయం. ఫ్రెంచ్ భాష కూడా నేర్చుకుంటున్న శాంతి – హిందీ పరీక్షల్లో కూడా 'ఫస్ట్‌క్లాస్'ల్లో పాసయింది. శాంతికి ఇంకా మరికొన్ని ఉత్సాహాలు కూడా వున్నాయి. ఆమె నటిస్తుంది; నాట్యం చేస్తుంది. స్కూలు, కాలేజీ నాటకాలల్లో నటించింది; వాటి ఉత్సవాల్లో నాట్యం చేసింది. వక్తృత్వ పోటీల్లోనూ, వ్యాస రచన పోటీల్లోనూ కూడా ఆమె పాల్గొని బహుమతులు తెచ్చుకున్నది. "క్రికెట్ ఆట నాకు ఎంతో ఇష్టం. సాయంకాలపు వేళల్లో నేను క్రికెట్ ఆడుతూ వుంటాను. లేదా, ఏదైనా వ్యాయామం చేస్తాను" అన్నది ఆమె.

వర్ణచిత్రం: సత్యకుమార్

పాఠకులకూ అభిమానులకూ

# వనిత

దసరా–దీపావళి శుభాకాంక్షలు

# ప్రపంచం

భారతదేశపు రాజకీయాలలో ఊహించని పరిణామం వచ్చింది. దేశం మధ్యంతర ఎన్నికలకి సిద్ధమయింది. 1977లో సమభావాలు గల కొన్ని రాజకీయ పక్షాలు జనతా పార్టీగా అవతరించి పదవిలోకి రావడం ఒక ఊహించని పరిణామమయితే, నేడు దేశం మధ్యంతర ఎన్నికలకి సిద్ధమవడం మరొక ఊహించని పరిణామం క్రింద భావించాలి.

ఐదు సంవత్సరాలకి ఒకసారి జరగవలసిన లోక్ సభ ఎన్నికలు మూడు సంవత్సరాలు ముగియకుండానే జరగ వలసి రావడం భారత దేశం వంటి బీద దేశంలో ఊహించకూడని పరిణామమే. అయితే ప్రజాస్వామ్య పరిరక్షణకి వేరే మార్గంలేక రాష్ట్రపతి ఈ నిర్ణయం తీసుకోవలసివచ్చింది.

మన దేశంలోని ముప్ఫయి ఆరుకోట్లమంది వయోజనులు తమ వోటింగ్ హక్కుని డిశంబర్ లో జరిగే మధ్యంతర ఎన్నికలలో వినియోగించుకుంటారు. ఈ ఎన్నికల నిర్వహణకి దేశం నూట యాభయి కోట్ల రూపాయల వ్యయం భరించవలసి వస్తుంది. ప్రభుత్వ పరంగా అయే నలభయి కోట్ల రూపాయలు ఖర్చుకాగా, వివిధ రాజకీయ పార్టీలు వారి వారి అభ్యర్థుల ప్రచారం కోసం నూటపది కోట్ల రూపాయలు ఖర్చు పెట్తాయని అంచనా. మొత్తం 544 నియోజక వర్గాల నుంచి ప్రతినిధులు లోక్ సభకి ఎన్నికవుతారు.

ఇంతవరకూ జరిగిన సాధారణ ఎన్నికలకి ప్రభుత్వ పరంగా జరిగిన ఖర్చు పరిశీలిస్తే ఎన్నికలు ఎంతటి ఖర్చుతో కూడిన పనో తెలుస్తుంది. 1952 ఎన్నికలకి పదిన్నర కోట్లు, 1957 లో ఆరుకోట్లు ప్రభుత్వం ఖర్చుపెట్టింది. 1952 లో ఖర్చు ఎక్కువ కావడానికి కారణం ప్రాథమికమయిన ఏర్పాట్లు మొదటిసారిగా చేయవలసి రావడమే. 1962 ఎన్నికలకి ఏడుకోట్లు ముప్ఫయిరెండు లక్షలు, 1967 లో పదికోట్ల తొంభయి అయిదు లక్షలు, 1971 లో పదకొండు కోట్లు ప్రభుత్వపరంగా ఖర్చయింది. బాలెట్ పత్రాల ముద్రణ, పోలింగ్ బూతులు ఏర్పరచడం, పోలీసు బందోబస్తూ, ఎన్నికలు సక్రమంగా జరగడానికి పర్యవేక్షణకి అధికారులని నియమించడం వీటికి ప్రభుత్వం ఖర్చుపెట్తుంది. ఆ విధంగా 1977 ఎన్నికలకి ఇరవయి ఆరు కోట్లు రూపాయలు ఖర్చయింది.

*

రెండుకోట్ల జనాభా కూడా లేని సూడాన్ ని ఆఫ్రికా దేశాలు ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలకి నిదర్శనంగా చెప్పుకోవచ్చు. జనాభా విషయంలో పెద్దవయిన దేశాలకే కాక చిన్నదేశాలకీ భారీ సమస్యలు వుంటాయని తెలుసుకోలంటే సూడాన్ గురించి తెలుసుకోవాలి.

ప్రస్తుతం నిత్యావసర వస్తువులు కరువయి, దొరికే వస్తువుల ధరలు ఆకాశాన్ని అంటి సూడాన్ ఆర్థిక సంక్షోభంలో చిక్కుకుంది. పది సంవత్సరాలుగా సూడాన్ ప్రెసిడెంట్ గా వుంటున్న జఫర్ మహమ్మద్ నిమియరీ రాజకీయ భూకంపాలకి నిలిచి మరిన్ని ఎదుర్కోడానికి సిద్ధంగా వున్నాడు. పంచదార, పెట్రోలు ధరలు విపరీతంగా పెరిగిపోయి విద్యుత్ ఉత్పాదన తగ్గిపోగా సూడాన్ ప్రజల జీవితాలలో నిజంగానే చీకటి ఆవరించింది.

1973 లో ఆర్థిక సంక్షోభాన్ని నివారించడానికి సూడాన్ లో వ్యవసాయాభివృద్ధి ప్రణాళికలని ప్రవేశ పెట్టారు. సూడాన్ ని 'ధాన్యపు గని 'గా మార్చాలని ప్రయత్నించారు. వ్యాపార సరళిలో విదేశాల నుంచి సూడాన్ ఋణాలు స్వీకరించింది. దేశంలో ద్రవ్యోల్బణం పెరిగింది. దిగుమతులకి చెల్లించడానికి విదేశీ మారక ద్రవ్యం కరువయింది. దేశంలో రవాణా సౌకర్యాలు కావలసినంత అసౌకర్యాన్ని కలిగించాయి.

అలా అనేక అవరోధాలు ఏక కాలంలో రావడంతో వ్యవసాయాభివృద్ధి కార్యక్రమం అనుకున్నట్లు సాగక కుంటుపడింది. దేశంలోని మేధావులు, నిపుణులయిన కార్మికులు స్వదేశంలో అవకాశాలు లేక లిబియాకి, అరబ్ దేశాలకి వలస వెళ్లిపోయారు. ఈ పరిస్థితులలో దేశ ప్రజలకి యివ్వవలసిన సందేశం "పొదుపు చెయ్యండి" కాక మరొకటి కాదనే నిర్ణయానికి ప్రెసిడెంట్ నిమియరీ వచ్చాడు. వ్యవసాయదారులని దేశ ప్రజల అవసరాలకి గోధుమ కాక, ఎగుమతి కోసం ప్రత్తిని ఉత్పత్తి చేయమని నిమియరీ సలహా యిచ్చాడు. అయితే వ్యవసాయదారులు దీనికి తీవ్ర అసమ్మతి తెలియచేశారు.

అలా అనేక సమస్యలతో సతమతమవుతున్న నిమియరీ అమెరికా, బ్రిటన్, పశ్చిమ జర్మనీ, ఫ్రాన్సుల సహాయ సానుభూతులతో కల్లోల సాగరంలో మునిగిపోకుండా ఈదగలుగుతున్నాడు. అయితే తాను ఒడ్డుకు చేరుకోవడం కాని, తన దేశాన్ని గట్టెక్కించడం కాని నిమియరీ విషయంలో జరగదని భావిస్తున్నారు.

ప్రపంచంలో ప్రశాంతత చోటు చేసుకోడానికి, యుద్ధం ప్రసక్తే లేకుండా దేశదేశాల మధ్య శాంతియుత వాతావరణం నెలకొనడానికి ఒక ఉద్యమం సాగుతోంది. అదే అలీనోద్యమం ఆ ఉద్యమానికి ఊపిరి యిచ్చిన దేశాలలో భారతదేశానికి స్థానం వుంది. ఈ ఉద్యమంలో ఈ రోజున 90 దేశాలకి సభ్యత్వం వుంది.

సెప్టెంబర్ లో అలీన దేశాల మహాసభ క్యూబా రాజధాని హవానాలో జరిగింది. మూడు సంవత్సరాలకి ఒకసారి జరిగే ఈ మహాసభకి ఎంతో ప్రాముఖ్యం వుంది. క్రిందటిసారి ఈ మహాసభలు శ్రీలంకలో జరగగా యిప్పుడు క్యూబాలో జరిగాయి. అలా అలీనోద్యమం ఆసియా నుంచి లాటిన్ అమెరికాకి చేరుకుంది.-

1961లో మొట్టమొదటిసారిగా అలీన మహాసభలు బెల్ గ్రేడ్ లో జరిగాయి. అయితే అంతకు ముందే 1955లోనే ఈ ఉద్యమానికి ప్రోత్సాహం లభించింది. ఈ రోజున ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాకి చెందిన అనేక దేశాలు ఈ ఉద్యమంలో వున్నాయి. ఒక రోజున బానిస దేశాలుగా వున్న ఈ దేశాలు స్వాతంత్ర్యాన్ని సంపాదించుకుని, స్వేచ్ఛకి వున్న విలువని అర్థం చేసుకుని ప్రపంచ శాంతికి పాటుపడుతున్నాయి.

హవానాలో ముగిసిన అలీన దేశం మహాసభకి అధ్యక్షత వహించిన క్యూబా అధ్యక్షుడు కాస్ట్రో అమెరికా, చైనాలు అలీనోద్యమం బలపడడానికి చెప్పుకోదగ్గ కృషి చేయడం లేదని విమర్శించాడు. అసలు అమెరికా, రష్యాల మధ్య ప్రచ్ఛన్న యుద్ధం తీవ్రంగా జరుగుతున్న రోజులలో ప్రారంభమయిన ఈ ఉద్యమం ఆ తీవ్రతని రానురాను చాలావరకూ తగ్గించింది. అయితే ఆ రెండు దేశాలకి యితర దేశాలతో వున్న సంబంధాల దృష్ట్యా పరిస్థితులు ఏ రోజయినా మారి మరో ప్రపంచ యుద్ధం రావచ్చని కొందరు భావిస్తూ వచ్చారు. కాని శాంతి స్థాపనకు గణనీయమయిన కృషి జరగడంతో ఆ ప్రమాదం ఏర్పడలేదు.

ప్రపంచ దేశాల మధ్య అవగాహన పెరగాలనీ, వర్ధమాన దేశాల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకి అగ్రదేశాలు విలువ యివ్వాలనీ, సమానత్వానికి కృషి జరగాలని సోవియట్ రష్యా అధ్యక్షుడు బ్రెజ్నేవ్ చెప్పడంతో అలీనోద్యమం హవానాలో మరోఅడుగు ముందుకు వేసింది. ◻

## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు_52' చందమామ బిల్డింగ్స్, మద్రాసు _ 600 026 చిరునామాకు అక్టోబర్ 29వ తేదీలోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1979 డిసెంబర్ సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు _ అడ్డము

1. ఒక గుణింతంలోని వరస అక్షరాలు పక్షి.
2. తిరగడానికీ తిప్పడానికీ ఊతపదం
3. సరిగ్గా పరవండి - పరుపు మీద.
4. తపం చేసిన వ్యక్తికి దైవం ప్రత్యక్షమై, అతన్ని పిలవడంలో తిరగబెట్టి పిలిచాడా ?
5. ఇంకో మాటలో కడుపు
6. వాల తార
7. స్త్రీ - తప్పు దారిలో పడింది.
8. మెడలో వేసుకోవచ్చు.
9. ఎక్కువమంది మాత్రం కారు.
10. పాత్ర పైన వుండేదే సీసా పైనా వుంటుంది.
11. ఆనవాలు వంటిదే
12. విభక్తులలో మొదటిది
13. మోకాలుకీ కొబ్బరికాయకీ సంబంధించిన మాట
14. గాలి వెలుతుర్లు తెచ్చేది
15. అణువంత
16. ఒక యేడు
17. సాధు జంతువు
18. ఈ మాటల కొలువు ఎవరికి ?
19. పేరులో ఒకటి
20. పువ్వు
21. తినాలంటే ఉండదగ్గదే.
22. ముళ్లు, పాములు, పురుగూ పుట్రా వుండడానికి అనువైనది.

### ఆధారములు _ నిలువు

1. అతనును కాదంటే...
5. ఎండకీ వానకీ తనకం వేసుకుంటుందనా ?
6. మొక్కలూ చెట్లూ గలది
9. ముందు దీర్ఘం వుంటే పడవకి బహువచనం; లేకపోయినా ఇబ్బంది లేదు-శరీరం
10. ఒకట్లు మూడు

# వనిత మాటల కొలువు-52

## రూ 150లు బహుమతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 14 | ■ | 2 | 15 | | 16 | ■ |
| 3 | | | ■ | | ■ | 4 | |
| ■ | | ■ | 17 | ■ | 5 | | ■ |
| 18 | ■ | 6 | | | | ■ | 19 |
| 7 | 20 | | ■ | ■ | 8 | | |
| ■ | | ■ | 9 | | | ■ | ■ |
| 10 | | ■ | | ■ | 11 | 21 | 22 |
| 12 | | | | ■ | ■ | 13 | |

పేరు ______________________

చిరునామా ______________________

______________________

______________________

# చూపుకి అందం కంటికి చలవ

## అదే ఐటెక్స్ కాటుక



స్థానికమైన ఉత్తమ తైలముల మూలికల మిశ్రమంతో శాస్త్రరీత్యా తయారైనది ఐటెక్స్.




పెట్రోలియమ్ జెల్లీగాని, మైనం గాని, ఏ విధమైన రంగుగాని చేర్చబడనిది ఐటెక్స్.

కళ్ళకు కాంతి, చలవ ఆకర్షణలను కల్పించుటలో సాటిలేనిది ఐటెక్స్.

35 ఏళ్లుగా మీ అపార విశ్వాసమునకు ఒక చిహ్నము ఐటెక్స్.

మీ సౌందర్యమునకు మీ కన్నులే జీవనాడి. దానికి సాటిలేని ఉత్తమమైన కాటుకనే వాడాలి. అదే ఐటెక్స్ కాటుక అని వేరే చెప్పాలా?

ARAVIND LABORATORIES MADRAS-600 033




## లవ్ స్టోరీ
(నవల)

[రచన : బొమ్మా హేమాదేవి; ప్రచురణ : డీలక్స్ పబ్లికేషన్స్, ఏలూరు రోడ్డు, విజయవాడ-2; వెల : రూ. 6; పేజీలు : 159]

ఈ నవలంతా తమాషాగా ఉంది. భాష, శైలి, భావన అంతా ఎప్పుడో ఎక్కడో చదివామేమోనని పిస్తుంది. దానికి కారణం బహుశ మామూలు నవలలా ఉండకపోవడమేనేమో! నవలంతా చదివిన తర్వాత ఇంగ్లీష్ నవల చదివిన ఫీలింగ్ కలుగుతుంది. లాజిక్కు కోసరం వెదక్కుండా ప్రతిక్షణం నిజమా? అని ఆశ్చర్యపడకుండా చదివితే బావుంటుంది.

ఈ నవల కథానాయిక 'రాజాబేటీ' ఒక జమీందారు ఫాయిదాలో వేట అంటే ఇష్టం ఉన్న సంపన్నుడి నాల్గవ కూతురు. చిన్నప్పటినుంచీ మొగపిల్లాడిలా వేట, గుర్రపు స్వారీ, హంటరుతో కొట్టడానికి అలవాటుపడ్డ పిల్ల ఆమె. బావ గోపాల్‌కు, అతని మురళికి ఆమే జీవం. కానీ, ఈమెలో మరి స్త్రీత్వపు స్పందన ఎక్కడా కలుగదు మరి. రాధాపురి జమీందారుగారి నలుగురు అబ్బాయిల్లో ఆఖరివాడు ఆడంగి లాగా పెంచబడడం వల్ల పెళ్లి కావడం లేదని తెలుస్తుంది. ఒక పులి వేటలో అతణ్ణి చూస్తుంది. అతని డైరీ చదువుతుంది. అతణ్ణి పెళ్లి చేసుకోడానికి సంసిద్ధపడుతుంది. గోపాల్ నరకయాతన పడతాడు. ప్రేమకు పెళ్లే పరమావధి కాదు అని చెప్పేస్తుంది. ఏ మాత్రం స్త్రీత్వం కనబరచని రాజాబేటీ ఆడంగితనం ఎక్కువ ఉన్న విష్ణును సంపూర్ణ పురుషుణ్ణి చేయడానికి నడుం కడుతుంది. తన పని పూర్తికాగానే, చనిపోయి మళ్లీ జన్మెత్తి ఎక్కడో ఉన్న గోపాల్‌ను పెళ్లి చేసుకుని తన పూర్వ జన్మ వృత్తాంతం స్నేహితురాలికి ముసలి భర్తకి కథారూపంలో వివరిస్తుంది.

## అనూరాధ
(నవల)

[రచన : లక్ష్మి; ప్రచురణ : ఎమ్. శేషాచలం అండ్ కో, మద్రాసు. వెల : రు. 3-50; పేజీలు : 148]

ప్రేమించిన రాధిక యాక్సిడెంట్‌లో చనిపోవటం, ఆమె పోలికలతో వున్న అనూరాధ, కృష్ణకు పరిచయం కావటం కథకు మూలం. చెప్పుడు మాటల వల్ల, అనుకోకుండా జరిగే చిన్న చిన్న సంఘటనల వల్లా కృష్ణ అంటే అనూరాధకు సదభిప్రాయం వుండదు.

చిరుజీవితంలోనే చాలా బాధలు అనుభవించిన కృష్ణ, రాధకు దగ్గర కావాలని, ఆమె అభిమానం పొందాలని ప్రయత్నిస్తాడు.

వీరిద్దరి కోపతాపాలు, దాగుడుమూతలు ఆఖరి పేజీల్లో అంతమయి కథ సుఖాంతమవుతుంది.

కొన్ని సన్నివేశాలు, సంభాషణలు విసుగనిపించి పేజీలు తిప్పేసే అవకాశముంది.

పఠితలు, ఈ రకం కథలు, నవలలు ఇదివరలో చాలా చదివే వుంటారు. "మామూలు కథే.... కొత్తదనంగాని, ప్రత్యేకతగాని ఏముంది ఇందులో" అని పాఠకులు అనుకొనే ప్రమాదముంది.

వ్రాసే శక్తి, వ్రాయగల్గిన సత్తా, చదివించే నైపుణ్యమూ వున్న రచయిత్రులు, పాత కథల్ని, క్రొత్త నవలలుగా మార్చే ప్రయత్నాన్ని పఠితలు హర్షించరు.

## పచ్చని జీవితానికో నచ్చిన రూలు
(కథల సంపుటి)

[రచన : డా॥ పెళ్ళకూరు జయప్రద; ప్రచురణ : స్పందన సాహితీ సమాఖ్య 23/182 E. న్యూ మున్సిపల్ క్వార్టర్స్, వేణుగోపాలపురం, మచిలీపట్నం; వెల : రు. 6; పేజీలు : 150]

తొమ్మిది కథలున్న ఈ సంపుటిలో "వయసు, భేషజాల బంగారు సంకెళ్ళు, పచ్చని జీవితానికో నచ్చిన రూలు" అనే కథలు పాఠకుల ప్రశంసలను అందుకుంటాయి.

పాతికేళ్ళ కన్యకు అనుభూతులు వుండవని టీనేజ్ గర్ల్‌తో వైవాహిక జీవితం బాగుంటుందని భ్రమపడిన ఒక యువకుని కథ 'వయసు'. తోటివాడు ధనవంతుడవుతున్నాడేమోనని బాధపడి, అసూయ చెందడం 'సగటు మనిషి'. అక్క సంసారం నిలబెట్టటానికై వితంతువుని, కులాంతర వివాహం చేసుకోకుండానే ఆమెతో జీవితాన్ని పంచుకున్న ఆదర్శవాది 'పచ్చని జీవితానికో నచ్చిన రూలు'ను సృష్టించుకుంటాడు. సిరిలో పుట్టి సిరిలో పెరిగి, ఆర్థిక పరిస్థితి తారుమారుకాగా దైన్యంగా నిలబడ్డ చిన్ననాటి స్నేహితురాలికి 'న్యాయం' చేకూర్చాలని తహతహలాడే ఓ డాక్టరు గత స్మృతులే 'న్యాయం'. దేవాలయాల్లో, దేవుని పేర జరుగుతున్న అన్యాయాలు, ఆర్థిక తారతమ్యాలు, దోపిడీలు "భగవంతుని చుట్టూ...."లో కన్పిస్తాయి. ఇందులో ఇంకా .... శ్రీరాముడి పెళ్ళి, సృష్టి జరిపిన పక్షపాతం, సృష్టిదోషం కథలు వున్నాయి. దానిమ్మపండు చుట్టూ తిరిగిన 'భేషజాల బంగారు సంకెళ్ళు, మటుకు మంచి కథ.

ఈ సగటు కథలు సామాన్య పాఠకుల్ని కాలక్షేపంగా చదవనిస్తాయి కాని....ఎదిగే పాఠకుల్ని కొంత ఇబ్బంది పెడతాయి. అదీగాక....

"దయనీయంగా, నిరామయంగా చూస్తున్న స్నేహితుని చూపులు" "ఆనాటి అనాచ్ఛాదితమైన విభ్రాంతి తాలూకు అయోమయావస్థ"లాంటి వాక్యాలు అడ్డుపడి సుఖంగా చదవనీయవు.

# ఆ రూపం!

సొగసు, శోభ
క్షణక్షణం చిందిస్తూ
మహదానందాన్నిచ్చే రంగుల్లో
దేదీప్యమానమైన డిజైన్లతో
ఫ్యాషన్ చిందిస్తూ...

ఫ్యాషన్ చిందించే బట్టలు
ఎవరినైనాసరే ఆకట్టుకోగలవి.

సూటింగులు, షర్టింగులు
చీరలు, డ్రెస్ మెటీరియల్స
మరియు డెనిమ్స్

**గొప్ప ఫ్యాషన్, అపూర్వమైన అనుభవానికి.**







**మఫత్‌లాల్ ఇండస్ట్రీస్** న్యూ షర్రాక్ మిల్స్
**మఫత్‌లాల్ ఫైన్**

everest/79/MFI/306-tl

# రాణీ బుర్రా

మన దేశంలో చలన చిత్ర రంగంలో ప్రసిద్ధి గాంచిన వనితలు ఎందరో వున్నారు. కాని ముందుగానే తగిన శిక్షణ పొంది, పట్టం పుచ్చుకుని ఆ రంగంలోకి ప్రవేశించిన వారు మనకి అరుదుగా కనిపిస్తారు. ఇలా చలనచిత్ర రంగంలో ఉత్సాహమున్నవారికి శిక్షణ గరపడానికి ఏర్పాటు చేయబడిన విద్యాలయం – పూనా ఫిలిం అండ్ టెలివిజన్ ఇన్‌స్టిట్యూట్. అక్కడ ఒక్కొక్క శాఖలోనూ శిక్షణ యిస్తారు. కథకి చిత్రానువాదం సమకూర్చడమన్నది ఒక శాఖ. దీనినే 'స్క్రిన్‌ప్లే' అని అంటారు. ఆ శాఖలో చేరి శిక్షణ పొందిన వనితలు చాలా తక్కువ మంది. వారిలో పేర్కొనదగిన వనిత–కుమారి రాణి బుర్రా.

మూడేళ్ళపాటు స్క్రిన్‌ప్లే రైటింగ్‌లో శిక్షణ పొందిన రాణి అక్కడ ప్రథమురాలుగా రావడమే కాకుండా బంగారు పతకాన్ని కూడా పొందారు! ఆ మూడు సంవత్సరాలలోనే ఒకటిన్నర సంవత్సరం ఆమె దర్శకత్వశాఖలోని మెళకువలు కూడా నేర్చు



కున్నారు, అంతేకాదు. తెలుగులో తొలి కార్టూన్ చిత్రం నిర్మించిన ఘనత కూడా ఆమెకే దక్కడం మరో విశేషం।

బొంబాయిలో పుట్టి పెరిగినా ఆమెలో తెలుగు తనం వుట్టిపడుతుంది. రాణి తండ్రిగారైన శ్రీ బుర్రా వెంకటప్పయ్య ప్లానింగ్ కమిషన్ అధ్యక్షులుగా వుండియున్నారు.

“బి. ఏ. ప్లాసైన తరువాత కొంతకాలం ‘ఇండియన్ ఎక్స్‌ప్రెస్’లో ఉప సంపాదకురాలిగా వుద్యోగం చేశాను. కాని నా దృష్టి మొదటి నుంచి స్క్రీన్‌ప్లే రైటింగ్ మీదే వుండేది. ఒక కథ రాయడం వేరు–దాన్ని చిత్రానికి తగ్గట్టు మలచడం వేరు. అది చాలా కష్టమైన పని. ఉత్సాహపూరితమైనది కూడా. అంచేత ఆ శాఖలో చేరాను.” అన్నారు రాణి.

పూనా ఫిలిం ఇన్‌స్టిట్యూట్ నుంచి వచ్చిన తరువాత ఆమెకు ‘గారంబీ కా-బాపు’ మరాఠీ చిత్రానికి స్క్రీన్‌ప్లే రాసే అవకాశం లభించింది. అంతకు ముందే అది నవలగా వెలువడి బహుళ ప్రజాదరణ పొందింది. ఐక్యరాజ్యసమితి విభాగమైన యునెస్కో ఆంగ్లంలోకి తర్జుమా చేయించిన బహుకొద్ది భారతీయ భాషా నవలలో అది ఒకటి.

బాలల కోసం నిర్మించబడిన ‘హంగామా’, సాయిపరాంజ్‌పే తీసిన ‘జాదూ కా చాంద్’ చిత్రాలకు ఆమె స్క్రీన్‌ప్లే సమకూర్చారు. ఇవికాక వ్యాపార ప్రకటనా సంస్థలు నిర్మించిన అనేక హ్రస్వ చిత్రాలకి, ఆమెరికా దేశపు స్వచ్ఛంద సేవా సంస్థ అయిన ‘కేర్’ కోసం ఆరోగ్య సూత్రాల గురించి తెలిపే కథా వస్తువు గల చిత్రానికి స్క్రీన్‌ప్లే రాశారు. దూరదర్శిని కోసం కూడా ఆమె కొన్ని వైజ్ఞానిక చిత్రాలు నిర్మించారు. వాటిల్లో పేర్కొనదగినవి – సెన్స్ ఆఫ్ స్మెల్స్; సీతాకోక చిలక జీవితం పైన నిర్మించిన చిత్రం.

చలనచిత్ర రంగంలోకి ప్రవేశించినా ఆమె జర్నలిజంని విడనాడలేదు. గత సంవత్సరం జరిగిన ఫిల్మోత్సవ్ సందర్భంగా వెలువరించిన సూవెనీర్‌కి, ‘ఇండియన్ సినిమా 77-78’ అనే గ్రంథానికీ, ఫిలిం ఫైనాన్స్ కార్పొరేషన్‌వారి న్యూస్ లెటర్‌కి ఆమె సంపాదకత్వం నెరిపారు.

ఇలా ఒక చెంప చిత్రాలకి స్క్రీన్‌ప్లే సమకూరుస్తూ మరో వైపు జర్నలిస్టుగా వుంటూనే సొంతంగా ఆమె బాలల చిత్ర నిర్మాణం కూడా తలపెట్టారు. అందుకు ‘చిల్డ్రన్స్ ఫిలిం సొసైటీ’ మద్దతు లభించింది. అయితే ఈ చిత్రాన్ని మామూలు చిత్రాలకి భిన్నంగా కార్టూను చిత్రంగా నిర్మించదలచుకున్నారు ఆమె. అందుకు తగ్గ కథనే ఎన్నుకున్నారు.

ఆంధ్ర దేశంలో విశేషంగా ప్రచారంలో వున్న ‘పేను–పెసర చేను’ కథ అది.

“ఈ కథనే ఎందుకు ఎన్నుకున్నారు అని చాలామంది నన్ను ప్రశ్నించారు. ఎంతటి అల్ప జీవులైనా కలిసి కట్టుగా వుంటే నిరంకుశ పరిపాలనను జయించవచ్చు–అని నిరూపించే కథ యిది. ఇందులో ఐకమత్యం గురించి ప్రబోధం వుంది. నిరంకుశపాలన ఎలా రూపుమాప వచ్చునో చెబుతుంది. అందుకే ఈ కథ నాకు నచ్చింది” అన్నారు రాణి.

దాదాపు పద్దెనిమిది నిమిషాల సేపు సాగే ఈ వర్ణ చిత్రంలో పేను, రాయి, తేలు, పాము, పులి నిరంకుశుడైన రాజు, భటులు, పల్లెప్రజలు అన్ని పాత్రలూ కార్టూను రూపంలో వుంటాయి. కలంకారీ పద్ధతిలో ఈ కార్టూన్లను మిక్కీ పటేల్ రూపొందించారు. మచిలీపట్నం, శ్రీ కాళహస్తి మొదలైన ప్రాంతాలు పర్యటించి కలం కారి పని తనాన్ని క్షుణ్ణంగా పరిశీలించి ఈ కార్టూన్లు రూపొందించడం జరిగింది. ఈ చిత్రానికి ప్రముఖ ఏనిమేషన్ దర్శకుడు రామ్మోహన్ దర్శకత్వం వహించారు. స్క్రీన్‌ప్లే, నిర్మాణ బాధ్యతను రాణి బుర్రా నిర్వహించారు. □

# వనిత సంవత్సర పరీక్ష

**వనిత సంవత్సర పరీక్షలో ఈసారి కూడా పాఠకులు ఉత్సాహంగా పాల్గొనడం సంతోషం! అయితే, వచ్చిన సమాధానాలలో కొన్ని రైట** యినా, చాలామంది ముగ్గులు సరిగ్గా వెయ్యలేదు. మరికొందరు 5వ ప్రశ్నకి సమాధానం రాయడంలో కారణాలు సరిగ్గా చెప్పలేక పోయారు. అలాగే 15వ ప్రశ్నకి పంపిన సమాధానం కూడా. ఈ విధంగా చూసుకుని, వచ్చిన వాటిలో తృప్తికరమైన (5, 15 ప్రశ్నలకు) సమాధానాలు ఇచ్చిన 50 సమాధాన పత్రాలను ఎన్నుకున్నాము. ఈ యాభై మందికీ “ఉపయోగకరమైన బహుమతి”ని ‘దీపావళి’ పండగకు ముందుగా అందేలా పంపుతాము. ఈ పరీక్షలో పాల్గొన్న వారందరికీ కూడా – ఎన్నిక కాబడిన వారితోపాటు అభినందనలు తెల్పుకుంటున్నాము.

ఎన్నికైనవారు :

1. ఎ. శ్రీదేవి, విశాఖపట్నం 2. కె. మున్నీ, తుని 3. ఎం. సీత, బరోడా 4. బి. రమణి, సికింద్రాబాద్ 5. బి. కృష్ణవేణి, మద్రాసు 6. జి. ఇందిరామూర్తి, కావలి 7. ఎన్. అరుణ శ్రీనివాస్, కలకత్తా 8. ఆర్. ధనలక్ష్మి, జయపూర్ 9. బి. పద్మావతీ రామలింగం, మద్రాసు 10. పి. వందన, కోవెలకుంట్ల 11. వి. కల్యాణి, నాగార్జునసాగర్ 12. ఆర్. ఉషారాణి, వాస్కోడాగామా 13. ఐ. ఎన్. ప్రభ, కాకినాడ 14. వి. నిర్మల, మద్రాసు 15. కె. జానకీదేవి, భీమవరం 16. బి. సీతాకుమారి, తిరుపూరు 17. వి. విశాలాక్షి, ఖమ్మం 18. ఆర్. పద్మా శ్రీనివాసన్, హైదరాబాదు 19. ఎన్. జయలక్ష్మి, హోసూరు 20. ఎస్. విజయలక్ష్మి, బరోడా 21. జె. లక్ష్మి దత్తాత్రేయ, సికింద్రాబాదు 22. ఎం. కె. యస్. అమ్మాణి, భీమునిపట్నం 23. ఎ. ఉమానరసింహరావు, సికింద్రాబాదు 24. డి. తులసి, విశాఖపట్నం 25. ఎన్. కామేశ్వరీమూర్తి, దుర్గాపూర్ 26. సి. రాధాకుమారి, చికాలిం (గోవా) 27. ఎన్. ఉషారాణి, చిత్తూరు 28. నిర్మల కృష్ణ, తిరుపతి 29. కె. సరోజ, తణుకు 30. ఎస్. కమలకుమారి, నెల్లూరు 31. ఆర్. దీప, కోరగుంటపల్లి 32. డి. కౌసల్యా కృపాకర్, జలంధర్ 33. డి. రాజ్యలక్ష్మి, కుమ్‌హారి (మ.ప్ర) 34. సునందలక్ష్మి, విజయవాడ 35. హెచ్. వి. హేమవతి, హోసూరు 36. ఆర్. శ్యామల, కొవ్వూరు 37. ఎ. నీలావతి, అనంతపురం 38. ఎ. వి. రమణి, మద్రాసు 39. జి. సరస్వతమ్మ, శ్రీకాకుళం 40. ఎ. శాంత, తిరుపతి 41. పి. నిర్మల, విజయవాడ 42. జి. రామామణి, శ్రీకాకుళం 43. బి. పద్మావతి, సికిందరాబాదు 44. కె. కనకదుర్గ, ఒంగోలు 45. కె. జీవేంద్ర, ఘాగల్లు 46. కె. స్వప్న, మద్దికెర 47. జీనత్ ఖాదర్, చీరాల 48. ఎ. నాగమణి, శ్రీకాకుళం 49. పి. సరస్వతి, అనంతపురం 50. డి. సుశీలాదేవి, కాకినాడ.

# బరువు తగ్గడం ఎలా?



మన అందానికి, ఆరోగ్యానికీ మన బరువుకూ అవినాభావ సంబంధం వుంది. సన్నగా వున్నవారు చూడడానికి ఎంతో చలాకీగా నాజూగ్గా వుంటారు. అయితే స్థూలకాయులు పదిమందిలో పరిహాసానికి లోనైనట్టూ, నలుగురూ తమను చూసే జోకులు విసురుతున్నట్లు తమకు తామే అనుకుని ఒకవిధమైన న్యూనతా భావానికి లోనౌతారు. అంతేకాదు మనిషి బరువు ఎక్కువయ్యేకొద్దీ–డయాబిటిస్, గుండెపోటు, కేన్సర్ మొ॥ వ్యాధులు వచ్చే అవకాశాలూ ఎక్కువవుతాయి. వ్యాధి నిరోధక శక్తి కూడా క్రమక్రమంగా తగ్గిపోతుంది. అందువల్ల–మధ్య వయస్కులకు, వయసుమళ్ళిన వారికీ బరువు పెరగడం ప్రారంభమయినట్లయితే–వారిలో చాలామందికి చావు సమీపించినట్లే లెక్క—అని వారిని గురించి సేకరించిన వివరాల వల్ల తెలుస్తోంది. బ్రతకడానికీ, రోజూ మన పనులు మనం సక్రమంగా చకచకా చేసుకోడానికీ ఆహారం చాలా అవసరమే. అయితే మితిమించి తిన్నట్లయితే అదే మన బరువును పెంచి వ్యాధులకు ఆయత్తం చేస్తుంది. అమృతమైనా సరే ఎక్కువైతే విషం అన్నది అనుభవజ్ఞుల మాట. అందువల్ల ఆహారం విషయంలో జాగ్రత్త వహించడం ఎంతైనా అవసరం.

మనం ఎంత ఆహారం తీసుకుంటే మంచిది? అన్నదానికి అనుగుణంగా కావలసినంత ఆహారం మాత్రం తీసుకునే స్థితి మన శరీరంలో ప్రకృతిసిద్ధంగానే ఏర్పడి వుంది. మెదడులోని ఒక భాగం ఈ పనిని నిర్వహిస్తుంది.

రక్తంలో గ్లూకోజ్ తగ్గినట్లయితే ఆకలేస్తుంది. ఆహారం తీసుకోగానే రక్తంలోని గ్లూకోజ్ మునుపటి స్థాయికి వచ్చినపుడు ఆకలి తీరి కడుపు నిండిన ఫీలింగ్ ఏర్పడుతుంది. అంతటితో భోజనం ముగించాలి. ఇలా ఆకలికి మాత్రం (జబ్బుకు మందులా) ఆహారం తీసుకునే వారికి బరువు ఎక్కువవుతుందన్న సమస్య సాధారణంగా రానేరాదు. జిహ్వాచాపల్యం కొద్దీ మనసు పట్టలేక మితిమించి తినేవారిలోనే లావెక్కడం అన్న సమస్య వస్తుంది.

లావెక్కడం అన్నది మధ్యవయస్కులలోనే ఎక్కువ. దీనికి కారణం వీరిలో ఆకలి ఒక క్రమపద్ధతిలో వుండదు. ఆకలికి ఆహారం తీసుకున్నా, గ్లూకోజ్ రక్తంలో సమకూరినా ఆకలి తీరినట్లు అనిపించదు. ఎక్కువగా తింటూనే వుంటారు. అంటే వీళ్ళలోని ఆకలే వీళ్ళని మోసంచేస్తుందన్నమాట.

వయసు పోనుపోను శరీరంలోని క్రొవ్వు కండరాలు ఎక్కువవుతాయి. వాటి నుంచి స్రవించే క్రొవ్వులు ఎక్కువగా గల ఆమ్లాలు–గ్లూకోజ్‌ను పీల్చుకోకుండా కండరాలకు ఆటంకం కల్గిస్తాయి. ఇది ఇన్సులిన్ ప్రభావంతో క్రొవ్వుగా మారుతుంది. దీనివల్ల రక్తంలో మరిన్ని క్రొవ్వులు చేరుతాయి. దానివల్ల డయాబిటిస్, గుండె పోటు, కేన్సర్ మొదలైన వ్యాధులు సంక్రమిస్తాయి.

బరువు తగ్గాలంటే–అది మనం తీసుకునే ఆహారంతోనే ప్రారంభించాలి. రకరకాల ఆహారాలు రకరకాలుగా శరీర అభివృద్ధికి దోహదం చేస్తాయి. ఆరోగ్యాన్ని ప్రభావితం చేస్తాయి. ఒక కెలోరీ ఆహారమే అయినప్పటికీ కార్బొహైడ్రేట్లు ఎక్కువగా వున్న చక్కెర, తేనె, వరి అన్నం, రొట్టె మొదలైనవి కాయగూరలు, ఆకుకూరలకన్నా ఎక్కువగా ఇన్సులిన్ స్రవించడానికి దోహదం చేస్తాయి. బరువు పెరగడానికి ముఖ్యకారణం ఇన్సులిన్. స్థూలకాయులు కొలెస్టరాల్ వుండే ఆహారపదార్థాలు కూడా తీసుకోకూడదు. వీరికి స్వీట్స్ ఐస్‌క్రీమ్ లాంటివి అపాయం కల్గిస్తాయి.

మనకు కావలసినదానికన్నా రోజుకు ఒక్కశాతం ఆహారం ఎక్కువ తీసుకున్నా చాలు–దానివల్ల ఏడాదికి 0.9 కిలో బరువు ఎక్కువవుతుంది. ఈ లెక్క ప్రకారం ముప్పై యేళ్ళలో మనకు తెలియకుండానే ఇంచుమించు 25.4 కిలోల బరువు ఎక్కువవుతామని వైద్యవేత్తలు చెబుతారు.

ఏడిస్తే చాలు–వెంటనే పాపాయి చేతికి చాక్లెట్ లేదా ఏదైనా తినుబండారం అందిస్తారు కొందరు. మరికొందరు తల్లులు పాప మీది ప్రేమతో వేళాపాళా లేకుండా తలచినపుడల్లా తినుబండారాలు ఇస్తూనే వుంటారు.

ఇలాంటి పిల్లలే పెద్దయ్యాక తినుబండారాల మీదా తీపి వంటకాల మీదా ప్రాణం పెంచుకుంటారు.

మనసు సరిగా లేనప్పుడు కొందరు భోంచేయడం మానేస్తే-మరి కొందరేమో వ్యాకులమైన మనసుతో వున్నప్పుడు ఏదైనా తింటూ ఊరట చెందుతారని మన స్తత్వవేత్తలు చెబుతారు. లైంగిక తృప్తి కొరవడినవారు కూడా తరచూ ఏదో తింటూ వుంటారుట!

డయటింగ్ - అంటే ఆహారం తీసుకోడం తగ్గిస్తూ పస్తులుంటూ బరువు తగ్గించడం అన్నది వైద్యుల పర్యవేక్షణలో జరగడం మంచిది. ఆహారం తక్కువగా తీసుకునేప్పుడు అందులో పోషక పదార్థాలు-ముఖ్యంగా విటమినులు, ప్రొటీన్లు చాలినంతగా వుండేట్టు చూసుకోవాలి. అప్పుడే అలసట-నీరసం, బలహీనత ఏర్పడకుండా వుంటుంది.

ఒకరోజు, లేదా ఒకపూట భోజనం మానేసి మరుపూట కడుపునిండా పట్టించడంవల్ల బరువు తగ్గదు సరికదా పెరగడానికి ఎక్కువ అవకాశం వుంది.

రోజుకు ఒకటి రెండు పూటలే భోజనం చేసేకన్నా తీసుకోవలసిన ఆహారాన్ని విభజించి నాలుగైదుసార్లు తీసుకోడంవల్ల ఇన్సులిన్ తక్కువగా స్రవిస్తుంది. అంచేత అలాంటివారు త్వరగా లావెక్కరు. ఇంకోవిషయం ఏమంటే రోజుకు తీసుకునే మొత్తం ఆహారంలో మూడింట రెండువంతులు మధ్యాహ్నానికి ముందే ముగించడం చాలా ముఖ్యం.

ఆహార నియమంతోపాటు తేలిక వ్యాయామాలు, యోగాసనాలు, రోజూ కొద్దిదూరం నడవడం మొదలైనవి కూడా శరీరం సన్నబడడానికి ఎంతైనా దోహదం చేస్తాయి.

## పిల్లలు - బరువు, ఎత్తు

పెరిగే పిల్లలు ముఖ్యంగా ఐదారేళ్ళ పాపలు సన్నగా వుంటారు. దీనికి కారణం—పదినెలల ప్రాయంలోని పాపకండరాల పరిమాణంలో సగమే వుంటుంది పదేళ్ళ ప్రాయంలో. దీనిని తెలుసుకోకుండా కొందరు తల్లిదండ్రులు పిల్లలు చిక్కిపోతున్నారని హైరాన పడుతుంటారు. ఇంతకూ ఆరోగ్యవంతమైన పాప ఏ ప్రాయంలో ఎంత ఎత్తు, ఎంత బరువు వుండాలన్న విషయం తెలుసుకోడం మంచిది.

నాలుగు సంవత్సరాల నుంచి పదకొండేళ్ళ వరకు పిల్లల సగటు ఎత్తును తెలుసుకోవాలంటే—(వయసు × 2) + 32 అంగుళాలు అని లెక్కగట్టాలి. ఉదాహరణకు ఐదేళ్ళ పాపాయి ఎత్తు $(5\times2) + 32 = 42$ అంగుళాలు వుండాలన్నమాట. సెంటిమీటర్లలో అయితే 2.5తో గుణించాలి. ఒకటి రెండు అంగుళాలు అటూ ఇటూ వుండొచ్చు.

ఇక బరువు విషయానికి వస్తే రెండేళ్ళ నుంచి పన్నెండేళ్ళ పిల్లల బరువు ఇలా వుండాలి: (వయసు + 3)×5 అని లెక్కవేయాలి. ఐదు సంవత్సరాల పాప అనుకుంటే $(5 + 3)\times5 = 40$ పౌండ్లు బరువు వుండాలి. ఒకటి రెండు పౌండ్లు అటూ, ఇటూ వున్నా ఫరవాలేదు. పౌండ్లలో వచ్చే బరువును 2.2 తో భాగించినట్లయితే కిలోగ్రాముల్లో వస్తుంది.

—డాక్టర్



# సెన్సస్

నేనొక ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయినిని. ఒకసారి నన్నూ, నాతోపాటు మరికొందరు టీచర్లను చిన్నపిల్లల జనాభా లెక్కలు తీయడానికి నియమించారు. అంటే ఒక్కొక్క యింట్లో ఎంతమంది పిల్లలు వున్నారనే కాకుండా - ఎంతమంది ఛదువుకుంటున్నారు అనే విషయం మీద కూడా మేం వివరాలు సేకరించాలన్న మాట. 'ఓస్ యిదెంత పని' అనుకుని మేము రంగంలోకి దూకాం. మాకు మూడు కాలనీలు కేటాయించారు. ఆ మూడు కాలనీలు చుట్టి వచ్చేసరికి ముల్లోకాలు చుట్టినంత పనైంది మాకు. అప్పటికిగాని తెలిసి రాలేదు అదెంత కష్టమైన పనో.

ఆ కాలనీలలోకి ప్రవేశించడానికి ముందుగానే మాకో మురికి కాలవ ఎదురుపడింది. ఆ ప్రదేశమంతా అపరిశుద్ధంగా వుంది. అయినా అక్కడి వాళ్ళు ఆదే గంగానదిలా భావించి అందులోనే సకల కృత్యాలు చేసుకుపోతున్నారు. ఎలాగో ముక్కు మూసుకుని కాలవ దాటాము.

అవన్నీ సామాన్య మధ్యతరగతి కుటుంబాలు. మొట్టమొదట ఒక యింట్లో ప్రవేశించాము.

"మీ ఇంటి యజమాని పేరేమిటమ్మా?" అనే ప్రశ్నతో ప్రారంభించాం.

ఆవిడ సనాతన స్త్రీలా అనిపించింది చూడగానే. అందుకు తగ్గట్టుగానే ఆవిడ "అయ్యో... ఆయన పేరు నేనెలా చెప్పను? ఆయనా యింట్లో లేరాయె — పోనీ పిల్లలచేత చెప్పిద్దామనుకుంటే వాళ్ళూ ఆడుకోడానికి వెళ్ళారాయె" అంటూ సాగదీసింది.

ఇక లాభంలేదని ఒక్కొక్క దేవుడి పేరే అడుగుతూ వచ్చాము. చివరికి "తిరుపతి దేవుడి పేరేనా?" అని అడిగాం.

"అవును" అని తలాడించిందావిడ.

హమ్మయ్య అనుకుని "అయితే వెంకటేశ్వర్లు అన్న మాట" అన్నాం.

"వెంకటేశ్వర్లు కాదు. వెంకయ్య" అన్నదా యిల్లాలు.

నా స్నేహితురాలికి వళ్ళు మండింది. "ఆ మాట మొదటే చెప్పొచ్చుగా హోటల్లో సర్వర్ పదార్థాల పట్టిక చదివినట్లు దేవుళ్ళ పేర్లు చదవాల్సిన అవస్థ మాకు తప్పేదిగా" అని గొణిగింది.

అక్కడినుంచి బయటపడి పక్కింటికి వెళ్లాం. ఈవిడో మతిమరుపు మనిషిలా వుంది. భర్త పేరు చెప్పి "అదే అనుకుంటాను. సరిగా గుర్తులేదు. పెళ్లిలో ఎప్పుడో చెప్పించిన పేరు" అంటూ సిగ్గుతో మెలికలు తిరిగిపోయింది.

మరో యింట్లో - "బడికి వెళ్ళే పిల్లలు ఎవరైనా వున్నారా?" అని అడిగితే "లేరు" అని సమాధానం చెప్పిందా యిల్లాలు.

అక్కడో కుర్రాడు గోళీలాడుకుంటున్నాడు. అతన్ని చూసి, "మరైతే ఆ అబ్బాయి ఎవరు?" అని అడిగాము.

"మా పిల్లాడే. మూడో క్లాసు చదువుతున్నాడు. వాళ్ళకిప్పుడు సెలవులు. అంచేత బడికి వెళ్ళటం లేదు" అన్నదా అయోమయం.

మరోచోట మమ్మల్ని, మా చేతులోని ఫైళ్ళని, భుజాన వున్న బ్యాగులని చూడగానే గబుక్కున తలుపులు మూసేశారు. మాకు అర్థంకాక ఒకరి మొహాలొకరు చూసుకున్నాం. ఎంత తలుపు తట్టినా వాళ్ల తియ్యలేదు. మేం విధి సరిగా నిర్వర్తించామో లేదో చూసేందుకు ఓ చెకింగ్ వుందాయె. అంచేత తలుపు మీద 'సమాధానం లేదు' అని రాశాం. మేం నాలుగడుగులు వేయగానే తలుపులు తెరిచి తలుపు మీద మేం రాసిన అక్షరాలని ఆ యింట్లో వాళ్ళు తుడిచేయసాగారు. ఆ ప్రదేశంలో ఒకప్పుడు అమ్మవారి భయం వుండేదిట. మేం సూదులు పొడవడానికి వచ్చామేమోనన్న భయంతో వాళ్ళు తలుపేసుకున్నట్లున్నారు.

తిరిగి తిరిగి చివరికి రెండో కాలనీకి వచ్చాం.

"అమ్మా! ఈ యింట్లో చదువుకునే పిల్లలున్నారా?" అని ఆ కాలనీలో ఒకావిడని అడగ్గానే ఆవిడ భోరుమని ఏడవడం ప్రారంభించింది. కారణం తెలియక మేం బిక్క చచ్చిపోయాం. బతిమాలగా బతిమాలగా ఆవిడ ఏడుపు మాని, "నాకు ముగ్గురు పిల్లలు వుండేవాళ్ళు. మాయదారి రోగం వాళ్ళని పొట్టన పెట్టుకుందిరోయ్ దేవుడా" అంటూ చెప్తూ చెప్తూనే ఏడుపు లంకించుకుంది. ఇక





యడవల్లి అనూరాధ

కొందరు చదువుల్లో చాలా గొప్ప ప్రావీణ్యత చూపిస్తారు. అలాంటివాళ్లలో యడవల్లి అనూరాధ ఒకరు. ఇరవైఒక్కఏళ్ల అనూరాధ, ప్రతిచోటా ప్రథమశ్రేణిలో వస్తూ రెండుసార్లు 'స్వర్ణపతకాలు' కూడా పొందింది. ఆమె యస్. యస్. సి చదువుతున్నప్పుడు 'ఫస్ట్‌క్లాస్' తెచ్చుకున్నది. దాంతోపాటు 'నేషనల్ మెరిట్ సర్టిఫికేట్' కూడా పొందింది. ఇంటర్‌మీడియట్‌లో కూడా 'ఫస్ట్‌క్లాస్'లో వచ్చింది. బి. యస్‌సి (బోటనీ)లో (వాల్తేరు) కూడా ప్రథమశ్రేణిలో వచ్చింది! తర్వాత సాగర్ యూనివర్శిటీ (మధ్యప్రదేశ్) ద్వారా యమ్. ఎస్‌సిలో కూడా ప్రథమశ్రేణిలోనే వచ్చింది. బోటనీలోనూ, బయోసైన్సెస్‌లోనూ ప్రథమశ్రేణిలో వచ్చినందుకుగాను, ఆమె రెండు బంగారు పతకాలు పొందింది. అనూరాధ ఆ యూనివర్శిటీలోనే పిహెచ్.డి. చెయ్యాలనుకుంటున్నది. ఆమె తండ్రి శ్రీ వై. వి. సన్యాసిరావు-ఫెర్రో అల్లాయేస్ కార్పొరేషన్ (శ్రీరామ్‌నగర్)లో లా ఆఫీసర్‌గా వుంటున్నారు.

—టి. వి

ఆవిడ్ని ఓదార్చడం మా తరం కాదని పక్కింటికి చేరుకున్నాం.

ఆ పక్కింటావిడ ఏదో వంట పనిలో మునిగి వుంది. మేం రెండు మూడుసార్లు అరిచినా పలకలేదు. ఓ పావుగంట తర్వాత యివతలికి వచ్చి "మా యింట్లో బడికి వెళ్లే పిల్లలెవరూ లేరు" అంది తాపీగా. "వంటంతా అయిందా తల్లీ" అని పరామర్శిద్దామనుకుని బలవంతాన ఆపుకుని అక్కడ్నుంచి బయటపడ్డాం.

మరో యింట్లో వీటన్నిటికన్న భిన్నమైన పరిస్థితే ఎదురైంది మాకు. మేం కుటుంబ నియంత్రణ శాఖనుండి వచ్చామనుకుని ఆవిడ ముగ్గురు పిల్లల్ని వంటింట్లో దాచి యిద్దరబ్బాయిల్ని మా ముందుకు తోసింది. "మాకు వీళ్ళిద్దరే పిల్లలు. నిజం.... యిప్పట్నుంచి ఆపరేషన్ ఎందుకండీ" అంటూ నాన్చింది. ఆపరేషన్ అంటే ఆవిడకి భయమనీ, వాళ్ళాయనకి యిష్టంలేదనీ సోది చెప్పడం ప్రారంభించింది.

అసలు మేం ఎవరమో.... ఎందుకు వచ్చామో చెప్పడానికే ఆవిడ అవకాశం యివ్వలేదు. ఇంతలో వంటింటి తలుపు చాటునుంచి ఓ అమ్మాయి తొంగిచూసి "అమ్మా! నేను బయటికి రావచ్చా.... వాళ్ళెళ్ళిపోయారా?" అని అరిచింది.

పాపం ఆవిడ తేలుకుట్టిన దొంగలాగా మావైపు చూసింది. ఈవిడతో లాభం లేదనుకుని ఆ పాపను పిలిచి మాకు కావలసిన వివరాలు రాసుకున్నాము.

ఈ జనాభా లెక్కల సేకరణ కాదుగానీ మాకు ఎందరో విచిత్రమైన వ్యక్తులు ఎదురయ్యారు. కొందరు యిల్లాళ్ళకు, తమ పిల్లలు ఏ బడిలో చదువుతున్నారో తెలీదు. మేమే కొన్ని కొండగుర్తులు చెప్పి అది ఏ స్కూలో తెలుసుకుని రాసుకున్నాం.

మరో యింట్లో మమ్మల్ని చూడగానే చందాలవాళ్ళం అనుకుని "ప్రతి సంవత్సరం వీళ్ళతోక తద్దినం" అని విసుక్కుంటూ కుక్కని మా మీదకి ఉసికొల్పారు. బెదిరిపోయి ఒక్క పరుగుతో యివతలికి వచ్చిపడ్డాం.

ఆ పక్కింట్లో "మీ అబ్బాయి ఎప్పుడు పుట్టాడు?" అని ప్రశ్నిస్తే, "మా అబ్బాయి పుట్టినరోజు నాకు సరిగ్గా గుర్తులేదు. కాని యిక్కడ గంగమ్మ జాతర జరిగింది తెలుసుకదా.... సరిగ్గా ఆ రోజే పుట్టాడు వీడు" అందావిడ ప్రేమగా పిల్లాడి తల నిమురుతూ. ప్రతి సంవత్సరం జాతర జరుగుతూనే వుంటుంది. ఏ సంవత్సరపు జాతర అని రాసుకోం చెప్పండి!

కొందరు పిల్లల వయసు తెలియదంటారు. తెలిసినా కావాలనే తప్పు చెప్పేవారు కొందరు. అక్కడ మూడోక్లాసు పాఠం చదువుతున్న ఓ అబ్బాయిని చూసి "అతని కెన్నేళ్ళు" అని అడిగాము.

"ఆరేళ్ళు.... మొన్ననేగా వచ్చాయి" అంది వాళ్ళమ్మ.

మేం ఆశ్చర్యంతో తల మునకలయ్యాము 'ఆరేళ్ళకే మూడోక్లాసు చదివేంతటి బృహస్పతా' అనిపించింది. ఇంతలో ఆ అబ్బాయే మా సమస్య తీర్చాడు. పాపం తర్వాత తిట్లుతిన్నా తినివుంటాడు. ఇంతకీ ఆ అబ్బాయి అన్నది ఒక్కమాటే — "అమ్మా! నాకు ఎనిమిదేళ్ళు కదే!"

మరో యింట్లో వాళ్ళబ్బాయి వయసు 'ఆరు' అందా యిల్లాలు. "అయితే పుట్టిన సంవత్సరం 1973 కదూ" అంటే "అరె... మీకెలా తెలుసు... ఎంత తెలివైనవాళ్లో" అంటూ ఆశ్చర్యపోయిందా యిల్లాలు.

ఆ పక్క యింట్లో ఆమె "నేను చెప్పేది నిజమే... కావాలంటే ప్రమాణం చేస్తాను. మా అబ్బాయి చదివేది ఒకటోక్లాసు. వాడి వయసు తొమ్మిది" అంటూ వాదించబోయింది.

పక్క వాటాలో ఆమె అయితే "మా పాప వయసు ఆరు సంవత్సరాలు. పుట్టింది 1970 లో" అంటూ ఏవేవో రుజువులు చూపడానికి ప్రయత్నించింది.

ఈవిడైనా ఫరవాలేదుగానీ మూడో కాలనీలో ఒక యింట్లో మేం అడిగినవాటికి సమాధానం చెప్పకుండా మమ్మల్నే ప్రశ్నించడం ప్రారంభించారు. మా స్కూలు, ఉద్యోగం, జీతం గురించి వివరాలు అడగడం, మా చీరలు, నగలు ముట్టుకుని చూస్తూ వాటి గురించి ఆరాలు తీయడం వంటివి చేయసాగారు. వాళ్ళదగ్గర నుంచి మాకు కావలసిన వివరాలు సేకరించేప్పటికి మరో జన్మ ఎత్తినంత పనైంది మాకు.

అయితే ఏమాటకామాటే చెప్పుకోవాలి. ఇన్ని యిబ్బందుల మధ్య కూడా కొందరి ప్రవర్తన మాకు ఎంతో హాయిగా అన్పించింది. వాళ్లు ఎంతో ఓపికగా సమాధానాలు చెప్పి సహకరించారు.

అలా మూడు రోజులపాటు ఆ స్వర్గభూమిలో విహరించిన మేము చివరికి ఎలాగైతేనేం 'పిల్లల జనాభా లెక్కల తంతు ముగిసింది' అనిపించాక, "అమ్మయ్య" అనుకున్నాం.

—ఎమ్. ఎస్. కమల

# సంస్కృత పాఠమాల (10)

**संयुक्त अक्षराणि** సంయుక్త అక్షరాణి = సంయుక్తాక్షరములు.

(రెండు అక్షరములు)

| | | | |
|---|---|---|---|
| క్ + క = క్క | జ్ + జ = జ్జ | ద్ + య = ద్య | ల్ + ల = ల్ల |
| क् + क = क्क | ज् + ज = ज्ज | द् + य = द्य | ल् + ल = ल्ल |
| క్ + త = క్త | ట్ + వ = ట్వ | న్ + న = న్న | వ్ + య = వ్య |
| क् + त = क्त | ट् + व = ट्व | न् + न = न्न | व् + य = व्य |
| క్ + య = క్య | డ్ + డ = డ్డ | ప్ + త = ప్త | శ్ + య = శ్య |
| क् + य = क्य | ड् + ड = ड्ड | प् + त = प्त | श् + य = श्य |
| క్ + ర = క్ర | డ్ + ర = డ్ర | ప్ + ప = ప్ప | ష్ + ణ = ష్ణ |
| क् + र = क्र | ड् + र = ड्र | प् + प = प्प | ष् + ण = ष्ण |
| క్ + వ = క్వ | ణ్ + ణ = ణ్ణ | ప్ + ర = ప్ర | ష్ + మ = ష్మ |
| क् + व = क्व | ण् + ण = ण्ण | प् + र = प्र | ष् + म = ष्म |
| క్ + శ = క్శ | త్ + త = త్త | బ్ + బ = బ్బ | స్ + క = స్క |
| क् + श = क्श | त् + त = त्त | ब् + ब = ब्ब | स् + क = स्क |
| క్ + ష = క్ష | త్ + న = త్న | భ్ + న = భ్న | స్ + న = స్న |
| क् + ष = क्ष | त् + न = त्न | भ् + न = भ्न | स् + न = स्न |
| క్ + స = క్స | త్ + య = త్య | మ్ + మ = మ్మ | న + న = న |
| क् + स = क्स | त् + य = त्य | म् + म = म्म | स् + स = स |
| గ్ + గ = గ్గ | త్ + ర = త్ర | య్ + య = య్య | హ్ + న = హ్న |
| ग् + ग = ग्ग | त् + र = त्र | य् + य = य्य | ह् + न = ह्न |
| గ్ + మ = గ్మ | ద్ + ద = ద్ద | ర్ + క = ర్క | హ్ + య = హ్య |
| ग् + म = ग्म | द् + द = द्द | र् + क = र्क | ह् + य = ह्य |
| గ్ + య = గ్య | ద్ + ధ = ద్ధ | ర్ + య = ర్య | ఞ్ + జ = ఞ్జ |
| ग् + य = ग्य | द् + ध = द्ध | र् + य = र्य | ञ् + ज = ञ्ज |
| ఙ్ + త = ఙ్త | ద్ + భ = ద్భ | ల్ + ప = ల్ప | |
| ङ् + त = ङ्त | द् + भ = द्भ | ल् + प = ल्प | |
| చ్ + చ = చ్చ | ద్ + మ = ద్మ | ల్ + య = ల్య | |
| च् + च = च्च | द् + म = द्म | ल् + य = ल्य | |

సశేష నవల

# నింగినుండి నేలకు

వాసిరెడ్డి సీతాదేవి

## 16

ఉదయం ఆఫీసుకు బయలుదేరుతూ కల్పన ముందుకు వచ్చి నిల్చున్నాడు సిద్ధార్థ.

"ఏమాలోచించావ్?"

"విడిపోవడం ఒక్కటే మార్గం!" అనేసి పొరపాటు చేశాననుకుంది.

అతను అలా ప్రశ్నించేసరికి కల్పనకు రోషం వచ్చింది.

"సరే! ఇవ్వాళే లాయర్‌తో మాట్లాడతాను." అంటూ గబగబా వెళ్ళిపోయాడు.

నిజంగానే లాయర్ దగ్గిరకు వెళ్తాడా? తనను బెదిరించడానికి అంటున్నాడు. అతనికి సమాజంలో ఓ పెద్ద అంతస్థు ఉంది. భార్యకు విడాకులు ఇచ్చిన వ్యక్తిగా సమాజం ముందు నిలబడలేడు. కేవలం బెదిరింపు మాత్రమే!

కల్పన మనసు బాగా లేదు.

మంచం మీద పడుకొని కళ్లు మూసుకుంది.

"వదినా! వదినా!" బయటి నుంచి రాజేంద్ర కేక వినిపించింది.

ఆమె లేచి బయటికి వచ్చింది.

"ఏం అలా ఉన్నారు? అరోగ్యం బాగా లేదా?"

"బాగానే ఉంది. ఏమిటి విశేషం–ఈ వేళప్పుడు వచ్చావ్?"

"నీ నవల చదివాను. అద్భుతంగా ఉంది."

కల్పన కళ్లు మెరిశాయి.

"నిజంగా?"

"నిజం!"

"పైగా ఇద్దరు రచయితలు నిన్ను చూట్టానికి వస్తున్నారు."

"ఎవరు?"

"రఘురాం, జైకిషన్!"

"నిజంగా? జైకిషన్ నవలలంటే నాకు చాలా ఇష్టం! వాళ్ళు నన్ను చూట్టానికి వస్తున్నారా? ఎప్పుడు?"

"అర్ధగంటలో వస్తారు. చెబుదామని ముందుగా వచ్చాను."

"ఇప్పుడే వస్తాను." అంటూ కల్పన వంటింట్లోకి వెళ్లింది.

వంటమనిషికి టిఫిన్ చెయ్యమని పురమాయించింది.

ముఖం, కాళ్లూ చేతులూ కడుక్కొని తల దువ్వుకుంది. చక్కగా ముస్తాబయింది. బయటికి వచ్చింది. అప్పటికే రఘురాం, జైకిషన్ వచ్చారు. రాజేంద్రతో మాట్లాడుతూ కూర్చున్నారు.

కల్పనను చూడగానే ఇద్దరూ లేచి నిల్చున్నారు. "నమస్తే" అంటూ చేతులు జోడించారు.

"నమస్తే! కూర్చోండి! మీవంటి ప్రముఖ రచయితలు నా ఇంటికి రావడం నా భాగ్యంగా భావిస్తున్నాను." అన్నది కల్పన.

జైకిషన్ కల్పన సౌందర్యానికి ముగ్ధుడై సభ్యతను కూడా మర్చిపోయి చూడసాగాడు.

"మీరు చాలా అందంగా ఉన్నారు." అనేశాడు.

కల్పన చాలా ఇబ్బందిగా ముఖం పెట్టింది.

"నా నవల చదివారా?" మాట మార్చింది.

"చదివాను. ఇది మీ మొదటి నవల అనుకుంటాను."

"అవునండీ! చాలాకాలం క్రితం ఒకటి రాశాను. కాని అది అచ్చు కాలేదు."

"నేను మిమ్మల్ని ఒకసారి రవీంద్రభారతిలో కవి సమ్మేళనంలో కలిశాను. గుర్తు లేదనుకుంటాను. మిసెస్ రాజు పరిచయం చేశారు." అన్నాడు రఘురాం.

"అవునండీ! ఇప్పుడు గుర్తొచ్చింది."

"అప్పుడు మీరేమన్నారో గుర్తుందా?"

కల్పన ఆలోచనలో పడింది. కాని గుర్తు రాలేదు.

"నా 'ఆకాశం' అనే నవల చదివానన్నారు."

"ఆఁ అవును!"

"అందులోని నాయకుడు లంపటుడు అన్నారు."

"అవునవును. గుర్తొచ్చింది."

"ఇప్పుడు మీ నవలలోని నాయకీ నాయకులిద్దరూ కూడా లంపటులేనని చెప్పడానికి విచారిస్తున్నాను." అన్నాడు రఘురాం.

జైకిషన్ రఘురాం ముఖంలోకి చూశాడు.

రాజేంద్ర ముఖం వెలావెలా పోయింది. కల్పన ముఖంలోకి జంకుతూ చూశాడు.

కల్పన పెదవుల మీద చిరునవ్వు కదిలింది.

"అంతే కాదు. మానసిక వికారాలను పవిత్ర ప్రేమ అన్నానని కూడా అంటారని నాకు తెలుసు" నవ్వుతూనే అన్నది కల్పన.

"అరే! నేను అదే మాట అనాలనుకున్నాను." ఆశ్చర్యంగా అన్నాడు రఘురాం.

కల్పన చిరునవ్వు నవ్వింది.

"కాని వికారాలూ, వికృతులు జీవిత సత్యాలు అయినప్పుడు-వాటిని సాహిత్యంలో వర్ణించడం..."

"ఎవరి జీవిత సత్యాలు?" ఆవేశంగా అన్నాడు రఘురాం.

"జీవితంలో ఒక సిద్ధాంతం, నైతిక విలువలూ లేని వారి జీవిత సత్యాలు." రఘురాం మళ్ళీ అన్నాడు.

కొన్ని క్షణాలు అందరూ మౌనం వహించారు.

"మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. ఆతర్వాత దేశంలో అవినీతి కూడా పెరిగిపోయింది. అది కుష్టు రోగంలా సాహిత్యంలోకి కూడా పాకింది."

"మేము ఇక్కడకు ఎందుకు వచ్చామో చెప్పగలరా?" జైకిషన్ అడిగాడు.

రఘురాం సంభాషణ అతనికి నచ్చలేదు. సంభాషణను మరో వైపుకు మళ్లించే ఉద్దేశ్యంతో అన్నాడు.

"రఘురాంగారు ఎందుకు వచ్చారో చెప్పారు. కాని మీరు ఎందుకు వచ్చారో చెప్పడానికి నాకు జ్యోతిషం రాదు. కవిత్వం మాత్రమే చెప్పగలను." నవ్వుతూ సమాధానం చెప్పింది కల్పన.

"మీ నవల చదివాను. కంగ్రాచ్యులేట్ చెయ్యాలని వచ్చాం. రాజేంద్ర నా మిత్రుడు. అతని ద్వారా మీ గురించి విన్నాను. అందుకే చొరవ తీసుకుని మీ ఆహ్వానం లేకుండానే వచ్చాం." అన్నాడు జైకిషన్.

"కృతజ్ఞతలు అర్పించుకుంటున్నాను మీ అభిమానానికి!"

"కేవలం కృతజ్ఞతలు చెబితే చాలదు. ఈ సందర్భంగా విందు ఇవ్వాలి."

అతని చొరవకు కల్పన ముగ్ధురాలైంది.

"తప్పకుండా ఇస్తాను. ఇవ్వాల్టికి కాఫీ టిఫెన్‌తో సరిపెట్టుకోండి."

"మీ నవల మీద ఆర్టికల్ రాయాలనుకుంటున్నాను. కొన్ని విషయాలు ముందుగా మీతో చర్చించాలని ఉంది." అన్నాడు జైకిషన్.

రఘురాం సిగరెట్ కాలుస్తూ గంభీరంగా కూర్చున్నాడు.

"చెప్పండి!"

"మీ నవలలో శాశ్వత అభ్యంతరతను విశుద్ధ సూక్ష్మరూపంలో వ్యక్తం చేశారు." సిగరెట్ దమ్ము పీల్చి వదులుతూ దర్శకునిలా ముఖం పెట్టి అన్నాడు.

"శాశ్వత అభ్యంతరతా? అంటే?" రాజేంద్ర అడిగాడు.

కల్పనకు కూడా అర్థం కాలేదు. తన అజ్ఞానాన్ని బయట పెట్టుకోవడం ఇష్టం లేదు.

"అవును! శాశ్వత అభ్యంతరతే సృజనశక్తి!"

"నీ బొందలా ఉంది!" అనుకున్నాడు రఘురాం మనసులోనే.

జైకిషన్ సిగరెట్‌ను యాష్‌ట్రేలో వేస్తూ అన్నాడు —

"మనసు వ్యథకు గురి అయిన మధుర క్షణాల్లో మనలోని మానవాతీత శక్తులు బయటపడతాయి."

"మీరు ఏమేమో పెద్ద పెద్ద శబ్దాలు ఉపయోగిస్తున్నారు. కాని ఆ శబ్దాలన్నీ కలిసి ఏ సరైన అర్థాన్నీ స్ఫురింప చెయ్యడం లేదు మహాశయా!" అన్నాడు రాజేంద్ర.

జైకిషన్ కుడి చేతిని తీసి ఎడం చేతిని కుర్చీ చేతిమీద ఆనించి పోజు మార్చాడు.

"నాకు అర్థం అయింది. మనసు వ్యాకులపడాలి. వ్యథను అనుభవించాలి. జ్వాల రగిలించాలి. అప్పుడే సాహిత్య సృష్టి జరుగుతుంది." అన్నది కల్పన.

"ఇంకా స్పష్టంగా చెబుతాను."

"చంపక త్వరగా చెప్పవయ్యా!" రఘురాం విసుగ్గా అన్నాడు.

"మన కన్వెన్షనల్ జీవితంలో జరిగే సామాన్య సంఘటనలను మస్తిష్కం రిజర్వు చేస్తుంది. మస్తిష్కం మనిషిలోనే కాదు అన్ని ప్రాణుల్లోనూ ఉంటుంది. ఇది భౌతికమైనది. మరో రకంగా చెప్పాలంటే మస్తిష్కం ఒక యంత్రం. సంఘటనల్ని కంప్యూటర్‌లా ఆటోమేటిక్‌గా అచ్చు వేస్తుంది, రిజర్వు చేస్తుంది. కాని జీవిత వాస్త

వికత ఇందులో లేదు. జీవిత వాస్తవికత ఇంద్రి యాతీతమైంది. ''

కల్పన ముగ్ధురాలై వినసాగింది.

"ఇంద్రియాతీతమైంది వాస్తవమా?" రఘురాం ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

''అవును గురూ! నిజమైన వాస్తవికత ఇంద్రియాతీతమైనదే. మస్తిష్కం దాన్ని అందుకో లేదు. హృదయం మాత్రమే దాన్ని అందుకో గలదు."

రాజేంద్రకు అంతా ఏదో గందరగోళంగా తోచింది.

''ఈ రచయితలు కలిస్తే మామూలు భాషలో మాట్లాడుకోరా ఏం? కర్మ!" అనుకున్నాడు.

''ఇక కల్పనగారి నవల 'స్వప్నం' గురించి చెబుతాను. ''

''చెప్పు! ఇంకా ఆలస్యం ఎందుకూ?'' నవ్వుతూ అన్నాడు రఘురాం.

వచ్చినప్పటి నుంచీ గంభీరంగా కూర్చుని ఉన్న రఘురాం ఎందుకు నవ్వాడో కల్పనకు అర్థం కాలేదు.

''కల్పనగారి వాస్తవికత వారి సతత వికా సంలో నిహితమై ఉంది. ఈ నవలలో కల్పనగారు స్వయంగా ప్రతిక్షణం మానసిక సంఘర్షణకు గురి అవుతూ అనుభవించిన అనుభూతి కన్పిస్తుంది.''

"సృజన - చైతన్యంతో మస్తిష్కానికి సంబంధం లేదంటావా?'' రఘురాం అడిగాడు.

"లేదు. నేను ముందే చెప్పినట్టు మస్తిష్కం ఒక యంత్రం. దానికి సృజనశక్తిలేదు." సిగరెట్ పొగ ఊది దాన్నే ఓ క్షణం చూస్తూ ఉండిపోయాడు జైకిషన్.

అందరూ అతన్ని చూస్తూ ఉండిపోయారు.

"కాళిదాసు రచించిన మేఘదూత్, జర్మన్ కవి గెటే రచించిన ఫావ్స్టు, మస్తిష్కం నుంచి వెలువడినవి కావు. మహా కావ్యాల, మహాన్ కళల సృష్టికి మూలం మానవుడు. మస్తిష్కం కాదు. అంటే మానవుడిలోని ఆభ్యంతరిక చేతన ద్వారా కళాసృష్టి జరుగుతుంది. ''

"అయితే ఆ అభ్యంతరిక చేతన ఎక్కడ ఉంటుంది?"

"మనిషి మనసులో!"

''అంటే మీ ఉద్దేశ్యం మనసు భౌతికం కాదనేగా?'' ఉత్సాహంగా అడిగింది కల్పన రవీంద్ర ఉత్తరంలో రాసిన వాక్యాలను గుర్తు చేసుకుంటూ.

''అవును!''

రఘురాం వ్యంగ్యంగా నవ్వాడు.

''మీరు కూడా చెప్పండి! మనస్సు లేక హృదయం మస్తిష్కం, శరీరం, వీటి గురించి మీ అభిప్రాయం ఏమిటి?'' కల్పన రఘురాంను అడిగింది.

''విజ్ఞానం చెప్పేదే నేనూ అంగీకరిస్తాను. సైన్సు మనస్సును మస్తిష్కం నుంచి వేరుగా చూడదు. రెండూ ఒకటేనంటుంది. శరీరంలో మస్తిష్కానికి ఒక రూపం ఉన్నది. అది భౌతిక మైంది. మస్తిష్కంలో కలిగే ఆలోచనలనూ అనుభూతులనూ మనస్సు అంటాం. శరీరమూ మస్తిష్కమూ, లేకుండా మనసుకు అస్తిత్వం లేదు.'' అన్నాడు రఘురాం.

''కాని దర్శనశాస్త్రం దీన్ని ఖండిస్తుంది. మనసూ, మస్తిష్కం ఒకటే అని చెబుతూ సైంటిస్టులు పెద్ద తప్పు చేస్తున్నారు. అందువల్లనే శరీరంతోపాటు ఆత్మ కూడా ముగిసిపోతుందంటు న్నారు. సూక్ష్మ దృష్టితో చూస్తే ఆభ్యంతరిక చేతనావికాస స్వరూపాలే జీవితం. ఇదే ప్రేరక శక్తి. దీన్నే "వైటల్ స్పార్క్" అంటే "జ్వలించే నిప్పు'' అన్నారు. అది కూడా కాలం లాగే క్షయంకానిది'' అన్నాడు జైకిషన్.

రాజేంద్రకు జైకిషన్ మాటలు అసలు అర్థం కావడం లేదు. కల్పనకు అర్థం అయీ కాకుండా ఉన్నాయ్.

''కాని ఐన్‌స్టీన్ సాపేక్షసిద్ధాంత ఆధారం మీదనే కాలం-అంతరిక్షం, మధ్య ఉండే సంబం ధాన్ని నిర్ణయించడానికి ప్రయత్నం జరిగింది.'' అన్నాడు రాజేంద్ర తనకూ వాళ్ళ సంభాషణ కొంత అర్థం అవుతున్నట్టు తెలియజెప్పే ఉద్దేశ్యంతో.

''ఐన్‌స్టీన్ సాపేక్షసిద్ధాంతం ఎవరికీ అర్థం అయేదికాదు. అసలు ఆ చెప్పినాయనకు ఎంత వరకు అర్థం అయిందో ఆయనకే తెలియాలి.'' రఘురాం నవ్వుతూ అన్నాడు.

''జీవించే ప్రతి క్షణం అనంతమైనదే. భౌతిక బంధాల నుంచి మనసును విడిపించినప్పుడే ఇది సంభవం!'' అన్నది కల్పన.

''హియర్! హియర్!'' జైకిషన్ కుర్చీలో ముందుకు వంగి చప్పట్లు కొట్టాడు.

''విప్లవదశ అంటే ఏమిటి?'' రాజేంద్ర ప్రశ్నించాడు.

''విప్లవదశ అంటూ ఏదీ లేదు. అది ఒక రాజకీయ సంబంధమైన స్లోగన్ మాత్రమే.'' అంటూ కుర్చీలో పోజుమార్చి కూర్చున్నాడు. ఓక్షణం కల్పన కళ్ళలోకి లోతుగా చూశాడు.

కల్పనకు అతని ముందు కూర్చోవాలంటే అదోలా ఉంది.

అతను అలా తనను చూడటం ఒకవైపు ఇష్టం గానూ ఉంది. మరోవైపు అయిష్టంగానూ ఉంది. ఇష్టా అయిష్టాల విచిత్ర సమ్మేళనం. చిత్రమైన అనుభూతి. రచయిత్రిగా తనకు ఇలాంటి అనుభూతి కూడా అవసరమే అనుకుంది.

ఇబ్బందిగా కుర్చీలో కదిలింది.

''ఏమిటి అంటున్నానూ? ఆ దశ గురించి కాదూ? స్వాతంత్ర్యానికి ముందు వచ్చిన సాహిత్యం, ముఖ్యంగా నవలలు, రాజకీయ ప్రచార సాధనాలుగా మాత్రమే వెలువడ్డాయి. అవన్నీ సోషల్ డాక్యుమెంట్సు! స్వాతంత్ర్యానంతరం మాత్రమే నిజమైన సంఘర్షణ మనలో బయలు దేరింది. మీ నవల ఈ దశలో వెలువడిన ఒక మంచి సృష్టి అని చెప్పగలను.'' అన్నాడు జైకిషన్.

"ఇలాంటి నవలలు జాతిని పతనం చేస్తాయి. ఈ నవలలు మత్తుమందులా మనసుల మీద పని చేస్తాయి. ఇలాంటి నవలలు రాసి జాతికి ద్రోహం చేస్తున్నారు కల్పనలాంటివారు.''

కల్పన ముఖం ఎర్రబడింది రఘురాం మాటలకు.

"మిస్టర్ రఘురాం! మీ సిద్ధాంతాలకూ మా సిద్ధాంతాలకూ మౌలికమైన భేదం ఉంది. మీరు ఆర్థికవ్యవస్థ మారితే అన్నీ చక్కబడ్తాయి అంటారు. ఆ వ్యవస్థను మార్చడానికి సంఘర్షణ కావాలంటారు. పోరాటం జరగాలంటారు. విప్లవాగ్ని ప్రజ్వరిల్లాలంటారు. కాని మా సిద్ధాంతం ప్రకారం మానవుడు నీతి – అవినీతి అనే భ్రమల నుంచి బయటపడాలి. అప్పుడే మానవజాతికి నిజమైన ముక్తి లభిస్తుంది." అన్నాడు జైకిషన్.

రాజేంద్రకు తలనొప్పిగా ఉంది.

అదే సమయంలో సిద్ధార్థ ఇంటికి వచ్చాడు.

రాజేంద్ర మిగతా ఇద్దర్నీ పరిచయం చేశాడు. సిద్ధార్థ నమస్కారంపెట్టి లోపలకు వెళ్ళిపోయాడు.

"మిసెస్ కల్పనా! మీవారికి సాహిత్యంలో అభిలాష లేదనుకుంటాను." అన్నాడు జైకిషన్.

కల్పన జవాబివ్వలేదు. తన భర్త మొరటుగా ప్రవర్తించినందుకు బాధపడింది.

సిద్ధార్థ మూడ్‌ను అర్థం చేసుకున్న రాజేంద్ర లేచి నిల్చున్నాడు. "వస్తాం వదినా!" అన్నాడు.

రఘురాం అందరికంటే ముందే బయటికి వెళ్ళాడు.

జైకిషన్ "మళ్ళీ వస్తాం! ఈసారి భోజనం పెట్టాలి." చనువుగా అన్నాడు.

"తప్పకుండా!" గొంతు తగ్గించి అన్నది కల్పన.

భర్త వింటాడేమోనని భయం వేసింది.

అందరూ వెళ్ళిపోయారు.

సిద్ధార్థ బయటికి వచ్చాడు.

"సాహిత్యగోష్టి ముగిసిందా? నేను వచ్చానని ఆపేశారా?" వ్యంగ్యంగా అన్నాడు.

"మీరు వచ్చారని ఎందుకు ఆపాలి?" ఎదురు ప్రశ్న వేసింది.

"రేపు సాయంత్రం ఏడు గంటలకు మనం లాయర్ దగ్గిరకు వెళ్తున్నాం."

కల్పన కళ్ళప్పగించి చూసింది.

"లాయర్ ముందు, విడి పోవడం ఇద్దరికీ ఇష్టమేనని సంతకం పెట్టాలి."

కల్పన గుండె దడదడలాడింది.

"కోర్టులో దాఖలు చేశాక, మూడు నెలలో, ఆరు నెలలో బాగా గుర్తులేదు టైం ఇస్తారు. ఎందుకో తెలుసా? తాత్కాలిక ఉద్రేకాలతో కొందరు కోర్టు ఎక్కుతారు. ఆ తర్వాత ఉద్రేకం తగ్గాక రాజీ పడతారు. అందుకే టైం ఇస్తారు."

ఊపిరి బిగబట్టి వింటున్న కల్పన రిలీఫ్‌గా గాలి పీల్చుకుంది.

"సంతకాలు పెట్టాక మనం ఆరు నెలలు కలిసి ఉండవచ్చునన్నమాట?"

"మనం కలిసి ఉండటం లేదు. నీకు ఒక ఇల్లు చూశాను. అద్దె నేనే కడతాను. విడాకులు వచ్చేంత వరకూ అన్ని వసతులూ కల్పిస్తాను."

కల్పన అయోమయంగా చూసింది.

"రేపు లాయర్ దగ్గిర సంతకాలు కాగానే ఆ యింట్లో ప్రవేశిస్తావు!"

కల్పన వెర్రిదానిలా చూసింది.

"కొత్తగా కారు కొన్నాను. అది నీ కోసమే!"

కల్పన స్థాణువులా నిలబడిపోయింది.

"ఏమిటి అలా చూస్తున్నావ్? విడిపోవాలంటే భయంగా ఉందా?" వ్యంగ్యంగా అన్నాడు సిద్ధార్థ.

"భయమా? ఎందుకూ?" లేని గాంభీర్యాన్ని తెచ్చి పెట్టుకొని, శక్తిని కూడదీసుకున్నట్టు అన్నది.

"ఒంటరిగా జీవితం గడపాలంటే!"

"ఒంటరిగానా? నేను ఒంటరిదానిగా ఎందుకు బతకాలి?"

"ఓహో! అయితే జంటగా బతికే ఏర్పాటు కూడా ముందుగానే చేసుకున్నావన్న మాట!"

"అవును!" ఉక్రోషంగా అన్నది.

"కంగ్రాచ్యులేషన్స్!"

"థ్యాంక్యూ!"

"ఆ దురదృష్టవంతుడు ఎవరో తెలుసుకో వచ్చునా?"

"నీకు అనవసరం!"

"ఒకటి గుర్తుంచుకో!"

"ఏమిటి?"

ఏదో అనబోయి "ఏమీ లేదులే!" అంటూ బయటికి వెళ్తూ గడపలోనే ఆగి వెనక్కి చూశాడు కల్పన ప్రశ్న విని.

"రేపే లాయర్ దగ్గిరకు వెళ్లాలా?"

"ఏం ఆలోచించుకోవడానికి టైం కావాలా!" ఆదోలా నవ్వుతూ అడిగాడు.

ఆ నవ్వుకు విషం పూసిన సూదివి గుండెల్లో పొడిచినట్టు కల్పన విలవిలలాడింది. ఆ క్షణంలోనే ఆ ఇంటినుంచి బయటికి వెళ్లిపోవాలనిపించింది.

"అక్కర్లేదు. రేపే వెళ్దాం!"

"ఓ కే!" అంటూ రెండు అడుగులు ముందుకు వేశాడు.

"ఎక్కడికి వెళ్తున్నావ్?" అడిగింది కల్పన.

"క్లబ్బుకు. ఏం వస్తావా?"

"ఉంపుడుగత్తెను వెంటబెట్టుకొని వెళ్తావా!"

"పర్వాలేదు. క్లబ్బుకు వెళ్ళొచ్చును."

"నీతో రాను."

"నీ కాబోయే భర్తతో వస్తావా?"

"అది నీకు అనవసరం!"

"ఓ కే. మేడం!" అంటూ టకటక నడుస్తూ వెళ్ళిపోతున్న సిద్దార్థను రెప్ప వెయ్యకుండా చూసింది.

ఎంత గర్వం! కేవలం గర్వమేనా?

ఎంత ఠీవిగా నడుస్తాడు?

ఎంత హుందాగా మాట్లాడతాడు?

పదిమందిలో ఉన్నా ప్రత్యేకంగా కన్పించే వ్యక్తిత్వం!

ఇదేమిటి తను ఇలా ఆలోచిస్తున్నది!

తను పునర్వివాహం చేసుకోగలదా? అతను నిజంగానే విడాకులు ఇవ్వడానికి నిర్ణయించుకున్నాడా?

ఫోన్ మ్రోగింది. కల్పన ఆలోచనలకు బ్రేక్ పడింది. ఫోన్ ఎత్తింది.

"హల్లో! మిసెస్ రాజా! మీరా?"

"........"

"క్లబ్బుకా? వస్తాను. నాకూ ఏం తోచడం లేదు. అలాగే.... అలాగే..." ఫోన్ పెట్టేసింది.

కల్పన పదిహేను నిముషాల్లో ముస్తాబై మిసెస్ రాజా కోసం ఎదురుచూడసాగింది. బుర్రను ఏదో పురుగు తొలుస్తున్నట్టు అశాంతిగా ఉన్నది.

తన భర్త తనను నిజంగానే వదిలేస్తున్నాడా? అదే నిజమైతే తను అతి మామూలు ఆడదానిలా బెంబేలు పడకూడదు. అతనికి తగిన పాఠంతనూ చెప్పగలదు.

వాకిలి ముందు కారు ఆగింది. మిసెస్ రాజా కారుదిగింది. స్టీరింగు దగ్గిర కూర్చుని ఉన్న అతను కూడా దిగాడు.

"మీట్ మిస్టర్ రామనాథం! లీడింగ్‌లాయర్! త్వరలోనే హైకోర్టు జడ్జి కాబోతున్నారు." అంటూ పరిచయం చేసింది మిసెస్ రాజు.

"నమస్తే!"

"నమస్తే!"

రామనాథం చూపులు కల్పన ముఖం మీదనిల్చి పోయాయి. ఒక పసివాడు బర్త్‌డే కేక్‌ను చూసి నట్టు చూడసాగాడు.

"రామనాథంగారి భార్య ఈ మధ్యనే పోయింది."

"పాపం!" అన్నది కల్పన పక్క చూపులు చూస్తూ.

"బయలుదేరండి! క్లబ్బుకు వెళ్ళి మాట్లాడుకో వచ్చును."

కల్పనకు అతన్నీ, అతని వాలకం చూస్తుంటే చిరాకు కలిగింది. రానని చెప్పాలనుకుంది. కాని సిద్ధార్థ గుర్తు వచ్చాడు.

తను వెళ్ళాలి. తనను ఇలా చూసి తన భర్త ముఖం ఎలా మారుతుందో చూడాలి! తనను అవమానిస్తున్నాడు. ఇప్పుడు అతన్ని అవమానించే అవకాశం తనకు దొరికింది. తనను వేశ్య అన్నాడు ఉంపుడుగత్తె అన్నాడు! తను నిజంగా అలా ప్రవర్తిస్తే?

కసితో కల్పన మనసు భగ్గుమన్నది.

కార్లో మిసెస్ రాజు వెనక సీట్లో కూర్చుంది. వెనక ఎక్కబోతున్న కల్పనను ముందు కూర్చో వలసిందిగా ఆహ్వానించాడు రామనాథం. ఓక్షణం తటపటాయించి, రామనాథం పక్కన ముందు సీట్లో కూర్చుంది. రామనాథం కారు నడుపుతున్నాడు. మధ్యమధ్య కనుకొనలతో కల్పనను చూస్తున్నాడు.

సిద్ధార్థ కారు ఎంత నిర్లక్ష్యంగా నడిపినట్టు కన్పిస్తాడో అంత జాగ్రత్తగా నడుపుతాడు. సర్రున కోస్తాడు మలుపు తిరిగేప్పుడు. పక్కన కూర్చున్న వాళ్ళకు భయం వేస్తుంది. సర్దాగానూ ఉంటుంది. ఈ రామనాథం ఏమిటి? ఊగి ఊగి నడిచే వ్యక్తి గుర్తుకొస్తున్నాడు అతను కారు నడిపే తీరు చూస్తుంటే.

కారు క్లబ్బుముందు ఆగింది. ఓపెన్ ఎయిర్‌లో గ్లాసు ముందు పెట్టుకొని ఒంటరిగా ఆలోచిస్తూ కూర్చున్న సిద్ధార్థ మీద కల్పన దృష్టి పడింది. ఓ క్షణం అలాగే ఆగిపోయింది. ఎంత హుందాగా ఉన్నాడు? ఆలోచిస్తుంటే ఎంత గంభీరంగా మాన్లీగా కన్పిస్తున్నాడు?




ఇంతవరకూ కోర్టు ద్వారా విడాకులు పుచ్చుకోవడమన్నది మాత్రమే ప్రపంచంలోని వివిధ దేశాలలో అమలులో వున్నది. కాని ఇప్పుడు తంతి తపాలా శాఖ ద్వారా విడాకులు పుచ్చుకోవచ్చు అని చెబుతున్నారు అమెరికాలోని కాలిఫోర్నియానగర పాలకులు. ఈ సంవత్సరం జనవరి నెలనుంచి ఈ సదుపాయాన్ని వారు కలుగజేశారు.

వివాహమై రెండేళ్ళు కూడా నిండని దంపతులు, తమకి పెద్దగా ఆస్తిపాస్తులు లేకపోయినట్లయితేనూ, పిల్లలు కలగకుండా వున్నట్లయితేనూ పోస్టు ద్వారా కేవలం తొమ్మిదివందల రూపాయల రుసుము చెల్లిస్తే చాలు – వారికి పోస్టులో విడాకుల పత్రాలు లభిస్తాయి. ఇంతకీ వాళ్ళు చెయ్యాల్సిందేమిటంటే తమ ఆస్తి పంపకం విషయంలో ఒక ఒప్పందానికి రావాలి. అలా ఒప్పందానికి వచ్చినట్లు తెలియబరచగానే ఆరు నెలల్లోగా వారికి విడాకులు మంజూరు చేయబడతాయి.

ఈ పద్ధతివల్ల లాభమేమిటీ అంటే – ప్లీడర్లచుట్టూ తిరగడం, కోర్టుకి ఎక్కడం అనే బాధలు తప్పుతాయి. అక్కడి ప్లీడర్లు కూడా ఈ పద్ధతికి హర్షం వెలిబుచ్చారుట. కోర్టులలో వున్న రద్దీ కొంతైనా తగ్గుతుందని, అమెరికాలోని యితర రాష్ట్రాలకి కూడా ఈ పద్ధతి అమలుపరచమని వారు కోరారట.

సిద్ధార్థ కల్పనను చూశాడు. పక్కనే ఉన్న మిసెస్ రాజునూ, రామనాథాన్నీ చూశాడు. అందర్నీ మార్చి మార్చి చూశాడు.

పక్కనే ఉన్న బల్లదగ్గిర ఉన్న కుర్చీలో కూర్చుంది కల్పన. రామనాథం, మిసెస్ రాజు ఆమెకు చెరొక పక్కనా కూర్చున్నారు.

బేరర్ వచ్చాడు. రామనాథం తినడానికి ఏమేమో ఆర్డర్ ఇచ్చాడు.

కల్పన మనసు మనసులో లేదు.

"అతనే సిద్ధార్థ. కల్పన భర్త!" రామనాథానికి చూపిస్తూ అన్నది మిసెస్ రాజు.

"ఆఁ" అంటూ రామనాథం తెల్లముఖం వేశాడు.

"హల్లో మిసెస్ సిద్ధార్థ!" విష్ చేసింది మిసెస్ సక్సేనా కల్పనకేసి అదోలా చూస్తూ.

"నాకు కొంచెం అర్జంటుపని ఉంది. వెళ్తాను." అన్నాడు రామనాథం గాభరాగా.

చుట్టూ కూర్చున్న వాళ్ళు కల్పనను చూసి గుసగుసలాడుతున్నట్టు కన్పించింది.

"ఏం భయంగా ఉందా?" అన్నది రామనాథంతో కల్పన.

"అబ్బే భయం ఎందుకూ?" భయంగానే అన్నాడు.

"మీరేం భయపడనవసరం లేదు. కల్పనా, ఆమె భర్తా విడాకులు ఇచ్చుకోబోతున్నారు రెండు రోజుల్లో."

"రేపే లాయర్ దగ్గిర సంతకాలు." అన్నది కల్పన. సిద్ధార్థకేసి చూసింది. అతను కూర్చున్న కుర్చీ ఖాళీగా కన్పించింది.

"నేను విన్నది నిజమేనన్నమాట!" అన్నది మిసెస్ సక్సేనా.

"ఏమిటి?"

"అదే సిద్ధార్థ విడాకులు నీకు ఇస్తున్నాడు!"

"నేనే సిద్ధార్థకు విడాకులు ఇస్తున్నాను." గర్వంగా అన్నది కల్పన.

మిసెస్ సక్సేనా ఓక్షణం ఆమె ముఖంలోకి చూసి అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

"మహ బాగా గర్వభంగం అయింది."అన్నది మిసెస్ రాజు.

ఆమె ఎవర్ని గురించి అన్నదో అర్థం అయింది కల్పనకు.

కాని ఆమె మాటలు కల్పనకు ఆనందాన్ని కలిగించలేదు.

కల్పనకు ఏమీ తినాలనిలేదు. ఇంటికి వెళ్ళిపోవాలని ఉంది.

సిద్ధార్థను ఉడికించాలని వచ్చింది. అతను ఉడుక్కుని వెళ్ళిపోయాడు. అయినా తనకు ఆశించిన ఆనందం కలగడం లేదు.

"మీరు చాలా అందంగా ఉంటారు." అన్నాడు రామనాథం కళ్ళార్పకుండా కల్పన ముఖంలోకి చూస్తూ.

"మీకు తొందర పని ఉంది. వెళ్ళిపోవాలన్నారు?" అన్నది కల్పన.

రామనాథం ముఖం వెలా వెలా బోయింది. "మిమ్మల్ని వదిలి వెళ్ళాలనిపించడం లేదు."

"అబద్ధం!" అనాలనుకుంది.

"రామనాథంగారు మళ్ళీ పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నారు. ఆయనకు పెద్దగా బాధ్యతలు కూడా లేవు. ఇద్దరు ఆడపిల్లలకూ పెళ్ళిళ్ళు అయిపోయాయి." అన్నది మిసెస్ రాజా.

కల్పన ప్రశ్నార్థకంగా చూసింది.

"మీరు విడాకులు తీసుకోబోతున్నారు. మీకు మళ్ళీ వివాహం చేసుకోవాలనే ఉద్దేశం వుంటే ఈ మీ చరణ చక్రవర్తిని మరవకండి." అన్నాడు రామనాథం.

కల్పనకు ఏవగింపు కలిగింది. చరణ చక్రవర్తి అట! చవట! సిద్ధార్థ చస్తే ఇలా అంటాడా? తను ఎంత ప్రేమించిన స్త్రీ ముందు కూడా ఇలా చవటలా మాట్లాడడు. సిద్ధార్థ మగవాడు. మగవాడిలాగే ప్రవర్తిస్తాడు! ఇదేమిటి తను ఇలా ఆలోచిస్తున్నది?

"ఏమిటి ఆలోచిస్తున్నావ్? రామనాథం దగ్గిర కూడా రెండు కార్లు ఉన్నాయ్! సిద్ధార్థలా గర్విష్ఠి కాదు. ఆడదాన్ని బానిస అనుకోడు."

"మిమ్మల్ని వివాహం చేసుకోవడానికి నాకు ఎలాంటి అభ్యంతరం లేదు." అంటూ కల్పన రామనాథం ముఖంలోకి చూసింది.

రామనాథం ముఖంలో వెయ్యి వాట్ల బల్బ్ వెలిగింది.

"కాని ఒక విషయం చెప్పాలి."

"ఏమిటీ?" మిసెస్ రాజా అడిగింది.

"చెప్పు!" రామనాథం కంఠం ఆదోలా ఉంది.

ఎంత త్వరగా ఏకవచన ప్రయోగంలోకి దిగాడు! కల్పనకు అతని ముఖం చూస్తుంటే అసహ్యం వేసింది. మిసెస్ రాజా ఏదో పని ఉన్నట్టు అక్కడి నుంచి తప్పుకుంది.

"నేను ఒక వ్యక్తిని ప్రేమిస్తున్నాను."

రామనాథం ఆశ్చర్యంగా ఆమె ముఖంలోకి చూశాడు.

"అందుకే విడాకులు ఇస్తున్నావా? అతన్ని చేసుకోవడానికే...."

"కాదు. అతనికి పెళ్ళి అయిపోయింది."

"ఆ సంగతి తెలిసే సిద్ధార్థ మిమ్మల్ని వదిలేస్తున్నాడనుకుంటాను." రామనాథం గొంతులో అవహేళన వినిపించింది.

ఎంత చిన్నబుద్ధి?

"లేదు. ఆ సంగతి తెలిసే సిద్ధార్థ నన్ను వివాహం చేసుకున్నాడు."

రామనాథం నమ్మలేనట్టు చూశాడు.

"మిస్టర్ రామనాథం! సిద్ధార్థ భార్యగా ఉన్న ఏ స్త్రీ కూడా అతని నుంచి విడిపోయాక మరో మగవాడికి భార్య కాలేదు. సిద్ధార్థ వ్యక్తిత్వం అలాంటిది. సిద్ధార్థ వెళ్ళిపోయాడు. నేను ఇంటికి వెళ్ళాలి." కల్పన లేచినుంచున్నది.

కల్పన ముఖంలోకి కొత్తగా అక్షరాలు నేర్చుకుంటున్న పనివాడు సంయుక్తాక్షరాల కేసి చూసినట్టు చూడసాగాడు.

కల్పన గబగబ బయటికి వెళ్ళిపోయింది. ఆటో ఎక్కి కూర్చుంది. మిసెస్ రాజా పిలవడం ఆటో రొదలో వినిపించలేదు.

కల్పన ఇంట్లో ప్రవేశించేసరికి సిద్ధార్థ సిగరెట్ తాగుతున్నాడు. గదినిండా సిగరెట్ పీకలు పడి వున్నాయి. విస్కీగ్లాసు టేబిల్ మీద ఎదురుగా వున్నది.

లోపలకు వచ్చిన కల్పన ముఖంలోకి ఓ క్షణం చూసి, గ్లాసు చేతిలోకి తీసుకున్నాడు.

"ఎందుకు వచ్చేశావ్?" కల్పన అడిగింది.

"నీ చేష్టు చూడలేక!"

"నీకు నచ్చలేదా?" కల్పన ముసిముసిగా నవ్వుతూ అడిగింది.

"ఇంకా నువ్వు నా భార్యవే అనే సంగతి మర్చిపోయావా?"

"హూ! భార్య! నేను భార్యనా? నేను కేవలం ఉంపుడు గత్తెను మాత్రమే!"

"అది కరెక్టే! నీ అంతస్థు అదే నా దృష్టిలో. కాని సమాజం దృష్టిలో ఇంకా నువ్వు నా భార్యవే."

"రేపటివరకేగా?"

"కాదు. గడువు మరో రెండు రోజులు పొడిగించాల్సి వచ్చింది."

"ఎందుకనో?"

"లాయర్ అర్జంటుగా మద్రాసు వెళ్ళాల్సి వచ్చింది. ఇంతకుముందే ఫోన్ చేశాడు."

కల్పన గుండెల నిండుగా గాలి పీల్చుకుంది.

"ఏమిటి పెద్ద పెద్ద నిట్టూర్పులు విడుస్తున్నావ్?"

"రవీంద్ర గుర్తువచ్చాడు." కసిగా అన్నది కల్పన.

"పాపం! రామనాథం!"

"ఛ! వాడిపేరు ఎత్తకు!"

"ఏం? ఒక రోజుకే మొహం మొత్తిందా? మేడం కల్పనా! విను! మరో రెండు రోజులు నువ్వు ఎవరితోనూ ఫ్లర్ట్ చెయ్యడానికి నేను ఒప్పుకోను. ఆ తర్వాత నీ ఇష్టం!"

కల్పన మానసికంగా బాగా అలసిపోయింది. వాదించాలని లేదు. తన గదిలోకి వెళ్ళిపోయింది.

మనసు ఎలాగో ఉంది. బరువుగా ఉంది. అశాంతిగా ఉంది.

కాగితాలూ కలం తీసుకొని కూర్చుంది. ఏదో రాస్తేగాని తన హృదయభారం తగ్గదు.

"ఒంటరిగా ఉన్నప్పుడు!

మధురగీతం విన్నప్పుడు!

ఎందుకోసం ఈ అలజడి?

ఎవరికోసం ఈ ఆరాటం?"

ఆపైన మాటలు దొరకక్క తల పట్టుకొని ఆలోచిస్తూ కూర్చుంది.

"ఇంకెవరికోసం....రవీంద్రకోసం" గిర్రున తల తిప్పి చూసింది కల్పన. సిద్ధార్థ వెనక నిలబడి ఉన్నాడు. అతని కళ్ళు ఎర్రగా ఉన్నాయ్!

"అవును!" అన్నది కల్పన.

"పిచ్చి రాతలు మానేసి పద! పొద్దుపోయింది." అన్నాడు సిద్ధార్థ.

కల్పన ప్రశ్నార్థకంగా భర్త ముఖంలోకి చూసింది.

"ఇంకా రెండు రోజులు నీ శరీరం మీద నాకు అధికారం ఉంది." అన్నాడు సిద్ధార్థ కసిగా.

కల్పన మాట్లాడలేదు. వెంటనే కవితకు మరో పాదం తట్టింది. రాయసాగింది.

"వంటరితనపు అంచు మీద
వంటరిగా నిల్చుని
గుండెలోయలోకి తొంగిచూసి నప్పుడు
అగు పించిన అడుగుజాడలు
నీవేనని గుర్తించాను!"

"ఆహా! అద్భుతం! ఏం కవిత్వం? ఏం కవిత్వం?" సిద్ధార్థ కాగితాలు తీసుకున్నాడు.

"ఏమిటా దౌర్జన్యం!" కల్పన అతని చేతిలోని కాగితాలు తీసుకోబోయింది.

అతను ఆ కాగితాలను చింపి ముక్కలు ముక్కలు చేసి కిటికీలో నుంచి బయటకు పారేశాడు.

కల్పన సర్పద్రష్టలా నిలబడిపోయింది.

సిద్ధార్థ అలా ప్రవర్తించడం కొత్తగా ఉంది.

"పద!" అంటూ జబ్బపట్టుకొని బలంగా మంచం వైపు గుంజాడు.

ఆ రాత్రి కల్పనకు తమాషా కల వచ్చింది.

తను శారీరికంగా రెండుగా విడిపోయినట్టూ, ఒక భాగాన్ని సిద్ధార్థ కసిగా గాఢంగానలిపి వేస్తున్నట్టూ, రెండో భాగాన్ని మృదువుగా రవీంద్ర గుండెలకు హత్తుకుంటున్నట్టూ కల వచ్చింది. తృళ్లిపడి లేచింది. ఇంకా తెల్లవారలేదు. సిద్ధార్థ గాఢనిద్రలో ఉన్నాడు.

కల్పనకు మళ్లీ నిద్రపట్టలేదు.

తన కలకు అర్థం ఏమిటి? తను ఇంతకాలం శరీరం సిద్ధార్థకూ, మనసు రవీంద్రకూ ఇచ్చాననుకుంటూ ఉన్నది. మరి ఈ రోజు ఇలాంటి కల వచ్చిందేం?

రాత్రి సిద్ధార్థ ప్రవర్తన చాలా చిత్రంగా తోచింది తనకు. ఎంతో ఆర్తితో తనను గుండెలకు హత్తుకున్నాడు. ఎందుకు?

అతను తనను ద్వేషించలేదు. ద్వేషిస్తున్నట్టు నటిస్తున్నాడు. అంతే! తనను విడిచి సిద్ధార్థ బ్రతకలేడు. విడాకులు ఇస్తానని బెదిరిస్తున్నాడు! అంతే!

నిజంగా విడిపోవడం జరిగితే తనేం చెయ్యాలి? ఇది నిజం కాకూడదని తన మనసు ఎందుకు ఆరాటపడుతోంది? తను సిద్ధార్థను ప్రేమిస్తోందా?

కాదు! కాదు! తన ప్రేమ పవిత్రమైంది. తను రవీంద్రను తప్ప మరొకర్ని ప్రేమించలేదు.

సిద్ధార్థ వ్యక్తిత్వం తన జీవితాన్ని చుట్టివేసింది. ప్రభావితం చేసింది.

ఆలోచిస్తూ మళ్లీ నిద్రలోకి జారిపోయింది.

కలత నిద్రలో ఉన్న రవీంద్ర ఎవరో వీపు తట్టినట్టు తృళ్లిపడి లేచి కూర్చున్నాడు.

గాభరాగా మంచం దిగాడు.

కిటికీరెక్క తెరిచాడు.

రివ్వున గాలీ, వానచినుకులూ, ముఖాన్ని తాకాయి.

బయట హోరున వీస్తున్న గాలిమోత!

జడివాన రొద!

ఎవరో తనను పేరుపెట్టి పిలుస్తున్నట్టు అనిపించింది.

వళ్లు ఝల్లుమన్నది.

నిద్రమత్తు ఒకవైపు-మరోవైపు భయం.

లైటు వేశాడు. కిటికీ లోంచి బయటకు చూశాడు. వెలుగులో నిల్చున్న రవీంద్రకు బయటి చీకటి మరీ దట్టంగా కనిపించింది.

మళ్లీ పిలుస్తున్నారు.

"ఎవరూ?" గొంతు పెగల్చుకొని అడిగాడు.

"టెలిగ్రాం సర్!"

బిగ్గరగా అరిచినట్టు వినిపించింది. ఆ కంఠంలో విసుగు కూడా వినిపించింది.

"వస్తున్నా!"

లుంగీ బిగించుకొని పడకగదిలో నుంచి డ్రాయింగ్ రూంలోకి వచ్చాడు.

"సర్! టెలిగ్రాం!" ఈసారి మరీ దగ్గరగా వినిపించింది.

[సశేషం]

## కొబ్బరికాయతో

ఒక కొబ్బరికాయ తీసుకోండి. కాయను అడ్డంగా పట్టుకుని ఒక వంతు ఒకవైపు, మూడు వంతులు మరోవైపు వచ్చేలా గట్టి చిన్న కత్తితో గుండ్రంగా గంటుపెడుతూ కొయ్యండి. కొంచెం శ్రమ పడితే మనం కావాలనుకున్న విధంగా కాయ రెండు. భాగాలవుతుంది. చిన్న చిప్ప వదిలేయండి. పెద్ద చిద్ద చిప్పలో కొబ్బరి పూర్తిగా తీసేయండి. పైన పీచు కూడా బాగా తీసేయండి. గరుకు కాయితం పెట్టి బాగా నున్నగా వచ్చేలా రుద్దండి. మీ కిష్టమైన రంగు పెయింట్ చెయ్యండి. మూడు వైపులా మీ కిష్టమైన డిజైన్ పెయింట్ చెయ్యండి. ఇక కాళ్ళు. వాడేసిన ప్లాస్టిక్ మజ్జిగ కవ్వం తీసుకోండి. 2½"ల పొడవులో మూడు ముక్కలు కట్ చేసి తీసుకోండి. ఇప్పుడు చక్కని రోలర్ కాళ్ళు వచ్చినట్లే! కొబ్బరిచిప్ప బోర్లించి సెంటర్‌నుంచి ఒకే దూరం వచ్చేలా కొలిచి ఫోటోలో చూపిన విధంగా, క్రాస్‌గా ఫెవికాల్‌వంటి జిగురుతో అతకండి. ఒక గంట ఆరనిచ్చి తిప్పి నిలబెట్టండి. చక్కని పెన్‌హోల్డర్ మీ ముందుంటుంది. మీ పిల్లల చదువుల గదిలో టేబిల్ మీద అలంకరించండి. అందులో పెన్సిల్స్, పెన్స్, కుంచెలు, రబ్బర్లు,



పెన్సిల్ స్క్రూస్, బ్లేడ్లు ఇలాంటివన్నీ ఒకే చోట ఉండేలా జాగ్రత్తపరచుకోవటానికి ఈ పెన్ హోల్డర్ ఎంతైనా ఉపయోగంగా వుంటుంది.

—కోగంటి విజయలక్ష్మి

# కలకలలాడే ముఖ కళకోసం కలికి కంటికి కాటుక




## దక్షిణభారతీయ స్త్రీల కళ్ళల్లో కోటికాంతులను విరియింపజేసేందుకు

## శింగార్ డీలక్స్ కాజల్ (కాటుక)

# బాలల శ్రమ

ఆ మధ్య శివకాశిలో జరిగిన ఒక బస్సు ప్రమాదంలో ముప్పైఅయిదుమంది బాలికలు ప్రాణాలు కోల్పోయారు. వారందరూ ఆ ప్రాంతంలో పనిచేసే బాల కార్మికులు. దాంతో బాలల శ్రమను నిషేధించాలనే మాటలు ఒక్క పెట్టున ప్రతిచోటా వినబడసాగాయి. పైగా ఈ సంవత్సరం అంతర్జాతీయ బాలల సంవత్సరం కావడంతో — ఈ సంఘటన దాదాపు అందరి దృష్టినీ ఆకర్షించింది. అయితే ఈ సమస్య నిన్న మొలకెత్తి ఇవాళ మోసెత్తిన కొత్త సమస్యేమీకాదు. ఇది ఎన్నో సంవత్సరాలుగా పరిష్కరించలేని సామాజిక సమస్య. దాదాపు పది కోట్లమంది బాలల జీవితాలకు సంబంధించిన తీవ్రమైన సమస్య ఇది.

ఈ సమస్యను పరిష్కరించే ప్రయత్నంలో ఒక భాగమే భారత రాజ్యాంగ చట్టం - ఇరవైనాలుగో అంశం. పదునాలుగేళ్లకు లోబడిన పిల్లలను ఎక్కువ శరీరకష్టం చేయవలసిన ఫ్యాక్టరీలు, గనులు మొదలైనవాటిలో పని చేయడం నిషేధిస్తుంది అంశం. అయితే దేశం మొత్తం మీది కార్మికుల్లో బాల కార్మికులు అరవై శాతం అని ఒక అంచనా!

అగ్గిపెట్టెలు, బాణాసంచా పరిశ్రమలలోనూ బీడీలు చుట్టడం, చేనేతపరిశ్రమ, చాపలల్లడం, కుండలు చేయడం మొదలైన కుటీరపరిశ్రమలలోనూ పిల్లలు ఎక్కువగా వుంటున్నారు. చాలీచాలని పేలికలు చుట్టుకుని ఎండకు మాడుతూ, వానకు తడుస్తూ పశువులుకాచే బాలబాలికలు, వ్యవసాయం పనులుచేసే పిల్లలూ పల్లెపల్లెలోనూ కోకొల్లలుగా కనబడతారు.

శివకాశి ప్రాంతంలో దాదాపు మూడువేల అగ్గిపెట్టెల తయారీ సంస్థలు వున్నాయి. అందులో లక్షమంది కార్మికులు పని చేస్తున్నారు. వారిలో ఏడు శాతంమంది పది, పద్నాలుగేళ్ళ ప్రాయంవారు. పంధొమ్మిదేళ్ళకు లోబడినవారు ఇరవైఅయిదు శాతంమంది ఉన్నారు. వీరిలో చాలామంది బడిచదువులు అర్ధాంతరంగా ఆపేసినవారే. ప్రాథమిక విద్య ఉచితమే అయినప్పటికీ దానిని అందుకోలేక పోతున్నారు. నీళ్ళు లేక మలమల వాడిపోతూన్న పైర్లకు రసాయనిక ఎరువులు వేసినట్లున్నాయి- తిండికి నోచుకోనివాళ్లకు ఉచిత విద్యా సౌకర్యాలు. చదువా? తిండా? అనాథ శరణాలయాలా? లేక అగ్గిపెట్టెల పరిశ్రమ లాంటి కూలినాలా? వీటిలో ఏదో ఒకదానిని మాత్రం చేపట్టవలసిన నిర్బంధమైన పరిస్థితి! ఆకలి దప్పులతో చదువా? ఆకలి తీర్చే శ్రమా? ఏది ముఖ్యం? అన్న ప్రశ్న రాక్షసాకారంతో వారిని వేధిస్తూంది. ఈ రెండూ కాదంటే జనసమ్మర్దం గల స్థలాలలో భిక్షమెత్తడం లేదా దొంగతనం చేసి....బాల నేరస్థులుగా మారిపోవడం ఇవే మన పుణ్యభూమిలో వారికున్న మహత్తర అవకాశాలు!

1976 సం॥ మన కేంద్రప్రభుత్వం బాలల శ్రమ-సమస్య దాని స్థితిగతులు, పరిశీలించడానికి హర్చన్ సింగ్ కమిటీని ఏర్పాటు చేసింది. బాణాసంచా పరిశ్రమలలోనూ, అచ్చు యంత్రాలలోనూ బాలలను నియమించడం వెంటనే ఆపుచేయాలనీ, అగ్గిపెట్టెల పరిశ్రమలో క్రమక్రమంగా బాల కార్మికులను నిషేధించవచ్చనీ - ఆ కమిటీ సిఫార్సు చేసింది. అగ్గిపెట్టెల పరిశ్రమ తదితర పరిశ్రమలలో కూడా వేతనాలు పెంచాలని కూడా ఆ కమిటీ సిఫార్సు చేసింది.

ప్రభుత్వం చేసిన చట్టం - తూ. చ. తప్పకుండా అమలు చేయాలని కొందరు అధికారులు ప్రయత్నించారు. పదునాలుగేళ్ళకు లోబడిన పిల్లల్ని అగ్గిపెట్టెల పరిశ్రమలలో చేర్చుకోడానికి నిరాకరించారు. అంతే-ఆ పిల్లల తల్లిదండ్రులు-నెత్తి నోరూ మొత్తుకుంటూ అధికారుల కాళ్ళావేళ్ళాపడి గోడుగోడుమన్నారు. పిల్లలు పని చేయలేదంటే తమ శరీర కష్టంతో మాత్రం పొయ్యిలో పిల్లిని లేపడం అసాధ్యం అని వాపోయారు. నిజమే. బాలల శ్రమ నిషేధ చట్టం వల్ల-పేదప్రజల ఆర్థికస్థితి మరింత దయనీయస్థితికి దిగజారుతుంది. అంచేత బాలల శ్రమ నిషేధం అటుంచి - ఇప్పుడు శ్రమిస్తున్న బాలల వృత్తికేంద్రాలు వాతావరణం స్థితిగతులు ఆరోగ్యకరంగా వున్నాయా? లేనిపక్షంలో దానిని అభివృద్ధిపరచడం ఎలా? మొదలైన విషయాలు కూడా గమనించాలి.

బాలల శ్రమ నిషేధం అన్నది - అంత సులభమైన సమస్య కాదు. దీని పరిష్కారం ఒక్క చట్టంతో - ఒక్క రోజులో అయ్యే పని కాదు. దీర్ఘకాల పథకం కావాలి. దానికి మొదటి మెట్టు-ప్రాథమిక విద్య బాలలందరికీ అందుబాటులో వుండేట్లు చూడటం. చదువుకునే పిల్లల కడుపు నిండా తిండి పెట్టగలిగే వ్యవస్థ కావాలి. అలాంటి ఆరోగ్యస్థితిని తల్లిదండ్రులకు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు కల్పించాలి. ప్రాథమిక విద్య తర్వాత-వారివారి ఇష్టానుసారం అభిరుచికి అనుగుణంగా వృత్తులను ఎన్నుకునే మంచి రోజులు రావాలి.

అప్పుడే—

పశువులుకాస్తూ తమ జీవితాలనే ప్రారంభించే పల్లెటూరి పిల్లల స్థితి; టేబిల్ తుడుస్తూ, సైకిల్ గాలికొడుతూ బాల్యం గడిపే బస్తీ బాలల దుస్థితి; ఏ గొప్పవాళ్ళ ఇళ్లల్లోనో చాకిరీ చేస్తే తప్ప గంజి దొరకదనే పేద బాలికల దుర్గతి-దూరమౌతాయి. □



**ఇండియానా (అమెరికా) విశ్వ విద్యాలయం ఆసుపత్రిలో ఈ మధ్య ఓ పదేళ్ళ అమ్మాయి కవల పిల్లల్ని కన్నది. ఆ ఇద్దరు కూడా ఆడపిల్లలే. అనుకున్న దానికన్న ఆరు వారాల ముందుగానే ఈ పిల్లలు పుట్టారుట. ఇద్దరూ చెరో ఒకటిన్నర కిలోల బరువు వున్నార్ట. ఆరోగ్యంగానే వున్నారు. ఇందులో ఆశ్చర్యపడాల్సిన్న విషయం ఏమీ లేదంటారు ఇండియానా విశ్వవిద్యాలయం గైనకాలజీ ప్రొఫెసర్ డాక్టర్ రాబర్ట్ మున్సిక్. ఆయన కథనం ప్రకారం 1930 లోనే పెరూ దేశానికి చెందిన ఓ ఆరేళ్ళ బాలిక బిడ్డకి తల్లి అయిందిట!**

**మరో విషయమేమిటంటే అమెరికాలో ఈనాడు ఇటువంటి సంఘటన జరిగిందంటే అందులో వింతేమీ లేదనీ అక్కడ పదేళ్ళకే పిల్లల్ని కన్నవారు కొందరున్నారనీ, పదకొండోఏట తల్లులైన వాళ్ళు కోకొల్లలుగా వున్నారని అంటున్నారు. కలికాలం మరి!**

# వృద్ధ సేవాశ్రమాలు

[ ఇటీవల కాలంలో మన దేశంలో కూడా వృద్ధ సేవాశ్రమాలు రోజు రోజుకీ అధికమవుతున్నాయి. పాశ్చాత్య దేశాలలో వలె మన దేశంలోనూ రానురాను వృద్ధులు యింటిపట్టున పిల్లల నీడలో హాయిగా శేష జీవితం గడపకుండా ఈ ఆశ్రమాలలో చేర్చబడుతున్నారు; చేరుతున్నారు. అన్నీ వుండి ఏమీ లేని వాళ్లుగా, ఎవరూ లేనివాళ్లుగా బ్రతుకు వెళ్లబుచ్చుతున్న వీరికి ఎందుకు ఇలా జరుగుతోంది? లోపం ఎక్కడుంది? ]

ప్రభాత సమయం.

అదొక ఆశ్రమం. ఆ ఆశ్రమంలోని వారందరూ వయోవృద్ధులే. వారిలో కొందరు తోట పని చేస్తున్నారు. మరికొందరు బట్టలు ఆరేస్తున్నారు. కొందరు వృద్ధురాండ్రు బియ్యం ఏరుతూ వుంటే మరికొందరు వంట వండుతున్నారు. ఇలా అందరూ ఎవరికి వారు ఏదో ఒక పనిలో హడావిడిగానే వున్నారు ఆ ఉదయాన. వారు సంతృప్తిగా వున్నట్లుగానే కనిపిస్తున్నారు. కాని ఆ వృద్ధుల కళ్ళలో నిరాశ, నిస్పృహలు తొంగిచూస్తున్నాయి. వారిలో కొందరికి కుటుంబాలు వున్నాయి. పెంచి పెద్దచేసిన పిల్లలూ వున్నారు. అయితే మరి యిలా 'అనాథ'ల్లాగా వృద్ధ సేవాశ్రమాలలో చేరడానికి గల కారణమేమిటి?

నేడు దేశం ఒకవిధమైన పరిణామ దశలో వుంది. ఆర్థికంగానూ, సాంఘికంగానూ నాటికీ నేటికీ ఎన్నో మార్పులు వచ్చాయి. వస్తున్నాయి. అలా రావడం సహజం. అయితే వయసు మీరిన పెద్దవాళ్లు ఆ మార్పులకి అలవాటుపడలేక సతమతమవుతున్నారు. తాము ఎంతో పవిత్రంగా ఎంచిన కట్టుబాట్లు తమముందే ఛేదింపబడడం చూసి సహించలేక పోతున్నారు. అక్కడే ప్రారంభమవుతున్నది వీరికీ యువతరానికి మధ్య రగడ. యువతరంతో రాజీపడి నెగ్గుకుపోయే పెద్దలూ వున్నారు. వారు అదృష్టవంతులు. చీకూ చింతా లేకుండా హాయిగా తమ పిల్లల చాటున జీవితం వెళ్ల మార్చ గలుగుతున్నారు.





కాని కొందరు కోడళ్లనీ, కొడుకులనీ ఆరడి చెయ్యడం, వారు అనుభవిస్తున్న నూతన స్వేచ్ఛా జీవితాన్ని చూసి ఓర్వలేక మానసికంగా వారిని దెబ్బతియ్యడానికి ప్రయత్నించడం వంటివి చేస్తున్నారు. చాలా మందిలో వయసు మళ్లాక ఒక విధమైన అసంతృప్తి తల ఎత్తుతుంది. అది యువతరం మీద అసూయకావచ్చు. తమ మాట లెక్క చెయ్యడం లేదన్న ఆక్రోశం కావచ్చు. ఇటువంటి మార్పులు వారిలో కలగడంవల్ల ఆ గృహ జీవితంలో ఛిద్రం ఏర్పడుతున్నది. యాంత్రికంగా శరవేగంతో గడిచిపోయే ఈనాటి నాగరిక ప్రపంచంలో యిటువంటి ముసలివాళ్ల పోరు భరించే శక్తి యువతరంలో చాలా కొద్ది మందికి మాత్రమే వుంటుంది. ఆ వృద్ధులకి సంఘంలో కాస్త పరపతీ ఆస్తి వుంటే ఫరవాలేదు. లేకుంటే ఈ వృద్ధ సేవాశ్రమాలే గతి.

అటువంటి ఆశ్రమాలలో మైసూరులోని వృద్ధ సేవాశ్రమం ఒకటి. ఈ ఆశ్రమాన్ని 'సిస్టర్స్' అని పిలవబడే సేవికలు నిర్వహిస్తున్నారు. ఇక్కడ అరవై ఏళ్ళ పైబడిన వారిని చేర్చుకుంటారు. ఆంధ్ర, మహారాష్ట్ర, తమిళనాడుల నుంచి వచ్చిన వారు కూడా యిక్కడ నివాసం ఏర్పరచుకున్నారు.

1971 లో ఈ ఆశ్రమం ప్రారంభమైనప్పుడు నలభై మంది వుండేవారు. కాని నేడు వారి సంఖ్య 175 కి పెరిగింది! ఇందులో 85 మంది స్త్రీలు, 90 మంది పురుషులు వున్నారు.

వారిని ఎవరైనా — "మీ పిల్లలు, బంధువులు ఎవరూ లేరా మిమ్మల్ని చూసుకోవడానికి?" అని ప్రశ్నిస్తే పాలిపోయిన ముఖాలతో వారి వైపు మౌనంగా చూస్తారే తప్ప సమాధానం చెప్పరు. తొంభై ఏళ్ల ఒక వయోవృద్ధురాలు ఆ ప్రశ్న వినగానే వలవలా కన్నీరు కార్చింది.

అరవై ఐదేళ్ల ఒక రైతు వ్యధ యిది— "నాకు ఐదుగురు కుమారు లున్నారు. అరవయ్యో ఏడు రాగానే వారికి నా భూమి సమంగా పంచి యిచ్చాను. అంతవరకూ అణకువగా వున్న నా కుమారులు ఒక్కసారిగా నన్ను ఏవగించుకోవడం

ప్రారంభించారు. చివరికి నన్నీ ఆశ్రమం పాల్జేశారు. దేశానికి ఒకప్పుడు ఆహారధాన్యాలు సమకూర్చిన రైతుని. నేడు నేను పట్టెడన్నం కోసం బిచ్చమెత్తుకుంటున్నాను ''

మైసూరులోని ఈ ఆశ్రమం నిర్వహణ చాలా మటుకు విరాళాల సేకరణ మీదనే ఆధారపడి వుంది. పాత బట్టలు, పుస్తకాలు తదితర వస్తువులు కూడా విరాళాలుగా స్వీకరిస్తారు వీరు. వరికోత సమయాల్లో దగ్గిర గ్రామాలకి వెళ్లి ధాన్యం, రాగులు, చోళ్లు సేకరిస్తారు. ప్రతి నెలా నగరంలోని ఒక్కొక్క గృహానికి వెళ్లి ఆ గృహస్తులు యిచ్చిన వస్తువులు కూడా ఆశ్రమ నిర్వహణకు ఉపయోగిస్తూ వుంటారు.

ఇది కాక ప్రతిరోజు ఉదయం సేవికలు బజారుకి వెళ్లి కూరలు, మొదలైనవి కూడా దుకాణదారుల నుండి సేకరిస్తూ వుంటారు. ఈ ఆశ్రమంలో వున్న వారిలో కొందరికి పెన్షన్ వస్తుంది. వారు తమకు తోచినంత ఆశ్రమానికి యిస్తూ వుంటారు. అయితే అలా అందరూ యిచ్చి తీరాలన్న నిర్బంధం ఏమీ లేదు.

ఈ ఆశ్రమంలో జబ్బుతో బాధపడుతున్న వారికి వైద్య సదుపాయాలు కలగజేస్తారు. పక్షవాతం వచ్చిన రోగులకి విడిగా ఒక విభాగం వుంది. వీరికి వైద్య సదుపాయం కల్పించడానికి తగిన నవీన యంత్ర పరికరాలన్నీ యిక్కడ వున్నాయి. వీటిని జర్మనీకి చెందిన ఒక సంస్థ విరాళంగా యిచ్చింది. ఈ ఆశ్రమంలో ఆరుగురు గుడ్డి వాళ్లు కూడా వున్నారు. వీరిని అనుక్షణం కనిపెట్టి వుండేందుకు, కావలసిన వన్నీ అమర్చేందుకు పన్నెండు మంది సేవికలు వున్నారు. ఇక్కడ చేరిన వృద్ధులు—వారి పిల్లల వద్ద పొందలేని భద్రతను కనీసం యిక్కడన్నా పొందగలుగుతున్నారు!





ఈ ఆశ్రమంలో చేరిన వృద్ధులకి మంచం, పరుపు మొదలైనవి యిస్తారు. దంపతులైతే వారికి విడిగా నాలుగు గదులు వున్నాయి. ఇక్కడ కుల మతాలు గానీ, వర్ణ తారతమ్యాలు గానీ వుండవు. అందరూ సమానమే.

ఉదయం స్నాన కార్యక్రమాలు అయిన తరువాత కొందరు దైవ ధ్యానంలో నిమగ్నులవుతారు. కొందరు తోటపని చేస్తే మరికొందరు వాహ్యాళికి వెళతారు. స్త్రీలు ఆశ్రమ ప్రాంగణం శుభ్రంగా వుంచడంలోనూ, వంటపనిలోనూ సేవికలకు సహాయం చేస్తారు.

తొమ్మిదిన్నరకి రాగి లేక చోళ్ళ గంజి, పాలు యిస్తారు.

పన్నెండు గంటలకి భోజనం—వరి అన్నం, చారు, కూరలు, పెరుగు యిస్తారు.

సాయంత్రం నాలుగింటికి కాఫీ, వయసుమళ్ళిన వారికి జీర్ణశక్తి తక్కువగా వుంటుందని రాత్రిపూట ఉప్మా, దోసె, కిచిడీ వంటివి—సులభంగా హరాయించుకోగల పదార్థాలు యిస్తారు.

ఇలా అంతా ఒక క్రమపద్ధతిలో జరిగిపోతోంది కాబట్టే ఒక తొంభై ఏళ్ళ వృద్ధుడు ఏ చీకూ చింతా లేకుండా వణుకుతున్న కంఠంతో హాయిగా పాట పాడుకోగలుగుతున్నాడు. తన కుటుంబ సభ్యులను గురించి తలుచుకున్నప్పుడు కాస్త బాధ కలిగినా అతను యిక్కడ స్వేచ్ఛాజీవి. 'ముసలాడు యిలా చేశాడు....అలా చేశాడు' అని ఎత్తిచూపే వ్యక్తులు అక్కడ లేరు. ఆరడి చేసే మనుష్యులూ లేరు.

అయితే ఇటువంటి ఆశ్రమాలను నిర్వహించేందుకు ఎంతో ఓర్పు, శ్రమా కావాలి. అందుకనే ఈ సేవికలకు శిక్షణ యిచ్చేందుకు బెంగళూరులో ఒక కేంద్రం వుంది. ఈ ఆశ్రమం శాఖలు బెంగళూరు, బొంబాయి, మద్రాసు, సికింద్రాబాదు, ట్యూటికోరిన్‌లలో కూడా వున్నాయి.

వీరి వృద్ధ సేవాశ్రమంలో చేరేందుకు చాలా మంది ఉబలాటం చూపుతున్నా స్థలాభావం వల్ల కొందరిని మాత్రమే చేర్చుకోవలసి వస్తున్నది. ఒక్క మద్రాసులోనే రెండు వందల మంది దాకా వెయిటింగ్ లిస్ట్‌లో వున్నారుట! మన దేశంలో వృద్ధులకి జరుగుతున్న సన్మానం, సత్కారం యిదీ!

ఇటువంటి సేవాశ్రమాలు మరిన్ని స్థాపించవలసిన అవసరం కలగడం విచారకరమైన విషయమే. కాని పరిస్థితుల ప్రాబల్యం ఆవిధంగా వుంది....వృద్ధాప్యంలో ఎవరూ లేకపోవడం కంటె యిటువంటి గృహాలలో వుంటూ తోటివారితో పాటు కొంతలో కొంత ప్రశాంతంగా జీవించడం మేలు. ప్రభుత్వం ఈ ఆశ్రమాలకి తమ పూర్తి సహకారాన్ని అందించవచ్చు. వృద్ధాప్య వేతనం యిచ్చి, ఆశ్రమ నిర్వహణకు కావలసిన వస్తువులను తగ్గింపు ధరకి సహకార సంఘాల ద్వారా లభించేటట్లు కూడా చెయ్యవచ్చును.

కాని అది సరైన పరిష్కారం కాదు. 'వారెందుకలా చేరవలసి వస్తోంది? ఎందుకిలా జరుగు

# ఈ 8 కారణాలకోసం ...

























## భారతపు ప్రప్రథమ ప్రెషర్ కుకర్
## నేడు కూడా విరివిగా
## ఉపయోగింపబడుతున్నది



# Prestige

**ప్రెస్టీజ్**
టి టి. (ప్రైవేట్) లి.,
బెంగళూరు–560 016

MCA-TT-50 Tel R

తోంది?' అని ఆలోచించాలి. ముఖ్యంగా ఈ ఆలోచన పిల్లలకి కలగాలి. అప్పుడు వారికి తల్లిదండ్రులను అనాథలుగా సేవాశ్రమాలలో చేర్పించాల్సిన అవసరం గానీ, వృద్ధులకు చేరాల్సిన దుస్థితి గానీ ఏర్పడదు. సర్దుకుపోయే గుణం వుంటే అసలు యిటువంటి సమస్యలు వుత్పన్నమవవు. ఆ గుణం యిరువురూ అలవరచుకోవాలి. ఇవాళ తమ తల్లిదండ్రులు వృద్ధులు కావచ్చు. కాని రేపు తామూ వృద్ధులవుతారు కదా....అప్పుడు తమ గతేమిటి? అన్నది యువతరం కూడా ఆలోచించిన నాడు—ఎవరూ కూడా—తమని ప్రయోజకులను చేసిన తల్లిదండ్రులని పనికిరాని బట్టల్ని లుంగచుట్టి పారేసినట్లు సేవాశ్రమాలలోకి విసిరెయ్యరు.

అయితే ఈ లోపం కేవలం యువతరంలోనే లేదు. వృద్ధులవుతున్నకొద్దీ కొందరు ఒకవిధమైన ఒంటరితనానికి గురవుతారు. అది వారు తమంతటతాము విధించుకున్న ఒంటరితనమే. ఈ ఒంటరితనం నిస్పృహకి దారితీస్తుంది. ముసలితనం వచ్చినంతమాత్రాన నిరాశ, నిస్పృహల మధ్య జీవించనవసరం లేదు. వారు కూడా చురుకుగా మునుపటివలెనే వుండవచ్చును. ముసలితనమన్నది శరీరానికి సంబంధించినదే తప్ప మనస్సుకి సంబంధించినది కాదు. శరీరం పట్టు సడలినా మానసిక యవ్వనంతో వున్నవాళ్ళూ వున్నారు. ముసలితనంలో కూడా వారెంతో హాయిగా జీవితాన్ని గడపగలుగుతున్నారు.

అంచేత పెద్దవాళ్ళు వృద్ధాప్యం శాపం అని భావించకుండా పరిస్థితులను అర్థం చేసుకుని, మారుతున్న కాలంతోపాటే తాము కూడా మారుతూ ప్రయోజకులైన తమ పిల్లలని చూసి సంతోషించి తమ మనస్సును కుటుంబ కలహాల మీద కాక ఆధ్యాత్మక చింతన మీదనో సంఘ ప్రయోజనమైన విషయాల మీదనో లగ్నం చెయ్యాలి. అలా జరిగిన నాడు వారు ఎక్కడో సేవాశ్రమాల్లో ఎవరో తమ బోటి దీనచరితులైన వింత వ్యక్తుల మధ్య మౌనంగా తమ గాథలు వారికి చెప్పుకుంటూ వారి కథలు తాము వింటూ గడపాల్సిన స్థితి ఏర్పడదు. అటువంటి అవస్థా వుండదు. ఏమైనా దీనికి సమాధానం కుటుంబ వ్యవస్థ మీద ఆధారపడి వుంది. ఏ గొడవలు వచ్చినా సర్దుకుపోతూ, కాస్త పట్టువిడుపులతో అరమరికలు లేకుండా సాగిపోయే సంసారంలో పిన్నలు పెద్దలను గౌరవంతోనూ, ప్రేమతోనూ చూస్తారు. పెద్దలకి కూడా అప్పుడు వృద్ధాప్యం తమ పాలిట శాపం అనిపించదు. □

## తామర పువ్వుల ముగ్గు

ఈ ముగ్గు వేయడానికి ముందుగా 15 చుక్కలు 5 వరుసల్లో పెట్టుకోవాలి. తర్వాత ఒక చుక్క వదిలి 5 వరకు చుక్కలు పెట్టుకోవాలి. ఆ తర్వాత చిత్రంలో చూపించినట్లుగా కలుపుకుంటూ వస్తే ముచ్చటైన తామరపువ్వుల ముగ్గు తయారవుతుంది.

—ఎస్. పద్మిని



# వంటలు



పెద్ద పెద్ద పట్టణాల్లో 'ఫైవ్ స్టార్ హోటల్స్' అని పెద్ద పెద్ద హోటల్స్ వుంటాయి. ఆ హోటల్స్‌లో గదుల అద్దెలలాగే, భోజనమూ తక్కిన ఆహార పదార్థాలూ కూడా ఖరీదుగా వుంటాయి. అంతంత ఖరీదులు గల ఆ ఆహార పదార్థాలు ఎలాంటి రుచులతో వుంటాయి? వాళ్ళు ఏమిటేమిటి ఇస్తారు? అన్న సందేహం ఎందరికో కలుగుతూనే వుంటుంది. ఆ పదార్థాలు మామూలుగా మనం కూడా చేసుకోవచ్చు. అయితే, వాటి ఖరీదులు హెచ్చుగా వుండడానికి వేరే కారణాలుంటాయి. అలాంటి హోటల్స్‌లో ఒకటైన మద్రాసులోని 'చోళా – షెరటన్'లోని ఆహార పదార్థాలు ఎలా తయారు చేస్తారో, వారు వివరించారు.

## మటర్ పనీర్ కీమా

కావలసిన పదార్థాలు : 1 కిలో ఛీస్ (జున్ను), 1 కిలో బటాణీలు, 115 గ్రాములు నెయ్యి, 5 గ్రాములు ఎండుమిరపకాయలు, 115 గ్రాములు టొమాటోలు, 55 గ్రాములు పెరుగు, 10 గ్రాములు వెల్లుల్లి, 20 గ్రాములు అల్లం, 5 గ్రాములు గరంమసాలాపొడి, 55 గ్రాములు జీడిపప్పు, 55 గ్రాములు ఎండుద్రాక్ష, 5 గ్రాములు ధనియాల పొడి, 5 గ్రాములు పసుపు, కొత్తిమెర, రుచికి తగినంత ఉప్పు.

తయారుచేయవలసిన విధానం : మొదట జున్నుని చిన్న చిన్న ముక్కలుగా చేసుకోవాలి. ఉల్లిపాయలు సన్నటి ముక్కలుగా తరిగి వుంచుకోవాలి. ఆ తరువాత అల్లం, వెల్లుల్లిపాయలు మెత్తగా నూరుకోవాలి. బాణలిలో నెయ్యి వేసి అందులో బంగారువన్నె రంగు వచ్చేదాకా ఉల్లిపాయ ముక్కల్ని వేయించి దానికి అల్లం, వెల్లుల్లి, పసుపు, మిరపకాయలు, ధనియాలపొడి చేర్చాలి. నెయ్యి విడిగా వచ్చేదాకా బాణలిలో వీటిని ఉడకనివ్వాలి. ముక్కలుగా తరిగిన టొమాటోలని, చిలికిన పెరుగునీ ఈ మిశ్రమానికి చేర్చి కాస్సేపు స్టవ్ మీద వుంచి ఆ తరువాత బటాణీలు చేర్చి ఉడకబెట్టాలి. ఇప్పుడిక దీనికి ముక్కలుగా చేసి వుంచుకున్న జున్ను, జీడిపప్పు, ఎండుద్రాక్ష చేర్చాలి. బాగా ఉడికిన తర్వాత దీని పైన గరంమసాలాపొడి, కొత్తిమిర చల్లుకోవాలి.

## టొమాటో–కొబ్బరి పులావ్

కావలసిన పదార్థాలు : 1 కిలో బసుమతి బియ్యం, 500 గ్రాములు టొమాటోలు, 55 గ్రాములు నెయ్యి, 60 గ్రాములు ఉల్లిపాయలు, 60 గ్రాములు కొబ్బరి, 30 గ్రాములు ఎండుద్రాక్ష, 30 గ్రాములు జీడిపప్పు, 10 గ్రాములు గరంమసాలాపొడి, 10 గ్రాములు పచ్చిమిరపకాయలు, 1 టీ స్పూన్ పసుపు, రుచికి తగినంత ఉప్పు.

తయారు చేయవలసిన విధానం: ముందుగా కొబ్బరి కోరుకుని ఆ కొబ్బరికోరుకి తగినంత నీరు చేర్చి కొబ్బరిపాలు తయారుచేసుకోవాలి. టొమాటోల తోలు చక్కగా ఒలిచి వడగట్టి ఆ రసాన్ని కొబ్బరిపాలతో కలపాలి. పచ్చిమిరపకాయలు, పసుపు కలిపి బాగా నూరి వుంచుకోవాలి. ఆ తరువాత గరంమసాలాపొడి బియ్యం మీద చల్లి బాగా కలియబెట్టాలి. ఇలా చేయడంవల్ల మసాలాపొడి బియ్యానికి బాగా అతుక్కున్నట్లుగా అంటుకుపోతుంది. ఇప్పుడిక టొమాటో–కొబ్బరిపాల మిశ్రమాన్ని ఈ బియ్యానికి కలిపి పులావ్ అన్నం తయారయ్యేదాకా ఉడకబెట్టాలి. ఆ తరువాత ఎండుద్రాక్ష, జీడిపప్పు, వేయించిన ఉల్లిముక్కలు పులావ్ పైన చల్లితే రుచిగా వుంటుంది.

## మినపపప్పు మిక్స్చర్

కావలసిన పదార్థాలు : 500 గ్రాములు మినపపప్పు, 15 గ్రాములు ఉప్పు, 55 గ్రాములు ఉల్లిపాయలు, 10 గ్రాములు పసుపు, 120 గ్రాములు వెన్న, 5 గ్రాములు ఎండుమిరపకాయలు.

తయారుచేయవలసిన విధానం : ముందుగా మినపపప్పు శుభ్రంగా కడిగి తగినంత నీరు చేర్చి ఉడకబెట్టాలి. అలా ఉడుకుతూ వుండగానే దానికి పసుపు, ఉప్పు చేర్చాలి. తరువాత ఒక బాణలి తీసుకుని అందులో వెన్న వేసి అది బాగా కాగిన తరువాత సన్నటి ముక్కలుగా తరుక్కున్న ఉల్లిపాయలు, ఎండుమిరపకాయ ముక్కలు బాణలిలో వేసి యివి వేగిన తర్వాత ఉడకబెట్టిన మినపపప్పుని బాణలిలోని ఈ మిశ్రమానికి చేర్చి బాగా కలియబెట్టాలి. కొద్దిసేపు స్టవ్ మీద వుంచి దింపితే ఘుమఘుమలాడే మినపపప్పు మిక్స్చర్ నోరూరిస్తూ తయారవుతుంది.



మటర్ పనీర్ కీమా



మినపపప్పు మిక్స్చర్

వర్ణచిత్రాలు : సత్యకుమార్

టొమాటో-కొబ్బరి పులావ్



# మన దేవాలయాలు:

# పైడిమాంబ

విజయనగరంలోని "పైడితల్లి గుడి"కి చాలా ప్రాముఖ్యతా విశిష్టతా వున్నాయి. 'సత్యమైన దేవిగా' ఆ అమ్మ వారిని ఆ ప్రాంతాలవారు గట్టిగా విశ్వసిస్తారు. విజయనగరం, విశాఖపట్నం ప్రాంతాల నివసించే 'పైడిరాజు' 'పైడమ్మ', 'పైడితల్లి', 'పైడయ్య' మొదలైన పేర్లన్నీ ఆ దేవతకు చెందినవే. ఈ దసరా రోజుల్లో 'పైడిమాంబ'కు ఘనంగా ఉత్సవాలు జరుగుతాయి. ఆ సందర్భంగా ఈ వ్యాసాన్ని అందజేస్తున్నాము.

ఉత్తరాంధ్రలో విద్యల నగరంగా ప్రసిద్ది చెందిన విజయనగరంలోని శ్రీ పైడిమాంబ దేవాలయం సంవత్సరం పొడవునా భక్తుల నాకర్షించుతూ అశేష జనానికి ఆరాధ్య స్థలంగా వుంటోంది. గ్రామ దేవతలుగా పరిగణింపబడుతూన్న శ్రీ నూకాలమ్మ, ఎల్లమ్మ వగైరాల ఉత్సవాలకు, శ్రీ పైడిమాంబ ఉత్సవాలకు సారూప్యం కానరాకపోవడంతో పైడిమాంబను గ్రామదేవతగా భావించడానికి వీలులేదనిపిస్తుంది. వామ హస్తాలలో ఖడ్గం, త్రిశూలాలు, దక్షిణ హస్తాలలో ఢమరుకం, కుంకుమ భరిణెలూ కలిగి వున్న దేవి రూపురేఖలు బెజవాడ కనకదుర్గను, కాళీమాతను పోలినట్లుండటం వల్ల ఆయా దేవతల అంశంతోనే పైడిమాంబ వెలసిందని అనుకోవచ్చు. అయితే, విజయనగర సంస్థాన పాలకులైన పూసపాటి గజపతిరాజుల కోట శక్తికి శ్రీ పైడిమాంబకు గల సంబంధం అత్యంత సన్నిహితమైందని ఉత్సవాలు నిరూపిస్తున్నాయి.

ఏటేటా ఆశ్వయుజమాసం దసరా రోజులలో విజయదశమి వెళ్ళిన మంగళవారంనాడు శ్రీ పైడిమాంబ "సిరిమాను ఉత్సవం" కడువైభవంగా నిర్వహించబడుతూ వుండటం ఒక ప్రత్యేకత; వంశపారంపర్య ధర్మకర్తలైన విజయనగర సంస్థానాధీశుల ఆధ్వర్యాన్నే యీ వుత్సవాలు నిర్వహించబడతాయి. సంస్థానాల రద్దు అనంతరం కూడా ఆ వంశీయులే ధర్మకర్తలుగా వుంటూ యీ ఉత్సవాలను జయప్రదం చేస్తున్నారు. నగరంలో యీ నెల రోజులూ వేలాది జనులు అమ్మవారిని దర్శించి పూజలు జరిపిస్తూంటారు.

పండుగ పదిహేను రోజులుందనగానే నిరుపేద తరగతులకు చెందినవారు పులివేషాలు వేసుకొని, డప్పు వాద్యాలతో యాచనచేసి మొక్కుబడులు తీర్చుకొనటం ఒక అలవాటుగా మారింది. ఇరానీ డ్యాన్సులు, కర్రసాములు కూడా జరుగుతూంటాయి. కొందరు మొక్కుకున్న తీరునుబట్టి జలఘటాలను నెత్తిన పెట్టుకొని, నేలను తాకకుండా వస్త్రాలపై నడుస్తూ దేవళానికి వచ్చి మొక్కుబడులు తీర్చుకుంటారు. దేవళ ప్రవేశానికిగానీ, ఆరాధనానికిగాని కులమత వర్ణవర్గ విచక్షణ లేదు.

సిరిమాను ఉత్సవం:

పండుగకు నెల రోజుల ముందు అమ్మవారు కలలో కనపడి, ఫలానా వారి తోటలో "సిరిమాను" ఉందని పూజారికి చెప్పడం, పూజారి ఆ మేరకు ఆ నాడు ఉపవాసం చేసి, ఆ వృక్షానికి పూజచేసి సిరిమానును కొట్టి తీసుకురావడం ఒక ఆచారంగా జరుగుతూవుంది. 26 అడుగుల పొడవు వుండే ఆ సిరిమానును అధిరోహించే (పూజారి వంశానికి చెందిన) వ్యక్తి సంసార బంధ విముక్తుడై ఉండాలనే ఆచారం కూడా వుంది. అంతేకాదు - కాశీ కోకను ధరించాలనే నిబంధన కూడా ఉంది.

మంగళవారం సాయంత్రం నాలుగున్నర గంటల ప్రాంతంలో యీ ఉత్సవం ప్రారంభమవుతుంది. సూర్యాస్తమయానికి ముందుగానే సిరిమాను మూడు పర్యాయాలు అమ్మవారి దేవాలయం – రాజప్రాసాదాల మధ్య తిరుగుతుంది. నాడు కోటలోని ఆహూతుల నుంచి సిరిమానును అధిరోహించిన వ్యక్తి నూతన వస్త్రాలను అందుకుంటాడు. సిరిమానుకు ముందు తెల్లటి పట్టపుటేనుగు రూపం, ఆ వెంట బెస్తల పాలదార, తరువాత అంజలి రథం నడుస్తాయి. ఆ వెనుక శుభ్రంగా అలంకరించబడిన ఒక బండిపై 26 అడుగుల పొడవు గల యీ సిరిమాను గడను యించుమించు ఏటవాలుగా అమర్చి, అరటిపళ్ళ గెలలు మొదలైన వానిని దానికి కట్టి, దాని చివరలో సిరిమానును అధిరోహించవలసిన వ్యక్తిని ఒక ఆసనంలో కూర్చుండబెట్టి గట్టిగా కడతారు. నిష్ఠలో వున్న ఆ వ్యక్తి నూతన వస్త్రాలను, తలపాగాను ధరించి చేతిలో విసనకర్రతో నిర్లిప్తంగా దేవి ధ్యాసలో నిమగ్నుడై వుంటాడు. అశేష జనం మధ్యనుండి ఆ బండి భక్తులచే లాగబడి మెల్లమెల్లగా కదిలిపోతూవుంటే ఆకాశంలో పీఠం వేసి కూర్చొన్నట్టు కనపడే ఆ గడ మీద వ్యక్తి పైకి–చుట్టూ వున్న భక్తులు ఫలపుష్పాదులను విసురుతూ అతనిని అభిషేకిస్తూ వుంటారు. ఆ సిరిమానోత్సవాన్ని తిలకించడానికి





దీపాలు ఏర్పాటు చేస్తాడు. ఆ చిన్నారి ప్రతిరూపమే ఆనాటి మరుచెరువు (ఇప్పటి విజయనగరం మహారాజు వారి కోటకు పశ్చిమ దిశలో రమారమి వంద గజాల దూరంలో గల పెద్ద చెరువు) ప్రాంతంలో భీమదేవుని ప్రతిష్ఠించి ఉండవచ్చునని ఒక కథనం.

విజయనగర ప్రాంతవాసులనుండి వినవచ్చే మరో గాథ యిలా వుంది:

గోదావరి జిల్లా పిఠాపురం ప్రాంతాన గల తాళ్ళపాలెం నుండి వచ్చిన క్షత్రియ దంపతులు-అలనాటి మరుచెరువు ప్రాంతం చుట్టూ గల అరణ్యాలలో నివసిస్తూన్న కోదులు, ఓఢ్రజాతికి చెందిన కొందరి ఆటవిక జాతివారికి ప్రభువులుగా స్థిరపడ్డారు. వారికి కల్గిన మగశిశువుకు భీమరాజు అని నామకరణం చేసారు. అతడు తనకు 16వ యేట కలిగిన గండాన్ని తప్పించుకొని నారాయణపురానికి రాజుగా అక్కడి పట్టపు ఏనుగుచేత వరించబడతాడు. (ఇతనే చరిత్రలో పూసపాటి వంశీయులకు మూలపురుషుడుగా కానవస్తూన్న మైలమ భీమదేవుడనే వాదన కూడా ఒకటుంది) కొన్నాళ్ళకు భీమదేవు ఒక యుద్ధంలో నిహతుడు కాగా అతని భార్య తన కుమారులను తీసుకుని మరుచెరువు ప్రాంతానగల అత్త మామల యింటికి వస్తుంది. కుమారులు పెద్దవారై శత్రు రాజులను నిర్జిస్తారు. అందులో పెద్ద కుమారుడు యుద్ధానికి బయలుదేరుతూండగా ఒక యువతి ఎదురువచ్చి జయజయ ధ్వానాలు పలికి అతని ఎదుటనే ఒక చెట్టు దగ్గరగల మాణిక్యేశ్వరి విగ్రహానికి తల బాదుకుని చనిపోతుంది. రాజకుమారుడు అది చూసి నిశ్చేష్టుడై వుండగానే ఆ చిన్నారి సజీవియై తిరిగి ఆ జయధ్వానాలనే మరల చేసి తిరిగి మాణికేశ్వరిలో ఐక్యమవుతూ, తన రూపాన్ని అతని రాజ్యంలో ప్రతిష్ఠింపజేయాలని కోరుతుంది. రాజకుమారుడు తన విజయ యాత్రానంతరం ఆ మాణిక్యేశ్వరి ప్రతిరూపాన్ని మరుచెర్వు దగ్గర గల తమ తోటలో ప్రతిష్ఠించాడు. ఆ చిన్నారి ప్రతిరూపమే పైడిమాంబ అని మరొక గాథ.

1757వ సంవత్సరంలో బొబ్బిలి – విజయనగర సంస్థానాల మధ్య వైరం తారస్థాయి నందుకుంది. దానికి తోడు పరాసుదొర బుస్సీ అగ్నికి ఆజ్యంలా తోడు పడ్డాడు. విజయరామ గజపతుల వారి చిన్నారి చెల్లెలు పైడిమాంబ తన అన్నకు జయం చేకూర్చమని, ఆపదనుండి కాపాడమని దేవి ఆరాధనలో నిమగ్నమైపోయింది. గజపతి బొబ్బిలి కోటను వశపరచుకొనడం జరిగిందిగాని, యీలోగానే

కనీసం ఒక లక్షమంది దాకా ప్రజలు వస్తారు.

శ్రీ పైడిమాంబ పుట్టుపూర్వోత్తరాలు యిదమిత్థంగా తెలియరావటంలేదు. జనశ్రుతిగా వినవస్తున్న గాథలేగాని స్థల పురాణం వున్నట్లు కూడా తెలియదు. ఒకనాటి విజయనగర సంస్థానాధీశులైన శ్రీ విజయరామ గజపతుల చెల్లెలే యీ పైడిమాంబ అని కొందరు – ఆమె సంస్థానాధీశుల ఇలవేలుపు అని కొందరు చెప్పుకోవటమేగాని కచ్చితమైన చరిత్రాధారాలు దొరకవు.

విశాఖపట్నం జిల్లా వృత్తాంత సంగ్రహం (డిస్ట్రిక్టు మేన్యువల్) నుండి లార్డు కార్మికేలు సంతరించిన గాథలోని అంశం యిలా వుంది:

జగన్నాధపుర రాజయిన ప్రతాపరుద్రుని కుమారులలో ఒకడైన భీమదేవుడు రాజ్యంలేని కారణంగా తిరుగుతూ వున్నపుడు అష్టమాశిగలు అతనిని తమ ప్రభువుగా చేసుకుంటారు. అతడు రాజ్య కాంక్షతో కాలహండీ రాజ్యంపై దాడిచేసి రాజధానిని వశం చేసుకున్నప్పుడు అచ్చటి ప్రజలు భీతావహులై పారిపోయారు. భీమదేవునికి ఆ గ్రామంలో బంగారు ఆభరణాలతో అలంకరించబడిన ఒక చిన్నారి విగ్రహం కనబడి, తాను మాణిక్యేశ్వరిలో అంతర్భూతమై వున్నానని, తనను ఆరాధించిన వారికి యిష్టసిద్ధి కలుగుతుందని పలికినట్లు అతనికి అంతర్వాణి ప్రబోధ మవుతుంది. వెంటనే ఆ విగ్రహాన్ని తన రాజ్యంలో ప్రతిష్ఠింపజేసి నిత్య పూజా



గృహాలంకరణలో ప్రాధాన్యత వహించే అనేక వస్తువులలో ''ఫ్లవర్‌వాజ్‌లు'' ఒకటి! ఇవి సోఫా సెట్ల దగ్గరున్న టీపాయ్‌ల మీద, షోకేసుల మీద, గోడల కార్నర్సులోను అమర్చబడి కొట్టొచ్చినట్టు కనబడతాయి. అందుకని యివి అందంగా, రకరకాలుగా మనమే స్వంతంగా తయారుచేసుకుంటే, మార్కెట్టులో లభ్యమయ్యే ఫ్లవర్‌వాజ్‌లకంటె భిన్నంగా వుండి వెరైటీ కనపడుతుంది.

వీటిని తయారుచెయ్యడంలో కొన్ని రకాలు:

**ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో:**

చక్కటి ఆకారం గల మట్టి కుండను తీసుకోవాలి. (దీని అడుగు భాగం నేలకు బాగా ఆనేటట్లుగా ఉండాలి) ప్లాస్టర్ ఆఫ్ పారిస్ పొడరును తీసుకొని (ఈ పొడరు మెడికల్ షాపులలో దొరుకుతుంది) గోరువెచ్చని నీటిలో కలపాలి. ఈ మిశ్రమాన్ని కుండ మీద అలికినట్లు మెతకగా (రఫ్‌గా) పూయాలి. తరువాత పెద్ద పెద్ద బొడిపెలు ఆకారంలో దగ్గర దగ్గరగా ప్లాస్టర్ ఆఫ్ పారిస్ వేయాలి. ఇలా చేసిన తరువాత ఒక రోజు బాగా ఆరనివ్వాలి. ఇప్పుడు మనకు నచ్చిన ఆయిల్ పెయింట్‌ని వేస్తే ఎంతో అందాన్నిస్తుంది. ఈ విధంగా తయారుచేసిన ఫ్లవర్‌వాజ్‌లో వచ్చి గడ్డి ముదిరితే వచ్చే వెన్నుల్ని బాగా ఎండబెట్టి, వాటికి రంగు వేసి ఆ వెన్నుల్ని ఉంచితే ఫ్లవర్ వాజ్ చాల అందంగా ఉంటుంది.

**మట్టి కూజాతో:**

చక్కటి ఆకారం గల మట్టి (నీళ్ళ) కూజాను తీసుకొని దానిపై ముందుగా మనకు నచ్చిన రంగును వేసుకోవాలి. (ముదురు రంగు అయితే త్వరగా మాయదు) తరువాత అజంతా శిల్పం బొమ్మగానీ లేక మీకు నచ్చిన ఏ యితర బొమ్మయినాగానీ కూజాపై ట్రేస్ తీయాలి. అంటే కూజా చుట్టూ చక్కని శిల్పాలని ట్రేస్ తీసి దానికి సరిపడే లేతరంగులు వేయాలి. ఇప్పుడు యీ కూజాలో దగ్గర దగ్గరగా ముళ్ళున్న కొమ్మలు వేయాలి. ఈ ముళ్ళకు మురీలుగాని, థర్మోకోల్‌తో తయారు చేసిన పువ్వులుగాని, సిగరెట్ ముచ్చిని గుండ్రంగా చేసికొని, పాప్ కార్న్సుతోగాని ప్రతి ముల్లుకి గుచ్చాలి. ఓపిక వుంటే వీటికి రంగులు వేసుకోవచ్చు. రంగులు ఆయిల్ పెయింట్సునే వాడనవసరం లేదు. ఎనామిల్ పెయింట్సు వేసినా బాగానే ఉంటాయి.



**హారతి పిడతతో:**

హారతి యిచ్చే మట్టి పిడతలు కుండలమ్మేవారి దగ్గర దొరుకుతాయి. దీని ఖరీదు 15 పైసలు మాత్రమే. దీన్ని పట్టుకోటానికి చెవి ఉంటుంది. ఆ చెవిని విరిచేస్తే హారతి పిడత గుండ్రంగా గంధపు గిన్నెలా వుంటుంది. ఇప్పుడు దానిపై మనకు నచ్చిన రంగు వేయాలి. తరువాత కొన్ని అద్దాలను (చీరలపై కుట్టుకునేవి) తీసికొని వాటి అంచులకు రంగు వేయాలి. బాగా ఆరిన తరువాత ఈ అద్దాలను ఫెవికాల్‌తో పిడత చుట్టూ అంటించాలి. మిగిలిన ఖాళీలలో ''చిప్స్'' అంటిస్తే మెరుస్తూ వుంటుంది. ఇప్పుడు యీ గిన్నెలో ఫ్లవర్ పిన్నును ఉపయోగించి మనకు నచ్చిన విధంగా పుష్పాలంకరణ చేసుకోవచ్చును.

**సరుగుడు కాయలతో:**

ఒక ఖాళీ పాల డబ్బాను తీసుకొని దాని పొడవు కొలిచి, ఆ కొలత ప్రకారం కొన్ని పూచిక చీపురు పుల్లలను కత్తిరించుకోవాలి. ఇప్పుడు డబ్బాపై ఈ పుల్లల్ని ఒక దాని పక్క ఒకటి ఫెవికాల్‌తో అంటించాలి. బాగా ఆరిన తరువాత నల్లటి లేసు తీసుకొని డబ్బా పైనా, క్రిందా బోర్డర్‌లా అంటించాలి. ఈ విధంగా తయారు చేసిన ''వాజ్''లో కొన్ని చిన్న చిన్న సరుగుడు కొమ్మలను (కాయలతో సహా ఉండాలి) తీసుకొని, వాటిపై మనకు నచ్చిన రంగులను వేసి అమర్చితే, ఆ ఫ్లవర్‌వాజ్ కూడా చూడటానికి చాలా ముచ్చటగా, కొత్త రకంగా కనపడుతుంది. (ఫొటోలో గల ''ఫ్లవర్‌వాజ్'' యిదే!)

—దండు విజయలక్ష్మి

పైడిమాంబకు మహమ్మారి సోకి తాను కొల్చుకుంటున్న దేవిలో లీనమయిపోయింది. ఈ వార్త తెలియని విజయరామరాజు, బుస్సీ కుట్రను గ్రహించలేక అతడు ఏర్పరచిన ప్రత్యేక గుడారంలో విశ్రాంతి తీసుకుంటూ నిద్రిస్తూ ఉండగా చిన్నారి చెల్లెలు పైడిమాంబ కలలో కనబడి తాను దేవిలో లీనమైనట్లు, పరాసువారి కుట్ర యింకా సాగుతున్నట్టూ, దేవి ప్రతిమ ఆశ్వయుజమాసంలో విజయదశమి తదుపరి తెల్లవారితే మంగళవారమనగా అర్ధరాత్రి విజయనగరం మరుచెర్వులో పశ్చిమ భాగాన లభిస్తుందనీ, ఆ ప్రతిమను ప్రతిష్ఠించి పూజలు సల్పుతూ ఆశ్వయుజమాసంలో పౌర్ణమినాడు ఉత్సవాలు జరిపితే తమ వంశానికి, పాలితులకు సర్వత్రా సర్వదా సర్వ సుఖశాంతులూ కలుగుతాయని చెప్పిందట. ఆ ప్రకారమే శ్రీ ఆనంద గజపతులవారు ఆ విగ్రహాన్ని కనుగొని మరుచెరువు దగ్గరలోని పూలతోటలో ప్రతిష్ఠింపజేయటం జరిగింది. ఇది ఒక చరిత్ర గాథ।

ఏమైనా విజయనగరం సంస్థానానికి యీ దేవళానికి ఏదో తెలియని అనూచానంగా వస్తున్న ఆచార సంప్రదాయ బద్ధ సంబంధమున్నందువల్లనే, పండుగకు ముందు దినాన (సోమవారం రాత్రి) పైడిమాంబ దేవళం చదురుపై ఉన్న ఘటాలను మేళతాళాలతో కోటకు తీసుకొని పోవడం, కోటపాలకులచే పూజలందుకొన్న తరువాత తిరిగి దేవళానికి చేర్చటం పూర్వం నుండి జరుగుతూవుంది. ఆ రాత్రి పూజారి అమ్మవారి కథను చెప్పి, అమ్మవారికి విత్తన ధాన్యాలను చూపించి రైతులకు పంచటం ఆనవాయితీగా వస్తూవుంది. రైతులు ఆ విత్తనాలను తీసుకొని పోయి తమ విత్తనాలలో కలుపుకొని పొలాలలో చల్లుకుంటే అత్యధిక పంట పండుతుందని గట్టి నమ్మకం। □



# నాణానికి మూడో వైపు

డాక్టర్ టి. విమల

ఇంటర్వ్యూ జరుగుతోంది.

బలి పశువులా ఒక్కొక్కర్నే లోపలికి నెడుతున్నాడు ప్యూను....

సారథి నిట్టూర్చాడు. ముఖానికి పట్టిన చెమటని జేబు రుమాలుతో తుడుచుకున్నాడు. చుట్టూ పరికించి చూశాడు.

తన చుట్టు ప్రక్కల దాదాపుగా ఓ వందమంది అభ్యర్థులు కుర్చీలలో కూర్చొని వున్నారు. దూరంగా గార్డెన్‌లో చెట్లక్రింద కొంతమంది నిలబడి సిగరెట్లు తాగుతూ పిచ్చాపాటీ మాట్లాడుకొంటున్నారు. మరి కొంతమంది గార్డెన్‌లో ఎత్తుగా పెరిగిన పచ్చిక మీద కూర్చొని జనరల్ నాలెడ్జి పుస్తకాలు తిరగేస్తున్నారు.

అయితే - అందరి చేతుల్లోనూ కష్టపడి చదివి సంపాదించిన డిగ్రీ సర్టిఫికెట్స్ భద్రంగా దాచిన ఫైల్సున్నాయి. అందరి ముఖాల్లోనూ ఆందోళన కొట్టొచ్చినట్లు కనబడుతోంది. అందరి మనసుల్లోనూ ఏదో ఆశ.

ఎవరికి వారు తమకి సెలక్షన్ వస్తుందని లోపల్లోపల ఆశపడుతున్నారు. అవును మరి! మనిషికి ఆశ ప్రధానం. ఆ ఆశ లేకపోతే మనిషి ముందుకు నడవలేడు. ఆశ మనిషికి ప్రాణం. నిరాశా నిస్పృహల జీవితం ఏదీ సాధించలేదు. అందుకే ఎవరికి వారు తామీ ఇంటర్వ్యూలో తప్పక జయిస్తామనే ఆశతో, ఎంతెంతో దూర భారాల నుండి, ఎంతో శ్రమకోర్చి ఇంటర్వ్యూకి రావడం తటస్థించింది. కాని - ఇంతమందికీ ఉద్యోగాలు వస్తాయా? ఉద్యోగం వరించిన వారిముఖాల్లో సంతోష రేఖలు! వరించని వారి ముఖాల్లో విషాదచ్ఛాయలు! విధి ఎంత విచిత్రమైనది! ఎంత బలీయమైనది!....

ఆలోచించలేక పోయాడు సారథి.

సారథి కడుపులో ఆకలి పెచ్రేగిపోతోంది.

శరీరం అలసటతో విశ్రాంతి కావాలని కోరుకొంటోంది. కాఫీ నీళ్ళయినా కడుపులో పోసుకోవాలనిపిస్తోంది.

కాని తన పేరెప్పుడు పిలుస్తారో తెలీదు. తను కాఫీకి వెళ్ళిన సమయంలోనే తనకి పిలుపొస్తే?

అమ్మో! ఇంకేమైనా వుందా? ఇంతదూరం శ్రమపడి వచ్చి, ఇంతసేపూ ఆకలికి వోర్చి నిరీక్షించి, ఆఖరి ఘడియల్లో తన అదృష్టాన్ని పరీక్షించుకొనే అవకాశాన్ని కూడా దూరం చేసుకోవడం ఎలా? ఈ అవకాశం పోతే మళ్ళీ వస్తుందా?

ఆ ఆలోచన రాగానే వొళ్ళు సన్నగా వొణకటం ప్రారంభమైంది - సారథికి. అందుకే కాఫీ త్రాగాలనే ప్రయత్నాన్ని విరమించుకొని, వరండాలో ఓ మూలగా వున్న కుండలోని నీళ్ళు గ్లాసుతో ముంచుకొని, కడుపు నింపుకొని మళ్ళీ వచ్చి యథాస్థానంలో కూలబడిపోయాడు.

ఉదయం నుండి కడుపులో ఏమీ పడకపోవడం వల్లా, ఖాళీ కడుపులో అతి చల్లని మంచినీళ్ళు అకస్మాత్తుగా పడటం వల్లా, కళ్ళు తిరిగినట్లైంది సారథికి. శీతలం కమ్మేసినట్లు, వొళ్ళంతా స్నానం

చేసినట్లు చెమట తడిపేసింది. కాస్త కడుపులో మంటయితే చల్లారిందిగాని నీళ్ళు ఆకలిని హరించ గలదా? నీరసం నరనరంలోకీ వ్యాపించుతున్నట్లు అనిపించింది సారధికి.

అయినా సారధి నీరసంతో నీరుకారిపోవడం లేదు. ఆశతో ఎదురుచూస్తున్నాడు - తనకి పిలుపు ఎప్పుడు వస్తుందా - అని.

కాని - అంతలోనే నిరాశ!

అవును మరి! ఉన్నవి నాల్గు పోస్టులు. వచ్చిన అభ్యర్థుల సంఖ్య - రెండువందల పాతిక మంది. అమ్మో! ఎంత పోటీ! ఇంత మంది హోరా హోరీగా 'ఢీ' కొంటున్న ఈ పోటీలో తనకు విజయం లభిస్తుందా? ఆ నాల్గు ఖాళీల్లో ఒక ఖాళీ తనని వరిస్తుందా? ఏమోమరి! తన అనుమానాన్ని కాలమే పరిష్కరించాలి.

"సారధీ! సారధీ"

పిలుస్తున్నారు ఎవరో.

ఆలోచనలనుండి ఉలిక్కిపడి చుట్టూ చూశాడు సారధి - తనని పిలిచినది ఎవరా అని.

ఇంకెవరు? దేవుడి దర్శనం కోసం పిలుస్తున్న పూజారిలాంటి ప్యూను.

అప్పటికే ఆలస్యమైపోయినట్లు కుర్చీలోంచి లేచి నిలబడి, చేతిలో వున్న ఫైలుని జాగ్రత్తగా గుబుక్కున చంకలో పెట్టుకొని, పరుగులాంటి నడకతో ప్యూను ముందు వాలాడు సారధి.

"వెళ్ళు" స్ప్రింగు డోర్ చేత్తో పట్టుకొని తనని లోపలికి నెట్టాడు ఆఫీసు ప్యూను.

సింహం బోనులోకి అడుగుపెట్టబోతున్న మేక పిల్లలా - భయం భయంగా లోపలికి అడుగు పెట్టాడు సారధి.

భయం భయంగానే చుట్టూ కలయజూశాడు.

విశాలమైన గదిలో - మొజాయిక్ చేయబడిన గదిలో - ఖరీదైన టేబులూ - దాని చుట్టూ ఖరీదైన కుషన్ కుర్చీలూ -

ఆ కుర్చీలలో ఒక ప్రక్కన ముగ్గురు కూర్చొని వున్నారు. వారిలో మధ్య కూర్చొన్న ఆయనకి షుమారు నలభైఅయిదు సంవత్సరాలుండవచ్చు. ఎత్తుగా - ఎర్రగా - లావుగా - మిగల పండిన జామ పండులా వున్నాడు. బట్టతల - గోల్డు ఫ్రేం కళ్ళద్దాలూ - పెద్ద పెద్ద మీసాలూ - కోటేరేసిన ముక్కూ - నల్లని సూటూ - ఠీవిగా దర్పంగా వున్నాడు. ఆయన పేరు రాజశేఖరం. ఆఫీసు హోదా ప్రకారం ఆయన జనరల్ మేనేజరు ఆ కంపెనీకి. రాజశేఖరానికి అటూ యిటూ కూర్చున్నవారు కూడా వయసు పండినవారే! కాని - చాలా సాదాగా వున్నారు.

సారధి వాళ్ళని చూస్తూనే రెండు చేతులెత్తి నమస్కారం చేశాడు - అతి వినయంగా.

కాని - నిలబడ్డ చోటునుండి అంగుళం ముందుకు కదల్లేదు.

"కమాన్ మై డియర్ బోయ్....కమాన్" అన్నాడు రాజశేఖరం - నవ్వుతూ.

గబగబా ముందుకు నడిచాడు సారధి. కాని కూర్చోలేదు.

"కమాన్....టేక్ యువర్ సీట్" మళ్ళీ రాజశేఖరమే అన్నాడు.

"థాంక్యూ సర్స్" అన్నాడు.

రాజశేఖరం సారధిని క్రిందినుండి పైకి ఒకసారి చూశాడు. ఆ వెంటనే తన ప్రతిబింబాన్ని గుర్తుకు తెచ్చుకున్నాడు. తనకూ ఎదురుగా కూర్చున్న కుర్రాడికి ఏవో పోలికలు వున్నట్లు అనుభూతి చెందాడు.

ఒకవేళ....ఒకవేళ....

రాజశేఖరం ఆలోచనలు పలురకాలుగా దారి తీస్తున్నాయి. నో....నో అటువంటిదేమీ కాదు.... అని తనని తాను సముదాయించుకున్నాడు. తన ఆలోచనల్ని అదుపులోకి తెచ్చుకున్నాడు.

'చాకులాంటి కుర్రాడు' అని మాత్రం తన మనసులో అనుకున్నాడు రాజశేఖరం. ఆ తర్వాత బుర్ర గోక్కున్నాడు. ఏదో మరిచిపోయిన వాడిలా చేతిలోవున్న పెన్సిల్‌ని నోట్లో పెట్టుకుని పళ్ళతో కొరుకుతూ ఆలోచిస్తూ వుండిపోయాడు కాసేపు. ఆ తర్వాత ఓ ఫైలు తీసుకొని, అటూ యిటూ కాస్సేపు తిరగేసి, మళ్ళీ సారధి ముఖంలోకి చూసి, మళ్ళీ ఆలోచిస్తూ వుండిపోయాడు.

సారధికి అయోమయంగా తోచింది. తను వచ్చి అయిదు నిముషాలు దాటిపోతున్నా తననెవరూ ఏమీ అడగటం లేదు. ఎందుకు అడగటం లేదు? తనని అసలు అడగటం అనవసరమనుకున్నారా? తనీ ఉద్యోగానికి అనర్హుడా? ఆలోచిస్తున్నాడు సారధి.

"మే ఐ నో యువర్ గుడ్ నేమ్ ప్లీజ్?"

ఆలోచనల నుండి తేరుకొని తలెత్తి చూశాడు సారధి.

రాజశేఖరం మళ్ళీ అడిగాడు.

"సారధి సార్" తక్కున సమాధానం చెప్పాడు సారధి.

"వెరీ ఫైన్....మీదే ఊరు?"

"గుడవల్లేరు సార్."

"ఎంతవరకూ చదువుకున్నారు?"

"ఎం. ఎ. ఫస్ట్ క్లాస్ సార్" ఆ మాట లంటున్నప్పుడు సారధి కళ్ళల్లో గర్వం తొంగి చూచింది.

"అంతేకాదు. యూనివర్శిటీ గోల్డు మెడలిస్ట్ అని కూడా మీ సర్టిఫికేట్స్‌లో వుంది."

"అవును సార్" ఈసారి యింకా గర్వంగా చెప్పాడు సారధి.

"వెరీ గుడ్."

"థాంక్యూ సార్."

అంతే! ఫెళ్ళున నవ్వాడు రాజశేఖరం.

ఆశ్చర్యంగా ఆయన ముఖంలోకి చూశాడు సారధి.

"చూడు మిస్టర్ సారధీ! ఎం. ఎ. లో యూనివర్శిటీ ఫస్టు వచ్చిన వాడివి, ఆఫ్టరాల్ ఈ గుమాస్తా ఉద్యోగానికి ఎందుకు అప్లై చేసినట్లు?" రాజశేఖరం మాటల్లో కొంచెం వ్యంగ్యం ధ్వనించింది.

కొంచెం బాధ కలిగింది సారధికి.

"ఇంతకంటే మంచి ఉద్యోగాలు రాక" అన్నాడు సారధి.

"వాట్!" రాజశేఖరం ఆశ్చర్యంగా సారధి ముఖంలోకి చూశాడు.

"అవును సార్....రికమెండేషన్స్ లేక, లంచాలు యిచ్చుకునే స్తోమతూ లేక, సంవత్సరం నుండి ఎన్ని ఉద్యోగాలకు వెళ్ళినా, ఒక్క ఉద్యోగమూ నన్ను వరించలేదు సార్. అటు వంటప్పుడు ఏదో ఒక ఉద్యోగం చెయ్యాలి గదా!"

సారధిని విచిత్రంగా చూశాడు రాజశేఖరం. ఆయన సర్వీసులో ఎన్నో ఇంటర్వ్యూలు చేశాడు. కాని సారధిలాగా నిర్భయంగా మాట్లాడే అభ్యర్థి నెవర్నీ ఇంతవరకూ చూడలేదు. రాజశేఖరానికి అటు యిటూ కూర్చున్న యిద్దరు పెద్దమనుషులూ సారధిని ఆశ్చర్యంగానే చూశారు. ఇంటర్వ్యూకి వచ్చి యింత తెగించి ఎలా మాట్లాడుతున్నాడా అని కాబోలు!

"మిస్టర్ సారథీ! ఇక్కడ ఉద్యోగం రావాలన్నా ఇంతకు ముందు మీరు చెప్పిన రెండింటిలో ఏదో ఒకటి తప్పనిసరిగా కావాలని అడిగితే — అప్పుడు మీరేం చేస్తారు?" రాజశేఖరానికి కుడి వైపున కూర్చున్న ఒక ఇంటర్వ్యూ మెంబరు అడిగాడు.

కొంచెంసేపు ఆలోచనలో పడ్డాడు సారథి.

"ఎంతో గుడ్‌విల్ వున్న మీ కంపెనీలో కూడా యిటువంటి అన్యాయాలు జరుగుతున్నాయని తెలిసినప్పుడు, మీరు పిలిచి ఉద్యోగం యిస్తానన్నా మీలాంటి ఆఫీసర్ల దగ్గర ఉద్యోగం చెయ్యడానికి నేను రెడీగా లేను. సారీ" అన్నాడు సారథి చాలా దృఢంగా.

నిజానికి సారథిలో అంత ధైర్యం రావడానికి కారణం తను అటెండయిన ఇంటర్‌వ్యూలే! ఎన్నో ఇంటర్‌వ్యూలకి అప్పియరయ్యాడు సారథి. ప్రతిచోటా రికమెండేషన్లూ, మనీ, రాజకీయ నాయకుల ఇన్‌ఫ్లుయన్సూ పని చేశాయేగాని - వర్త వున్న తనకి ఏ ఉద్యోగమూ రాలేదు. అందుకే సారథి నిర్ణయం చేసుకున్నాడు—ఇక్కడ కూడా తనకు ఎదురుదెబ్బే తగిలింది. ఈ ఉద్యోగం కాకపోతే మరొకటి. తన ప్రయత్నం తను చేస్తాడు.

తనకి ఉద్యోగం రాకపోతే ఆ అవమానం తనది కాదు — తనకి యూనివర్సిటీ ఫస్టు యిచ్చి, గోల్డు మెడల్ బహూకరించిన యూనివర్సిటీ వారిది. తన గొప్పతనాన్ని గుర్తించని యాజమాన్యానిది. తనకే విధమైన ఉద్యోగ రక్షణ కల్పించలేని ప్రభుత్వానిది. ఈ అవమానం వీళ్ళందరికీ వర్తిస్తుంది కాని, తనకు కాదు. తనకి తానే సమాధానపడ్డాడు సారథి.

"ఆల్ రైట్ మిస్టర్ సారథీ! ఇంతకుముందు అనుభవం ఏమైనా వుందా?" రాజశేఖరం అడిగాడు.

"ఉంది సార్ .... ఇంటర్వ్యూలకి వెళ్ళటం నిరాశతో వెనక్కి తిరిగి రావడం...."

"అదికాదు నేను అడిగింది. ..ఎక్స్‌పీరియన్స్."

"ఓ....అదా సార్. అయినా అది ఎలా వస్తుంది సార్. ఎవరైనా ఉద్యోగం యిస్తేనే గదా అనుభవం గడించడానికి. అలాకాక పత్రికల్లో పడే ప్రతి అడ్వర్‌టైజ్‌మెంటుకీ అనుభవం అడిగితే ఎలా సార్?"

"పోనీ - మీరు చదివిన సబ్జక్టు ఈ ఉద్యోగానికి ఏవిధంగానైనా ఉపయోగపడతాయా?"

"పడవని ఖచ్చితంగా చెప్పగలను సార్"

"మరెందుకు అప్లై చేశారు?"

"నా ఉద్దేశంలో ఏవో కొన్ని ఉద్యోగాలను మినహాయిస్తే, తక్కిన ఉద్యోగాలన్నీ, చదివిన చదువులకి చేస్తున్న ఉద్యోగాలకి అస్సలు ఏవిధమైన సంబంధం లేదంటాను. ఏ చదువు చదివినా ఆఖరికి ఏదో ఒక ఉద్యోగంలో చేరి కొంతకాలం శ్రమ పడితేనేగాని అనుభవం రాదు. లోతుపాతులూ తెలియవు. డాక్టర్లు కలెక్టర్లుగా చేస్తున్నారు. ఎం. ఎస్సీ. పాసయిన వారు బస్సు కండక్టర్లుగా పని చేస్తున్నారు. బి. ఎ. చదివిన వాళ్ళు కిళ్ళీ బడ్డీలు తెరుచుకొని బ్రతుకు తెరువు చూచుకుంటున్నారు. ఈ ఉద్యోగాలు చేస్తున్నవాళ్ళందరూ ఇంతకుముందు అనుభవం వుండే చేస్తున్నారా? లేదు. కొంత కాలం ఉద్యోగం చేసిగాని అనుభవాన్ని గడించడం లేదు. నేనూ అంతే. మీరు ఉద్యోగం యిస్తే నేర్చుకుంటాను."

"ఆల్‌రైట్ మిస్టర్ సారథీ! ఇంతకీ ఈ ఉద్యోగం మీ ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా అవసరం అంటారా?"

చిన్నగా నవ్వాడు సారథి.

"సారీసర్. అవసరం లేనిదే ఎం. ఎ. చదివిన వాడు - అందునా యూనివర్సిటీ ఫస్టువచ్చిన వాడు - మెట్రిక్యులేషన్ క్వాలిఫికేషన్‌తో కాల్‌ఫర్ చేసిన ఈ గుమాస్తా ఉద్యోగానికి ఎందుకు వస్తాడు సార్? ఈ చిన్న విషయం నానుంచి రాబట్టాలనే ఉద్దేశంతోనే అడిగారు కాని మీకు తెలియంది కాదు"

"అంటే మీ ఆర్థిక పరిస్థితులు బాగుండలేదా?"

"అవును సార్."

"మీ నాన్నగారు ఏం చేస్తున్నారు?"

"మా నాన్నగారు ఎలా వుంటారో నేను చూడలేదు. నాకు ఊహ తెలియకముందే చనిపోయారని మా అమ్మ చెప్పింది."

"ఐ. సీ....మరి మీకుటుంబ పోషణ ఎలా జరుగుతోంది....ఐ మీన్....నా ఉద్దేశంలో మీకేమైనా ఆస్తిపాస్తులున్నాయా?"

"నో సార్. మా అమ్మకు నేను, నాకు మా అమ్మ....ఇవే సార్ మాకున్న ఆస్తిపాస్తులు. ఇక పోతే ఇంతకాలం ఎలిమెంటరీ స్కూలు టీచరుగా పనిచేసి మా అమ్మ నన్నింత వాడ్ని చేసింది. కాని మా అమ్మకు ఈ మధ్య ఆరోగ్యం బావుండక ఇంటిదగ్గరే వుంటోంది. నేనే ఓ పచారీ షాపులో సాయంత్రం పూట లెక్కలు రాసి ఆ వచ్చిన జీతంతో నేనూ మా అమ్మా బ్రతుకుతున్నాము ఏదో విధంగా" అన్నాడు సారథి.

ఒకసారి దీర్ఘంగా నిట్టూర్చాడు రాజశేఖరం.

సారథి ముఖానికి పట్టిన చెమటని చేత్తో తుడుచుకున్నాడు.

"ఆల్‌రైట్ .... ఇక మీరు అడగొచ్చు" అంటూ తన ప్రక్కన కూర్చున్న వారి వైపు చూశాడు రాజశేఖరం.

"మిస్టర్ సారథీ! మీ ఒరిజినల్స్ యిలా యివ్వండి" అన్నారు తర్వాత.

సారథి తన చేతిలో భద్రంగా దాచుకొన్న ఫైలు రాజశేఖరానికి అందించాడు.

ఆయన సర్టిఫికెట్స్ వెరిఫై చేస్తున్నాడు.

సారథిని మిగిలిన ఇద్దరు ఇంటర్వ్యూమెంబర్లు ఏవేవో ప్రశ్నలు అడుగుతున్నారు. సారథి తనకు తోచిన విధంగా సమాధానాలు ఇస్తూనే వున్నాడు.

ఓ అయిదు నిముషాలు యిట్టే గడిచిపోయాయి.

ఇంటర్‌వ్యూ ముగిసింది.

ఒరిజినల్స్ వెరిఫై చెయ్యడం పూర్తిచేసిన రాజశేఖరం ఫైలు మూసి సారథికి అందించబోయాడు.

కాని—

అదే సమయంలో ఆ ఫైలులోంచి ఓ పాస్‌పోర్టు సైజు ఫోటో గుబుక్కున జారి తక్కున శబ్దం చేస్తూ క్రిందపడిపోయింది.

రాజశేఖరం క్రిందపడిన ఫోటోవైపు దృష్టిని నిలిపాడు.

సారథీ చూశాడు.

"నేను తీస్తానుసార్" అంటూ కూర్చున్న కుర్చీలోంచి లేవబోయాడు సారథి.

"సిడౌన్ మైడియర్ బాయ్ ...నేను తీస్తానులే...." అంటూ క్రిందపడ్డ ఫోటోని తీసి ఒక్కసారి స్థాణువులా అయిపోయాడు రాజశేఖరం. తనతల్లి ఫోటోని చూస్తూనే రాజశేఖరం ఎందుకు అలా అయిపోయాడో సారథికి ఎంత ఆలోచించినా అర్థం కాలేదు.

తన తల్లి ఈయనకు తెలుసునా? అయితే ఎలా తెలుసు?

"చూడు మిస్టర్ సారథీ! ఈ ఫోటోలో వున్నావిడ మీకేమవుతారు?" ప్రశ్నించాడు

రాజశేఖరం.

"మా అమ్మ సార్....నాకు ప్రొద్దున లేవగానే మా అమ్మ ముఖం చూసే అలవాటుంది. అందుకే పొరుగూరు వెళ్ళవలసి వచ్చినప్పుడు తప్పనిసరిగా మా అమ్మ ఫోటో వెంట తెచ్చుకుంటూ వుంటాను." ఫోటో తన ఫైలులో వున్నందుకు సంజాయిషీ యిచ్చుకున్నాడు సారధి.

"మీ అమ్మగారి పేరు?"

"శాంతమ్మ సార్."

ఆ పేరు వినడంతోనే రాజశేఖరం ముఖంలో రంగు మారింది. ముఖం చెమటతో తడిసి పోయింది. పైన ఫాను గిరగిరా తిరుగుతూనే వుంది. గదిలోని వాతావరణం చల్లగానే వుంది. కాని రాజశేఖరం చాలా అనీజీగా ఫీలవుతున్నాడు. ఆయనలో సంభవిస్తున్న మార్పుల్ని సారధితో పాటు తక్కిన ఇద్దరు ఎగ్జామినర్సూ అనుమానాస్పదంగానూ, విచిత్రంగానూ గమనిస్తూనే వున్నారు.

ఫోటోని చేత్తో పట్టుకొని తదేకంగా చూస్తున్న రాజశేఖరం ఓ రెండు నిముషాల తర్వాత ఆలోచన నుండి తేరుకొని తనని ప్రక్కన వున్న వాళ్ళు గమనిస్తున్నారని తెలుసుకున్నాడు. ఇంతసేపూ తనెంత అనాలోచితంగా ప్రవర్తించాడో తెలుసుకునే సరికి వొంట్లో సన్నటి వొణుకు ప్రారంభమైంది. అయినా అతి కష్టం మీద తనని తాను నిగ్రహించుకొని చేతిలో వున్న ఫోటోని సారధికి తిరిగి యిచ్చేశాడు.

"వాట్ మిస్టర్ రాజశేఖరం! ఈ కుర్రవాడు మీకు కావాల్సిన వాడా!....ఆ ఫోటోలో వున్నావిడ మీకు తెలుసునా?" అంటూ మిగిలిన ఇద్దరు ఇంటర్‌వ్యూ మెంబర్లూ ఒకేసారి రాజశేఖరాన్ని అడిగారు.

"నో....నో....నాటెటాల్.." కంగారు కంగారుగా జవాబు యిచ్చాడు రాజశేఖరం.

సారధి ఎదురుగా వాళ్ళలా అడగటం, అనుమానాస్పదంగా చూడటమూ రాజశేఖరానికి తల తీసేసినట్లయింది.

అందుకే—

"మిస్టర్ సారధీ! యు కెన్ గో" అన్నాడు రాజశేఖరం.

రాజశేఖరం అందించిన ఫోటోని భద్రంగా ఫైలులో దాచుకొని, లేచి నిలబడి, థాంక్స్ చెప్పుకొని బయటపడ్డాడు సారధి.

గదిలోంచి బయటపడ్డాడన్న మాటేగాని, సారధి ఆలోచనలన్నీ రాజశేఖరం మీదే కేంద్రీకృతమయ్యాయి. రాజశేఖరం ఎందుకలా ప్రవర్తించాడు? తన తల్లి ఆయనకు తెలుసునా? ఒకవేళ తెలిస్తే ఏ విధంగా తెలుసును? నో....నో....తన తల్లి ఆయనకు తెలిసి వుండకపోవచ్చును. ఆయనే తనకేమీ తెలీదని కూడా ఇంతకుముందే అన్నాడు. కాకపోతే — తన తల్లిలాంటి పోలికలున్న వ్యక్తితో ఎవరితోనైనా పరిచయం వుండి వుండవచ్చు. అవన్నీ జ్ఞాపకం వచ్చి ఆయన అలా ప్రవర్తించి వుండవచ్చును - అని సరిపెట్టుకున్నాడు సారధి.

కాని - ఎంత సరిపెట్టుకోవాలని ప్రయత్నించినా ఎందుకో సారధి సరిపెట్టుకోలేకపోతున్నాడు. అతని అంతరాత్మ అందుకు వొప్పుకోవడం లేదు. నిజానికి తర్కించి చూసుకుంటే తనకీ ఆ రాజశేఖరానికీ ఏవో దగ్గర పోలికలున్నట్లు అనిపిస్తోంది. చిన్నప్పుడు ఆయన కూడా తనలాగే స్మార్ట్‌గా అందంగా వుండేవాడేమో! అయినా ఆయన తనలాగా వుండవలసిన అవకాశం ఏముంది? మనిషిని పోలిన మనిషేనా? లేక....లేక ఛీ! ఛీ! తనెంత మూర్ఖంగా ఆలోచిస్తున్నాడు. తన తండ్రి ఎప్పుడో చనిపోయినట్లు తన తల్లి చెప్పింది. ఛీ! ఛీ! తన ఆలోచనా ధోరణి ఎంత వక్రంగా నడుస్తోంది. చదువుకున్నవాడయినా, తనెంత నీచంగా ఆలోచిస్తున్నాడు!

తనలో తనే సిగ్గుపడిపోయాడు సారధి.

కాని - ఎంత వద్దనుకున్నా ఏదో అనుమానం తనని పీడిస్తోంది. తనకీ రాజశేఖరానికీ ఏదో అవినాభావ సంబంధం వుండి వుంటుంది. అలా వుండి వుంటే అది ఎటువంటి సంబంధం? తన ప్రశ్నలకు జవాబు దొరకాలంటే తన తల్లిని అడగాలి.... అడిగితే తన తల్లి బాధపడదు గదా!....

ఇంక అక్కడ ఒక్క క్షణం నిలబడలేక పోయాడు సారధి. సరాసరి బస్ స్టాండుకి బయలుదేరాడు.

## 2

"అమ్మా! నిన్నో విషయం అడుగుతాను. నిజం చెప్తావు కదూ."

ఆ రోజు రాత్రి అన్నం తిని వరండాలో మంచం మీద కూర్చొని వారపత్రిక తిరగేస్తున్న శాంతమ్మ దగ్గరికి వచ్చి నిలబడి భయం భయంగానే అడిగాడు సారధి.

సారధికి తల్లి అంటే భయమూ, భక్తీ, గౌరవమూ, ప్రేమా అన్నీ వున్నాయి. అలా అని చనువు కూడా లేకపోలేదు. కొడుకును కొడుకులా కాక కేవలం ఒక మిత్రుడిలా పెంచి పెద్దజేసింది శాంతమ్మ.

అందుకే తల్లిని ఏ విషయం అడగాలన్నా భయపడడు సారధి. కాని - తను అడగబోయే విషయం అతి మామూలు విషయమా? కాదే! అందుకే తటపటాయిస్తూ నిలబడిపోయాడు సారధి.

"అడుగు బాబూ....అడుగు. రా...వచ్చి ఇలా కూర్చో" అంది శాంతమ్మ ఒక ప్రక్కగా జరిగి కొడుక్కి చోటిస్తూ.

తల్లి ప్రక్కనే చోటు చేసుకొని కూర్చున్నాడు సారధి. కాని - అడగదలుచుకున్న విషయం ఎలా కదపాలా అని ఆలోచిస్తూ వుండిపోయాడు.



**అండమాన్ దీవులలో ఈ మధ్య లాచో అనే పదిహేనేళ్ల యువతి వివాహం అత్యంత వైభవంగా జరిగింది. అంతటి వేడుకలకి కారణం స్ట్రెయిట్ దీవికి చెందిన లాచో మాత్రమే అండమాన్ ఆదిమ జాతివారిలో మిగిలిన స్త్రీ. ఆ జాతి పునరుద్ధరింపబడాలంటే అది ఆమె మీదనే ఆధారపడి వుంది. ఆమె వివాహం గ్రేట్ అండమాన్‌కి చెందిన గోలట్ అనే పదిహేడేళ్ల యువకుడితో జరిగింది. ఆదిమ వాసులలోని 24 మంది ఆ వివాహ వేడుకలలో పాలుపంచుకున్నారు. గత పదిహేనేళ్ళలో వారి జాతిలో జరిగిన తొలి వివాహం యిదేనట. అందుకే కాబోలు అందరూ ముక్తకంఠంతో 'శీఘ్రమే ఆడపిల్ల ప్రాప్తిరస్తు' అని దీవించారు!**

ఒకవేళ తను అడగబోయే విషయం తన తల్లి మీద ఎలాంటి ప్రభావాన్ని సృష్టిస్తుందో అవగతం కాలేదు. అయినా తన మనసులో చెలరేగుతున్న అనుమానపు తరంగాలని ఎంతకాలం అణచుకోగలడు? అందుకే ధైర్యంచేసి తల్లిని అడగటానికే నిశ్చయించుకున్నాడు. అందులోనూ తనకెలాగూ తల్లి దగ్గర చనువుండనే వుంది.

"ఏమిటి బాబూ! ఆలోచిస్తున్నావ్. అడగదలచుకున్న విషయాన్ని అడగటానికి ఎందుకు సంశయించేదీ? నా దగ్గర కూడా బిడియపడతావేమిట్రా చిట్టి నాయనా" అంది శాంతమ్మ కొడుకు తల నిమురుతూ.

"ఏం లేదమ్మా....ఏం లేదు...." గొణిగాడు సారధి.

కొడుకు అంతగా కంగారు పడుతున్నాడంటే ఏదో బలమైన కారణమే వుండి వుంటుందని ఊహించింది శాంతమ్మ.

కాని - ఆ కారణం ఏదో ఊహించలేకపోయింది.

"ఫర్వాలేదు అడుగు బాబూ! నా దగ్గర భయపడవలసిన అవసరం నీకెన్నడూ లేదు. నేను నిన్ను ఒక స్నేహితుడిగానే పెంచి- పెద్ద చేశాను గాని - తల్లిగా నీ మీద ఏనాడూ అధికారాన్ని చెలాయించలేదు. ఇంతకాలం నా దగ్గర ఆ చనువు వుందనుకుంటూనే వచ్చాను. ఇప్పుడు నా అంచనాలని తారుమారు చెయ్యొద్దు బాబూ! నిర్భయంగా నీ మనసులోని మాటను బయటపెట్టవచ్చు...." అంది శాంతమ్మ బాధపడుతూ, కొడుక్కి ఒక విధంగా అభయహస్తం యిస్తూ.

"అమ్మా! నాన్న నిజంగా చనిపోయాడా?" తక్కున అడిగాడు సారధి.

నెత్తిమీద పిడుగుపడినట్లుగా ఉలిక్కిపడి గుబుక్కున తలెత్తి కొడుకు ముఖంలోకి చూసింది శాంతమ్మ.

సారధి తల దించుకున్నాడు.

శాంతమ్మ ఆలోచనలు పరిపరివిధాల పోతున్నాయి.

తను ఊహించని ప్రశ్న! పాతిక సంవత్సరాల తర్వాత పీడకలలాంటి గతాన్ని—ఇంతకాలం తన గుండెల్లో కుంపటిలా దాచుకున్న నిజాన్ని—ఇప్పుడు ఇంత అకస్మాత్తుగా తన కొడుకుతో ప్రస్తావించవలసి వస్తుందని అనుకోలేదు శాంతమ్మ.

కాని — ఈ రోజు తనూహించని ప్రశ్న తన కొడుకు అడుగుతున్నాడు. తప్పదు. నిజం చెప్పాలి.

"బాబూ! ఇప్పుడెందుకా అనుమానం వచ్చింది?" కళ్ళలో నుక్కు తిరగటానికి సిద్ధమవుతున్న కన్నీళ్ళని అతి కష్టం మీద నిగ్రహించుకుంటూ అడిగింది శాంతమ్మ.

"అమ్మా! ఇంతకాలం నీ బాధని నీ గుండెల్లోనే దాచుకుని, నీలో నువ్వే నరకాన్ని అనుభవించావు. కాని ఇప్పుడు నీ కొడుకు పెద్దవాడయ్యాడమ్మా. బరువు బాధ్యతలు స్వీకరించే వయస్సు వచ్చింది. న్యాయాన్యాయాలు ఆలోచించే లోకజ్ఞానాన్ని సంపాదించాను. నా కోసం ఇన్నిబాధలు అనుభవించిన నువ్వు ఈ రోజు నీ కొడుకు పెద్దవాడైన తర్వాత కూడా నువ్వు ఒక్కదానివే ఎందుకు బాధపడతావమ్మా! నీ బాధలు పంచుకోడానికి నేనున్నాను. చెప్పమ్మా: నీ కష్టసుఖాలు నావి కావా?" ఆవేదనగా అన్నాడు సారధి. అలా అంటున్నప్పుడు అతడి కంఠం రుద్ధమైంది.

ఎప్పుడూ కొడుకు అంత ఆవేశపూరితంగా మాట్లాడటం ఎరుగని శాంతమ్మ ఈ రోజు ఆశ్చర్యచకితురాలైంది. మేను ఆనంద పారవశ్యంతో పులకించింది. పూర్తిగా చలించిపోయింది.

"బాబూ! ఇంతకాలం నా గుండెల్లోనే దాచుకున్న ఈ భయంకరమైన నిజాన్ని ఇంత తొందరగా బహిర్గతం చెయ్యవలసి వస్తుందని నేనూహించలేదు...." శాంతమ్మ గొంతు బొంగురు పోయింది. కళ్ళు చెమర్చాయి.

తల్లి కళ్ళనీళ్ళు చూసి చలించిపోయాడు సారధి.

"అమ్మా! నన్ను క్షమించమ్మా! నిన్ను బాధపెట్టాను" అన్నాడు తప్పు చేసినవాడిలా గిల్టీగా ఫీలవుతూ.

"లేదు బాబూ! లేదు....ఇప్పుడు కాకపోయినా ఎప్పుడో ఒక రోజు నేనే నీకీ రహస్యాన్ని చెప్పాలనుకున్నాను. అయితే యింత అకస్మాత్తుగా నేనీ నిజాన్ని నీ ముందుంచవలసి వస్తుందనుకోలేదు. నా అంతిమ ఘడియల్లో నువ్వు అడిగినా అడక్కపోయినా నీ జన్మ రహస్యాన్ని చెప్పి, నేనింత కాలం అనుభవించిన నరకయాతన అంతం చేసుకోవాలనుకున్నాను .... కాని ఇప్పుడే నీలో అనుమాన బీజం తలెత్తింది. అది అసలు తలెత్తకుండానే వుండాలి. ఇక ఒకసారి తలెత్తిన తర్వాత నీ అనుమానాన్ని నివృత్తి చేయడం తల్లిగా నా కర్తవ్యం....చెప్తాను ...చెప్తాను....

"చిన్నతనంలో—నీకు ఊహ తెలిసిన రోజుల్లో నువ్వు రోజూ నన్ను అడిగేవాడివి 'నాన్నేడి? నాన్నేడి?'—అని. అప్పుడు నేను నిజం చెప్పినా నువ్వు అర్థం చేసుకోలేని పసి మనసు నీది. నాన్న బ్రతికే వున్నాడని చెబితే, నీ చిన్న మనసు నాన్నను చూడాలని ఆశ పడుతుంది. నీ కోరిక తీర్చలేని అసహాయ స్థితిలో నీతో అబద్ధం చెప్పక తప్పలేదు. అందుకే నాన్న చచ్చిపోయాడనే అబద్ధాన్ని నీతో చెప్పక తప్పలేదు. బాబూ! నిజానికి మీ నాన్న బ్రతికి వున్నాడనే చేదు నిజాన్ని చెప్పి నీ మనసుని బాధ పెట్టడం కంటే, మీ నాన్న చనిపోయాడనే తియ్యటి అబద్ధాన్ని చెప్పి నీకు పూరట కలిగించాలనుకున్నాను. అలా చెప్పడం తప్పయితే నన్ను మనస్ఫూర్తిగా క్షమించమని తల్లిగా అభ్యర్థిస్తున్నాను....బాబూ! ఇప్పుడు న్యాయాన్యాయాలు ఆలోచించగల వయసుంది నీకు. అందుకే సిగ్గు విడిచి కళంకమైన నా జీవితాన్ని నీ ముందు వుంచుతున్నాను. అర్థం చేసుకుంటావో, అపహాస్యం చేస్తావో అంతా నీ ఆలోచనా విధానానికి వొదిలివేస్తున్నాను. విను బాబూ! నా కథ...."అంటూ తన కథ చెప్పసాగింది శాంతమ్మ.

*

అప్పుడు శాంతి బి. ఎ. చదువుతున్న రోజులు

విద్యార్థి దశ సామాన్యంగా ప్రతివారికీ మరుపురానిది. ఆడుతూ పాడుతూ చదువుకునే రోజులు అవి. అటువంటి రోజుల్లోనే శాంతి జీవితం అతి విచిత్రమైన మలుపు తిరిగింది.

శాంతి అందంగా వుంటుంది. అందుకే ఆమెని 'కాలేజి బ్యూటీ' అని పిలుస్తూ వుండేవారు అందరూ. ఎప్పుడూ నవ్వుతూ ఎదుటి వారిని తన మాటలతో నవ్విస్తూ తుళ్ళుతూ పడుతూ అమాయకంగా తిరిగేది శాంతి.

సహజంగా అందంగా వుండే అమ్మాయిల చుట్టూ ప్రదక్షిణలు చెయ్యడమూ, వలలు విసిరి, ఎవరికివారే తమదాన్ని చేసుకోవాలని ఆరాటపడటమూ విద్యార్థులు చేసే పనే! అయితే అలా విద్యార్థులు వల్లించే ప్రేమ పాఠాలకు దూరంగా, సుదూరంగా వుంటూ వుండేది శాంతి.

కాని — అకస్మాత్తుగా శాంతి జీవితంలోకి ఓ విద్యార్థి అడుగు పెట్టాడు—తలవని తలంపుగా.

అతడి పేరు రాజశేఖరం.

రాజశేఖరం అందంగా వుండేవాడు. ఒక లక్షిధి

కారికి ఒక్కడే కొడుకు. ఉత్తమ ఆదర్శాలు, భావాలూ ప్రదర్శిస్తూ వుండేవాడు.

ఒక రోజు అకస్మాత్తుగా – 'నిన్ను నేను మన స్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను' అని శాంతితో అనే శాడు. శాంతి ఆలోచనలో పడింది. ఆ తర్వాత నువ్వు లేకపోతే బ్రతకలేనన్నాడు. నువ్వే నా సర్వస్వం అన్నాడు. నిన్ను ఆరాధిస్తున్నాను అన్నాడు ...ఇంకా ఇంకా చాలా చాలా అన్నాడు. అన్నీ అని ఆఖరున 'నువ్వు నన్ను ప్రేమించక పోతే ఆత్మహత్య చేసుకుంటాను' అన్నాడు.

అన్నీ అమాయకంగా నమ్మేసింది శాంతి.

తనని ప్రేమించి ఆరాధించే మగవాడు దొరకటం కంటే స్త్రీ తన జీవితంలో ఏం కోరుకుంటుంది? కాని-అందుకు తను అర్హురాలు అవునా? కాదా? అని తర్కించుకొంది. ఆఖరుకు తను అందుకు అర్హురాలు కాదని నిర్ధారించుకుంది.

ఆ విషయమే రాజశేఖరంతో చెప్పింది శాంతి.

"చూడు రాజశేఖరం. నువ్వు కలిగిన ఇంటి బిడ్డవు. నేను కటిక దరిద్రురాలిని. నాకంటూ ఆస్తి పాస్తులు ఏమీలేవు-ఒక ముసలితల్లి తప్ప. అందుకే నాలాంటి పేదింటి పిల్లను నీలాంటి పెద్దింటివాళ్ళు ప్రేమించకూడదు. ఒకవేళ ప్రేమించినా ఆ ప్రేమ ఫలించదు. అందుకు ఈ సమాజం ఊరుకోదు. నా మాట విను. ఆ విషయం యిక మరిచిపో. మనిద్దరం మంచి స్నేహితులుగానే వుండిపోదాం".

శాంతి మాటలు విని రాజశేఖరం బిగ్గరగా నవ్వాడు.

"చూడు శాంతీ! ఈ ప్రపంచంలో. ఇద్దరు ప్రేమికులకు ఈ అంతస్తులూ, ఆస్తులూ అడ్డొస్తా యని అనుకుంటే ఈ క్షణంలో అయినా సరే నా ఆస్తి మొత్తాన్ని త్యజించడానికి వెనుకాడను. నీతో వచ్చేస్తాను. మీరు తినే తిండే నేనూ తింటాను. మీరుండే పూరింటిలోనే నేనూ వుంటాను. మీ కష్టసుఖాలలో నేనూ భాగం పంచుకుంటాను. నన్ను నమ్ము. నీ జీవితంతో నేను చెలగాటం ఆడటం లేదు. ఒక పవిత్ర ప్రేమికుడిగా నీ ప్రేమ భిక్షను అర్థిస్తున్నాను" అన్నాడు ఆవేశపూరితంగా రాజశేఖరం.

రాజశేఖరం మాటలు నమ్మింది శాంతి.

శాంతి మనసు ఆనందంతో పరవళ్లు తొక్కింది. ఆ క్షణంలోనే రాజశేఖరాన్ని తన హృదయ ఫలకం మీద ముద్రించుకుంది. బాజాలూ, మెడలో మంగళసూత్రధారణ చేసినట్లుగా అనుభూతి చెందింది శాంతి.

రోజులు గడుస్తున్నాయి.

ఆ రోజుతో బి. ఎ. ఫైనల్ ఇయర్ పరీక్షలు పూర్తయాయి.

ఎవరి ఇండ్లకు వాళ్ళు వెళ్ళిపోవడానికి సన్నద్ధు లవుతున్నారు.

ఆ రోజు శాంతీ, రాజశేఖరం ఊరికి దూరంగా పొలాలలోకి షికారుకు బయలుదేరారు. ఆ మరుసటి రోజే శాంతీ రాజశేఖరం విడిపోతున్నారు. కాస్సేపు మాట్లాడుకోవాలనీ, వాళ్ళ భవిష్యత్ కార్యక్రమాన్ని గురించి ఆలోచించుకోడానికి అలా బయలుదేరారు.

సంధ్య వాలిపోతోంది.

ఊరికి దూరంగా వెళ్ళి ఒక ఇసుక పర్రమీద కూర్చొని మాట్లాడుకుంటున్నారు, ఇద్దరూ.

ఇంతలో అకస్మాత్తుగా వర్షం ప్రారంభమైంది.

మొదట మొదట్లో తుంపరగా ప్రారంభమైన వర్షం, రాను రాను భోరున కురవసాగింది.

నిశ్చేష్టులైపోయారు శాంతీ, రాజశేఖరం. తరువాత తల దాచుకొనే తరుణోపాయం కోసం ఆలోచించారు. వారికి కొంచెం దూరంలో ఒక రేకులషెడ్డు కనిపించింది. వెంటనే అక్కడికి చేరుకున్నారు.

ఆ రేకులషెడ్డు ఒక పంపుసెట్ తడిసిపోకుండా తాత్కాలికంగా వేసినది. ప్రస్తుతం అదే వారిద్దరికీ షెల్టర్ యిస్తోంది.

గోడలు లేకపోయినందువల్ల ఈదురగాలికి లోపలికి కూడా జల్లువానపడుతోంది.

వర్షంలో తడిచి ముద్దయిన బట్టలతో శాంతీ-రాజశేఖరం. ఇద్దరూ చలికి గజగజా వణికిపోతున్నారు. ఇద్దరూ వయసులో వున్నవారే. చుట్టు ప్రక్కల కన్ను పొడుచుకుచూచినా కనిపించని కారుచీకటి లోకాన్ని ఆక్రమించింది. దూరంగా ఊరి దీపాలు గుడ్డిగా కనబడుతున్నాయి.




1. ప్రపంచంలోకల్లా అతి ప్రాచీనమైన లిపి ఏది?

2. ఐక్యరాజ్యసమితి ప్రథమ సెక్రటరీ – జనరల్ ఎవరో చెప్పగలరా?

3. విలియం కాక్స్టన్ అనే ఆయన దేనిని కనిపెట్టారు?

4. మనం విరివిగా ఉపయోగిస్తున్న నేటి అగ్గిపుల్లల్ని ఎవరు కనిపెట్టారు?

5. జపాన్ అని మన మందరం వ్యవహరిస్తున్న ఆ దేశాన్ని జపాను వారు తమ భాషలో మరో పేరుతో వ్యవహరిస్తారు. ఆ పేరేమిటి?

6. ఇటీవల ఇద్దరు అంతరిక్షయాత్రికులు అంతరిక్షయానంలో నూతన రికార్డు సృష్టించి భూమికి తిరిగి వచ్చారు. వారు ఎవరు? వారు ఎన్ని రోజులపాటు అంతరిక్ష నౌకలో భూప్రదక్షిణాలు చేస్తూ గడిపారు?

7. రవీంద్రనాథటాగూర్‌కి సాహిత్యంలో నోబెల్ బహుమతి వచ్చిందని మీ కందరికీ తెలుసు. అయితే ఏ సంవత్సరంలో ఆయనకా బహుమతి లభించింది? దేనికి లభించింది?

8. ఒక చేప వుంది. ఆ చేప పసిఫిక్ మహా సముద్రం దాకా ప్రయాణం చేసి గానీ గ్రుడ్లు పెట్టదు. ఆ చేప ఏదో చెప్పగలరా?

9. బ్రిటిష్‌వారి రాజరికం భారతదేశంలో ఎప్పుడు ప్రారంభమైంది?

10 మన దేశంలో ఒక వ్యక్తి రెండుసార్లు తాత్కాలిక ప్రధానిగా నియమితులైనారు ఆయన ఎవరు? మొత్తం ఎన్ని రోజులు ఆయన ఆ పదవిలో వున్నారు?

[సమాధానాలు ఈ సంచికలోనే వున్నాయి. వెతికి మీ సమాధానాలతో సరిపోతాయేమో పోల్చి చూసుకోండి].

ఇంతలో ఉన్నట్లుండి దిక్కులు పిక్కటిల్లే లాగున ఒక భయంకరమైన ఉరుము వురిమింది. ఆ వెంటనే తళతళమంటూ మెరుపు మెరిసింది.

ఈ హఠాత్ పరిణామానికి భయకంపితురాలైంది శాంతి. భయంతో గుబుక్కున దగ్గరలో వున్న రాజశేఖరాన్ని కౌగలించుకుంది.

బయట వర్షం....ఈదురగాలి....చలి....చీకటి.. తడిసిన బట్టలతో...దగ్గరగా .... అతి దగ్గరగా.... ఒకరి కౌగలిలో వొకరు .... ఒకరి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు మరొకరికి తగులుతున్నాయి - వేడిగా, మత్తు మత్తుగా....వయసులోని బింకంలో వున్న ఆమె ఎత్తుపల్లాలు మెత్తగా .... మృదువుగా....అతని గుండెలకు తగులుతున్నాయి. ఏదో తెలియని అనుభూతి .... స్వర్గ ద్వారాలు తెరుచుకుంటున్న దివ్యానుభూతి....

భరించలేకపోయాడు రాజశేఖరం.

వేడిగా....ఒళ్ళు...రక్తం...మరిగిపోతున్నట్లుగా వుంది...మనసు మొద్దుబారిపోయింది...పాపమూ... పుణ్యమూ....న్యాయమూ.... అన్యాయమూ...... సంఘము....పాపభీతి....అవేమీ గుర్తు రాలేదు రాజశేఖరానికి. అటువంటి ఉన్మాదస్థితిలో అటువంటివేమీ అసలు గుర్తురావేమో!

అందుకే తన కౌగిట్లో వున్న శాంతిని యింకా... యింకా దగ్గరికి తీసుకొని....గుండెలకు యింకా బలంగా హత్తుకొని, ఆమె ముఖాన్ని తన ముఖానికి చేర్చుకొని ఆమె పెదవులు తన పెదవులతో....

ఏమి జరుగుతుందో....ఏమి జరగ్గూడదో.... తెలుసుకునేసరికే జరగవలసిన ఘోరమేదో జరిగిపోయింది.

గొల్లుమంది శాంతి.

వొంట్లోని వేడి చల్లారిన తర్వాత ఆలోచించాడు రాజశేఖరం. ఛీ! ఛీ! తనెంత మూర్ఖంగా ప్రవర్తించాడు. ఇప్పుడు శాంతి తనని గురించి ఎంత నీచంగా ఆలోచిస్తుందోగదా. పెళ్ళి కాక ముందే ఆమె శీలాన్ని అపహరించిన తను నిజంగా క్షమార్హుడుకాడు. హే భగవాన్. ఎంత ఘోరం జరిగిపోయింది. అనాలోచితంగా తప్పు జరిగిపోయింది. తెలిసి చేసినా తెలియక చేసినా తప్పు తప్పే....ఇప్పుడేమిటి కర్తవ్యం? శాంతిని ఎలా ఓదార్చగలడు? ఏమని ఓదార్చగ్గలడు?

అంతలోనే ఏదో తృప్తి. తనేం అన్యాయం చెయ్యడం లేదు శాంతికి. పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాడు. కాకపోతే పెళ్ళయిన తర్వాత మొదటి రాత్రి అనుభవించాల్సిన సుఖాన్ని ఇప్పుడే దోచుకున్నాడు తను. అంతే! అంతే!

"శాంతీ! తప్పు చేశాను. క్షమించమని అడిగే అర్హతను కోల్పోయాను. కాని - నేను చెప్ప దలచుకున్నది ఒక్కటే. పెళ్ళయిన తర్వాత ప్రతి యువతీ యువకుడూ కలలుకనే మొదటి రాత్రిని దూరం చేసుకున్నాము. అంతకంటే మరేమీ జరగలేదు. ఇప్పుడే పంచభూతాలు సాక్షిగా నిన్ను నా అర్ధాంగిని చేసుకుంటున్నాను. ఇంటికి వెళ్ళగానే ఇంట్లోవాళ్ళకి నచ్చజెప్పి-సంఘం కోసం పదిమంది ఎదుట, పెద్ద పందిరి క్రింద, బాజా భజంత్రీలతో వివాహం చేసుకుందాం. సరేనా. నా మాట నమ్ము" అంటూ తన చేతికి వున్న వజ్రపు టుంగరాన్ని తీసి శాంతి వేలికి తొడిగాడు రాజశేఖరం.

శాంతి మాట్లాడలేదు.

జరిగినదానిని నెమరు వేసుకుంటూ, జరగబోయే దాన్ని ఊహించుకుంటూ, ముందేదో వెలుగు కనిపిస్తుందని వెర్రిగా నమ్మవలసిందే కాని, విధికి ఎదురీద లేదు గదా! పొరపాటువల్లో, లేక తన గ్రహపాటువల్లో, స్త్రీ జీవితంలో ఏది జరగ్గూడదో అది జరిగిపోయింది. తనేమీ చెయ్యలేని అశక్తురాలు. ఇక అటువంటప్పుడు రాజశేఖరం మాటలు నమ్మక ఏం చేస్తుంది? నమ్మకపోయి ఏం చెయ్యగలదు గనుక?!

ఆ మరుసటిరోజే శాంతి దగ్గర వీడ్కోలు పుచ్చుకొని, ఎంతో బాధపడుతూ, వెళ్ళలేక వెళ్ళిపోయాడు రాజశేఖరం.

రాజశేఖరం వెళ్ళిన దగ్గరినుంచీ, అతడి దగ్గర నుంచి సుముఖంగా ఉత్తరం వస్తుందని ఆశతో ఎదురుచూస్తూనే వుంది శాంతి.

కాని రాజశేఖరం నుండి ఎటువంటి ఉత్తరమూ రాలేదు. తనే రెండు ఉత్తరాలు రాసింది కూడా. కాని వాటికి కూడా అతని దగ్గరనుండి జవాబు లేదు.

ఏవో పనుల ఒత్తిడివల్ల గానీ, తల్లిదండ్రులను ఒప్పించడంలో జాప్యం జరగటం వల్ల గానీ, మరేదో కారణం వల్లగానీ అతడు తన ఉత్తరాలకు సకాలంలో జవాబు రాయలేకపోయాడేమోనని కొంతకాలం తనకి తానే సమాధానం చెప్పుకుంది.

కాని ఎంతకాలమని తనకి తాను సమాధానం చెప్పుకోగలదు?

రెండునెలలు రెండు యుగాల్లా గడిచిపోయాయి.

రాజశేఖరం దగ్గరి నుండి ఉత్తరాలు రాక, విషయం బోధపడక ఒక ప్రక్కన సతమతమవుతున్న తరుణంలో, మరో భయంకరమైన నిజం బయటపడింది.

తను నెల తప్పింది!!

ఎంత భయంకరమైన నిజం అది!

ఈ నిజాన్ని తన తల్లితో చెప్పుకోగలదా? ఇంకెవరితోనైనా చెప్పుకోగలదా? చెప్పుకున్నా ఎవరు అర్థం చేసుకుంటారు? కళ్ళు కానని కామంలో కాలు జారిందని తనని అసహ్యించుకుంటారేగాని, సానుభూతి ఎవరు మాత్రం ఎందుకు చూపిస్తారు?

భవిష్యత్తు అగమ్యగోచరంలా తోచింది శాంతికి.

ఈ నిజాన్ని చెప్పుకోడానికి రాజశేఖరం ఒక్కడే అర్హుడు. అతడే తనని అర్థం చేసుకోగలడు. అతడితోనే చెప్పుకోవాలి. అంతే! అంతే!

అందుకే - తన తల్లికి ఏదో కుంటిసాకు చెప్పి, రాజశేఖరం దగ్గరికి బయలుదేరింది.

రైలు దిగిం తర్వాత రాజశేఖరం వాళ్ళ ఇల్లు తెలుసుకోవడం ఏమంత కష్టమనిపించలేదు శాంతికి.

రాజశేఖరం వాళ్ళ నాన్నగారికి ఆ ఊళ్ళోనే గాక, ఆ చుట్టుప్రక్కల కూడా చాల పలుకుబడి వుంది. ఆస్తిపాస్తులున్నాయి. అంతస్తు వుంది.

పెద్ద బంగళా....బంగళా చుట్టూ విశాలమైన ప్రహరీ...ప్రహరీ లోపల చక్కని పూలమొక్కలూ ఆ మొక్కలకి అందమైన రకరకాల పూలూ.... ఇంటి ముందు పోర్టికోలో అందమైన కారు.... ఇంట్లో అటూ యిటూ తిరిగే ఆరోగ్యమైన అల్సేషియన్ కుక్కా....

ఇంటి ముందు నిలబడి దిక్కులు చూస్తున్న శాంతిని గేటుదగ్గర నిలబడి వున్న వాచ్‌మన్ అడిగాడు—

"ఎవరు కావాలమ్మా, తమకి?"

ఒక్కక్షణం అతడి ముఖంలోకి చూసి శాంతి అంది—

"రాజశేఖరంగారు."

"చినబాబుగారా? వున్నారమ్మా. లోపలికి వెళ్ళండి" అన్నాడు గేటు తీస్తూ వాచ్‌మన్.

లోపలికి వెళ్ళటానికి సంశయించింది శాంతి.

"వెళ్ళండమ్మా" మరోసారి అన్నాడు వాచ్‌మన్, తను వెళ్ళమని గేటు తెరచినా ఆమె ఎందుకు వెళ్ళలేదో అర్థంకాక.

"లోపల కుక్క...." బిక్కు బిక్కుమంటూ సమాధానం యిచ్చింది శాంతి.

అప్పుడుగాని అర్థంకాలేదు వాచ్‌మన్‌కి. అయినా ఆ సంగతి తన మట్టిబుర్రకు తట్టనేలేదు. అదేం మామూలు వీధి కుక్కా? ఏమన్నానా? పెద్ద అయ్యగారు రెండువేల రూపాయలుపెట్టి బెంగళూరు నుంచి కొనుక్కొచ్చిన మేలుజాతి అల్సేషియన్ కుక్కాయె! పొరపాటున లోపలికి ప్రవేశించిన ఏ అపరిచిత వ్యక్తినీ అది మామూలుగా వొదిలి పెట్టదు. రక్తం కళ్ళజూచిగాని మరీ వొదిలిపెట్టదు ఆ కుక్క. అటువంటిది పాపం ఈ అమ్మాయి అనాలోచితంగా లోపలికి వెళ్ళినట్లయితే ఎంత ప్రమాదం జరిగి వుండేదో గదా....తనలో తనే సిగ్గుపడ్డాడు వాచ్‌మన్.

‘‘ఓ అదా....వుండు నేను లోపలికి వచ్చి దిగ విడుస్తాను.’’ అని గేటు మూసి, లోపలికి దారితీశాడు వాచ్‌మన్.

శాంతి అనుసరించింది అతన్ని.

కాని-శాంతి ఊహ తారుమారు కాలేదు. అటూ ఇటూ తిరుగుతోన్న అల్సేషియన్, తనని చూడగానే భయంకరంగా అరుచుకుంటూ తన వైపు రాసాగింది.

‘‘క్యాండీ....క్యాండీ స్టాప్....స్టాప్’’ అంటూ శాంతికి ముందు నడుస్తున్న వాచ్‌మన్ ఆ కుక్కని పట్టుకొని తల నిమురుతూ, శాంతితో ‘‘మీరు లోపలికి వెళ్ళి, అదిగో ఆ కుడిచేతివైపున వున్న విజిటర్స్ రూంలో కూర్చోండి. నేవెళ్ళి అయ్యగారితో చెప్పి వస్తాను’’ అని, కుక్కతో, ‘‘క్యాండీ, గో....’’ అంటూ మెట్లవైపు దారితీస్తున్న వాడల్లా తక్కున ఆగి, మళ్ళీ శాంతి దగ్గరికి వచ్చి ‘‘ఇంతకీ ఎవరు వచ్చారని చెప్పమంటారమ్మా చినబాబు గారితో’’ అన్నాడు.

‘‘శాంతి వచ్చిందని చెప్పండి.’’

వాచ్‌మన్ మేడమీదికి వెళ్లిపోయాడు.

విజిటర్స్ రూంలో శాంతి ఒక్కతే బిక్కు బిక్కుమంటూ కూర్చొనుంది. రాజశేఖరం ఎప్పుడు వస్తాడా? అని క్షణాలు లెక్కపెడుతోంది.

ఓ పదినిముషాలు భారంగా గడిచాయి.

వస్తాడనుకున్న తన ప్రియుడు రాజశేఖరం రాలేదు.

కాని-పిలుసుకొస్తానని వెళ్ళిన వాచ్‌మన్ తిరిగొచ్చాడు.

ఆశగా అతడి ముఖంలోకి చూచింది శాంతి.

‘‘పెద్ద అయ్యగారు మిమ్మల్ని తీసుకు రమ్మంటున్నారమ్మా’’ అని చెప్పాడు వాచ్‌మన్.

గుండెల్లో రాయిపడింది శాంతికి.

పెద్దయ్యగారా? అంటే....రాజశేఖరం తండ్రి గారా? ఆయనగారు తనని ఎందుకు రమ్మంటున్నట్లు? ఏం మాట్లాడుతారు? అయినా-ఇంతకీ రాజశేఖరం ఏమయినట్లు? ఎన్నో ఆలోచనలు శాంతిని ఉక్కిరి బిక్కిరి చేస్తుంటే అనాలోచితంగా లేచి నిలబడింది.

‘‘ఇంతకీ...రాజశేఖరం లేరా?’’ అడిగింది శాంతి.

‘‘ఉన్నారమ్మా....లోపల ఆయన గదిలో వున్నారు. చినబాబుగారితో మీరు వచ్చిన విషయం చెప్పాలనే ఆయన గదివైపు వెళుతుంటే పెద్ద అయ్యగారు పిలిచి విషయం అడిగారు. మీరు వచ్చినట్లు చెప్పాను. ‘చినబాబుతో చెప్పాల్సిన పని లేదు. ఆ అమ్మాయిని నా దగ్గరకే తీసుకు రా’-అన్నారండి. అందుకే మిమ్మల్ని పెద్దయ్యగారి దగ్గరికి తీసుకెళుతున్నాను’’ అన్నాడు వాచ్‌మన్ అమాయకంగా ముఖం పెట్టి.

ఈసారి శాంతి గుండెల్లో రైళ్ళు పరుగెత్తాయి.

అంటే....అంటే రాజశేఖరానికి వాళ్ళ నాన్న గారికి ఏదో గొడవలు జరిగాయన్నమాట. అయితే... తన గతేం కావాలి?....

‘‘రండమ్మా! అయ్యగారి గది చూపిస్తాను’’ మరోసారి హెచ్చరించాడు వాచ్‌మన్, మెట్లమీదికి దారి తీస్తూ.

ఆలోచనలనుండి తేరుకొని అతన్ని అనుసరించింది శాంతి. ఇంక ఆ పరిస్థితుల్లో అంతకంటే గత్యంతరం లేదు తనకి. ప్రస్తుతం పులిబోనులో అడుగు పెట్టిన చందంలా వుంది తన పరిస్థితి. ఇంతదూరం వచ్చి కూడా తన బ్రతుకోమార్గం కల్పించుకోలేకపోతే ఎలా?

‘‘ఇదేనమ్మా! పెద్దయ్యగారి గది. లోపలికి వెళ్ళు.’’ అంటూ ఒక గదిముందు ఆగి చూపించాడు వాచ్‌మన్.

వాచ్‌మన్‌కి థాంక్స్ చెప్పుకొని, భయం భయంగానే ఆ గదిలో అడుగుపెట్టింది శాంతి.

అది విశాలమైన గది....క్రింద కాశ్మీర్ కార్పెట్ పరచి వుంది. గది నిండుగా ఖరీదైన ఫర్నిచర్ వుంది. గుమ్మాలకీ, గది కిటికీలకి సిల్కు స్క్రీన్స్ వ్రేలాడుతున్నాయి.

లోపల ఎవరూలేరు.

ఆలోచిస్తూ అలాగే నిలబడిపోయింది శాంతి రెండు నిముషాలు.

‘‘కూర్చోండి’’

ఎవరో తననే ఉద్దేశించి అన్నట్లై తలత్రిప్పి చూచింది శాంతి.

ఓ అపరిచిత వ్యక్తి అప్పుడే డోర్ కర్టెన్ తొలగించుకొని ప్రక్కగదిలోంచి వస్తున్నాడు.

శాంతి కూర్చోలేదు.

ఆ అపరిచిత వ్యక్తిని చూస్తూ వుండిపోయింది.

ఆరడుగుల ఆజానుబాహుడు....ఎత్తుకు తగ్గ లావు...మిగల పండిన జామపండు లాంటి శరీర చ్ఛాయ....బట్టతల....గోల్డుఫ్రేమ్ కళ్ళద్దాలు.... తెల్లని మీసాలు....సిల్కులాల్చీ....గ్లాస్కోపంచె.

‘‘కూర్చోండి’’ మరోసారి గుర్తు చేశాడు ఆ వ్యక్తి.

తడబడి, అచేతనంగా సోఫాలో కూలబడింది శాంతి.

రెండు నిముషాలు నిశ్శబ్దం తర్వాత.

‘‘మీ పేరు శాంతి కదూ....’’ ఆ వ్యక్తి ప్రశ్నించాడు.

## పూజా పుష్పము

దేవుని పాదముల వెలిగేటి పువ్వు
శంకరుని శిరమున మెరిసేటి పువ్వు
శ్రీ హరి ఉరమున హారమే పువ్వు
పొద్దుటే మా తల్లి పూజకో పువ్వు

మొగ్గగా మోజులతొ మురిపించు పువ్వు
వన్నె వన్నెల సొగసు వికసించు పువ్వు
పూల బాలల జడల విరిసేటి పువ్వు
పొద్దుటే మా తల్లి పూజకో పువ్వు

చిగురాకు మరుగున సొగసారు పువ్వు
ముత్తైదు సిగలోన చెలువారు పువ్వు
మహాలక్ష్మి హస్తమున రాజిల్లు పువ్వు
పొద్దుటే మా తల్లి పూజకో పువ్వు

దివ్య పరిమళము వెదజల్లు పువ్వు
మకరంద మాధుర్య మొలికించు పువ్వు
మంగళ కరమై శోభిల్లు పువ్వు
పొద్దుటే మా తల్లి పూజకో పువ్వు

—తిమ్మరాజు హైమావతి

ఔనన్నట్లు తలూపింది తలొంచుకునే.

"నా పేరు ప్రసాదరావు. రాజశేఖరం తండ్రిని" తనని తాను పరిచయం చేసుకున్నాడు.

నమస్కారం చేసింది శాంతి, లేచి నిలబడింది.

"కూర్చోండి....కూర్చోండి"

శాంతి మళ్ళీ కూర్చుంది. కాని ప్రసాదరావు గారు కూర్చోలేదు. గదిలో అటూ యిటూ పచార్లు చేస్తున్నారు.

"చూడమ్మా శాంతీ! నీ గురించి రాజశేఖరం అన్ని విషయాలూ నాతో చెప్పాడు" ప్రసాదరావు గారు నెమ్మదిగా అన్నారు, తను చెప్పబోయే విషయానికి నాందిలా.

తను కదిలించాలనుకున్న విషయాన్ని ప్రసాద రావుగారే కదిలించగానే, ఒక విధంగా పెద్ద బరువు నెత్తిమీది నుండి దిగిపోయినట్లు ఫీలయ్యింది శాంతి. కాని ఎన్నో ఆలోచనలు తనని చుట్టు ముట్టాయి. రాజశేఖరం ఈయనతో ఏమని చెప్పాడు? తమ పెళ్ళి విషయం చెప్పివుంటాడా? తమ పెళ్ళి చెయ్యడానికి అసలు ఈయన సుముఖంగా వున్నారా?

"చూడమ్మా శాంతీ! ఒకసారి ఆ కుడిచేతి వైపు గోడమీదికి చూడు" ప్రసాదరావుగారి మాటలకు ఆలోచనల నుండి తేరుకొని, తలెత్తి గోడమీదికి దృష్టిని మరల్చింది.

అక్కడ గోడ మీద తగిలించి వున్న రెండు లైఫ్ సైజు ఫొటోలు....

రెండు ఫొటోలు యించుమించుగా ఒకలాగే వున్నాయి. రెండూ ప్రక్క ప్రక్కగా తగిలించి వున్నాయి. జమిందారుల్లాంటి వేషాల్లో అజాను బాహువుల్లాంటి ఇద్దరూ రెండు ఫొటోల్లోనూ వున్నారు. తలపాగా, గుబురుగా పెరిగి మెలితిరిగిన మీసాలూ మెడలో పులిగోరూ, పొన్ను కర్ర చేతిలో, నెక్ కోటూ, కాళ్ళకి అంటిపెట్టుకొన్నట్లు వున్న సురవా, కాళ్ళకి వొంకితిరిగిన చెప్పులూ.

"ఆ మొదటి ఫొటోలో వున్నాయన మా తాత గారు, ఒకప్పుడు ఈ పరగణాకి తిరుగులేని జమిందారు. ఆ ప్రక్క ఫొటోలో వున్నాయన మా తండ్రిగారు, ఆయనా జమిందారే. వారిద్దరూ ఎలా బ్రతికారో నేను వేరే చెప్పనవసరం లేదు. వాళ్ళ వేషాలు చూస్తే నువ్వే గ్రహించి వుంటావు. ఇక పోతే వారిద్దరి తర్వాత వారి వారసుడ్ని నేను. వాళ్ళు వొదిలిపోయిన వంశ గౌరవాన్నీ, ప్రతిష్ఠనూ కాపాడవలసిన బాధ్యత నా మీద వుంది. ఇప్పుడు నాకు జమీ లేకపోయినా పదితరాలు కాలుమీద కాలేసుకొని తిన్నా తరగని ఆస్తిపాస్తులున్నాయి. ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందో నువ్వీపాటికి గ్రహించే వుంటావు. నాకు ఏకైక వారసుడు రాజశేఖరం. వాడు నా పరువు ప్రతిష్ఠలను వంశ గౌరవాన్నీ కాపాడతాడని కలలు గన్నాను. కాని నా ఆశలు తారుమారయ్యాయి...." అర్థోక్తిగా మధ్యలోనే తను చెప్పడం ఆపారు ప్రసాదరావుగారు.

"అంటే .... అంటే .... మీ ఉద్దేశం ...." హతాశురాలై అడిగింది శాంతి.

"ఇంకా అర్థం కాలేదా శాంతీ! మాది వంశ ప్రతిష్ఠలకు ప్రాణం పెట్టే వంశం. ఈ ఇంటికి కోడలుగా రావడానికి కొన్ని అర్హతలుండాలి. ఆస్తి అంతస్తు పరువు ప్రతిష్ఠలు గల వంశమై వుండాలి."

"అంటే, మీ ఉద్దేశం ప్రకారం మీ ఇంటి కోడలు మానాభిమానాలు లేనిదైనా పర్వాలేదన్న మాట. ఒక కన్నె పిల్ల జీవితంతో ఆటలాడి ఆమె మానాన్ని అపహరించి ఆ తర్వాత మట్టి బొమ్మలా పగులగొట్టడం మీ వంశానికి పరువూ ప్రతిష్ఠలను ఎక్కువగా తెచ్చిపెడుతుందన్న మాట."ఆవేశంగా అనేసింది శాంతి.

ప్రసాదరావుగారు ఆమె మాటలకు గతుక్కు మన్నారు. కాని వెంటనే తమాయించుకున్నారు కూడా.

"చూడమ్మా శాంతీ! నిదానించి నేను చెప్పేది పూర్తిగా విను. ఆవేశం తెచ్చుకున్నా ప్రయోజనం లేదని ఈసరికే గ్రహించి వుంటావు. మా రాజశేఖరం నిన్ను పెళ్ళి చేసుకుంటానని మాట యిచ్చి వుంటాడు. నేను కాదనను, కాని - తెలిసీ తెలియని వయస్సులో పిల్లలు తప్పటడుగులు వెయ్యడం సహజం. అయితే పిల్లలు వేసిన ప్రతి తప్ప టడుగూ సరిఅయినదే అని పిల్లల్ని సమర్థించడం పెద్దల అవివేకం. రాజశేఖరం నీకు మాట ఇచ్చినా వాడి సంరక్షకుడిగా ఈ వంశ గౌరవాన్ని నిలబెట్ట వలసిన బాధ్యతాయుతమైన మనిషిగా వాడి యోగ క్షేమాలు ఆలోచించాల్సిన తండ్రిని నేనింకా బ్రతికే వున్నాను. నేను బ్రతికి వుండగా ఈ ఇంట్లో ఏది జరిగినా నా ఇష్టప్రకారమే జరిగి తీరాలి. అలా జరక్కపోతే, నా మాటను ఎదిరించిన ప్రతివాడినీ పిట్టని కాల్చేసినట్లు తుపాకీతో కాల్చేస్తాను"అన్నారు ప్రసాదరావుగారు.

శాంతికి ప్రసాదరావుగారి ఆలోచనా విధానం బోధపడింది. మెత్తగా ఎదుటివారికి కష్టం కలిగించ కుండా మాట్లాడి తన కార్యాన్ని సాధించుకోగల సమర్థుడు ఆయన. లేకపోతే ప్రాణాలు తీసి అయినా సరే తన పంతాన్ని నెగ్గించుకోగల కఠినాత్ముడు అని అర్థం చేసుకోగలిగింది శాంతి.

"చూడండి ప్రసాదరావుగారూ! ఒకవేళ మీ అబ్బాయి మీ మాట వినకపోతే" శాంతి అడిగింది శాంతంగా.

పెద్దగా హాలు ప్రతిధ్వనించేలా నవ్వారు ప్రసాద రావుగారు.

"వినకపోవడమా! అది కలలో మాట .... నా పేరు చెప్పితే ఈ ఇంట్లో చీమ కూడా ఆహారం ముట్టదు తెలిసిందా?" అతి గర్వంగా అన్నా రాయన.

"పోనీ మాటవరసకే అనుకుందాం. మీ అబ్బాయి మీ మాట వినకపోతే" రెట్టించి అడి గింది శాంతి.

"ముందే చెప్పాను. పిట్టని కాల్చేసినట్లు కాల్చే స్తానని. ఒకవేళ నా కంటబడకుండా ఏ మారు మూలలకో పారిపోయినా, నా ఆస్తిలో చిల్లికానీ కూడా వాడికి చెందదు. ఏ అనాథశరణాలయానికో నా ఆస్తినంతా రాసేస్తాను."

"అంత ఉదార స్వభావం వున్నవాళ్ళే అయితే మీరు ఒక పేదింటి పిల్లని చేసుకోడానికి అభ్యం తరం చెప్పరు ..." అంది హేళనగా శాంతి.

"చూడమ్మా శాంతీ! గతాన్ని గురించి ఇప్పుడు ఆలోచనలు అనవసరం. ఇప్పుడు మా రాజశేఖ రానికి పెళ్ళి నిశ్చయమైంది. మరో పది రోజుల్లో పెళ్ళి కూడా జరుగుతుంది. పిల్ల తండ్రికి పది కంపెనీల్లో షేర్లున్నాయి. ఒక్కతే కూతురు. తరగని ఆస్తి వుంది" అన్నారు ప్రసాదరావుగారు గర్వంగా.

మరో పిడుగు నెత్తిమీద పడినట్లు తుళ్ళిపడింది శాంతి.

అయిపోయింది. అంతా అయిపోయింది. ఇంత దూరం ఎంతో ఆశతో వచ్చిన తనకు తిరుగులేని ఎదురు దెబ్బ తగిలింది. ఇప్పుడు తనేం చెయ్యాలి? తనకేది దారి? తన కడుపులో రూపం దిద్దుకుం టున్న మరో ప్రాణిని ఏం చెయ్యాలి? హే భగ వాన్! ఎంత క్రూరంగా నా విధి రాత రాశావయ్యా!

మరో అయిదు నిముషాలవరకూ శాంతి మాట్లాడ లేకపోయింది.

"ఈ పెళ్ళికి రాజశేఖరం అంగీకరించాడా?" అడిగింది శాంతి. తనకి అన్యాయం ఎవరు చేశారో తెలుసుకోవాలనే ఉద్దేశంతో.

"నీ కెందుకొచ్చిందా అనుమానం శాంతీ!"

"రాజశేఖరం ఇంత మోసగాడని ఇంకా ఎందుకో నా అంతరాత్మ నమ్మడం లేదు."

"మోసం అని అనుకోడానికి ఇందులో ఆస్కారమేలేదు. వాడు పసివాడు. వాడికో నిశ్చితమైన అభిప్రాయాలు వుంటాయని నువ్వు అనుకోడం అది నీ పొరపాటు. ఆల్‌రైట్ .... జరిగిందేదో జరిగిపోయింది. ఇక రాజశేఖరాన్ని గురించి మరిచిపో...." చాలా కచ్చితంగా చెప్పారు ప్రసాదరావుగారు.

ఇప్పుడు శాంతి మనసు చాలా ప్రశాంతంగా వుంది.

రాజశేఖరం పిరికివాడనీ, వ్యక్తిత్వం లేని మనిషనీ, ఇచ్చిన మాట నిలబెట్టుకోలేని అసమర్థుడనీ తనకు మొటట్లో తెలీదు. ఇప్పుడే తెలుసుకోగలిగింది. ఇప్పుడిక తనకి రాజశేఖరాన్ని గురించిన దిగులు లేదు. అటువంటి వాడిని చేసుకున్నా తను జీవితంలో అతనితో రాజీపడలేదు.

"చూడండి ప్రసాదరావుగారూ! ఎన్నో ఆశలతో ఇంతదూరం వచ్చాను. రాజశేఖరాన్ని కలుసుకోవాలనీ, అతడు చేసిన వాగ్దానాలు ఇంకా జ్ఞాపకముంచుకుంటాడనీ ఆశపడ్డాను. కాని ఇక్కడికి వచ్చిన తర్వాత అసలు నిజం తెలుసుకున్నాను.... ఇప్పుడు నాకేం కోరికలూ లేవు. ఏ ఆశలూ లేవు. కాని ఒక మాట మాత్రం రాజశేఖరానికి చెప్పండి" అంది శాంతి.

"చెప్పమ్మా"

"మీ అబ్బాయి ప్రతిరూపం నా కడుపులో ప్రాణం పోసుకుంటోంది."

"ఏమిటీ! నువ్విప్పుడు గర్భవతివా?" ఉందేలు దెబ్బతిన్నవాడిలా అదిరిపడ్డారు ప్రసాదరావుగారు.

"అవునండీ! కాని....అంతమాత్రంచేత పిరికిదానిలా ప్రాణాలు మాత్రం తీసుకోను" శాంతి కంఠంలో దృఢసంకల్పం ధ్వనించింది.

"వెరీ గుడ్....అలా వుండాలి....చూడమ్మా శాంతీ! తప్పు ప్రతి మనిషీ చేస్తాడు. అయితే తప్పు చేసిన ప్రతి మనిషీ ప్రాణాలు తీసుకోవడం అనేది అవివేకం. మనసుని దృఢపరచుకొని, గతాన్ని మరచిపోయి, మరో మార్గం చూసుకొని జీవితంలో సుఖపడు"

శాంతి మాట్లాడలేదు.

లేచి నిలబడింది.

"కూర్చోమ్మా! ఇప్పుడే వస్తాను" అని లోపలికి వెళ్ళారు ప్రసాదరావుగారు. రెండు నిముషాల తర్వాత చేతిలో నోట్ల కట్టలు పట్టుకొని తిరిగి వచ్చారు.

"చూడమ్మా! శాంతీ! ఇదిగో ఈ డబ్బు తీసుకో"

ఒక్కక్షణం కొయ్యబారిపోయింది శాంతి.

"ప్రసాదరావుగారూ! ఇప్పటివరకూ మీరు ఎలా మాట్లాడినా పెద్దవారనే గౌరవభావం వుంది. కాని ఒక ఆడదాని శీలాన్ని డబ్బుతో విలువకట్టిన మీ నీచ భావానికి మిమ్మల్ని యిప్పుడు అసహ్యించుకుంటున్నాను" ప్రసాదరావుగారిని ఒక పురుగుని చూచినట్లు చూస్తూ అంది శాంతి.

తడబడ్డారు ఆయన.

"అందుకు కాదమ్మా! నువ్వు పేదింటి పిల్లవి. ఈ పరిస్థితుల్లో నీ కడుపులో పెరుగుతున్న పిండాన్ని రూపుమాపు చేసుకోడానికి ఏదైనా డాక్టర్ని సంప్రదించక తప్పదు గదా. అందుకోసమైనా ఈ డబ్బు అవుసరం నీకుంటుంది. ఉంచుకో."

## కొత్త వస్తువులు



ఒవెన్–టోస్టర్–గ్రిల్

ట్రేడింగ్ ఇంజనీర్స్ (ఢిల్లీ) వారు ఎలక్ట్రిక్ ఒవెన్–టోస్టర్-గ్రిల్ అన్న పరికరాన్ని ఉత్పత్తి చేశారు. "లైఫ్ లాంగ్ ఒవెన్–టోస్టర్-గ్రిల్ (ఒటిజి 1000)" అని దానికి పేరు పెట్టారు. ఇలాంటి పరికరం భారత దేశంలో ఉత్పత్తికావడం ఇదే ప్రథమం అనీ, ఈ వంట పరికరం మూడు విధాలుగా పనిచేస్తుందనీ, వారు చెబుతున్నారు. పెనం మీద కాల్చినట్టు కాల్చడానికి (రోస్ట్) నిప్పు మీద కాల్చడానికి (టోస్ట్) వేపడానికి (గ్రిల్) ఇది ఉపయోగపడుతుంది. దీనికి బయట గట్టి అద్దంతలుపు వుండడంతో, లోపల పదార్థాలు ఏ దశలో వున్నాయో సులభంగా తెలుసుకోవచ్చు. ఎలాంటి వంటకమైనా దీని ద్వారా సుఖవుగానూ తొందరగానూ అయిపోతుందని కూడా ఉత్పత్తిదారులు చెబుతున్నారు. దీని సైజు: 16"×11"×11"; పవర్: 1200 వాట్స్; బరువు: 8 కిలోలు; ఉష్ణోగ్రత: 100° సి నుండి 350° సి; కెపాసిటీ: 15.5 లిటర్లు. దీని ధర మద్రాసులో రూ. 1180. (పన్నులు కాక) ఇంకా దీన్ని గురించిన వివరాలు తెలుసుకోవాలనుకుంటే – ట్రేడింగ్ ఇంజనీర్స్, 3/4A అసఫ్ ఆలీ రోడ్, న్యూ ఢిల్లీ–110002 చిరునామాకు రాయవచ్చును.

కొంగ్రొత్త!

# కాళీ కాపర్ బాటమ్ "కుక్-ఫాస్ట్" స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలు

వేగంగా వంట
60% వరకూ
ఇంధనపు ఖర్చు ఆదా

అసలు కిటుకు రాగి అడుగులో వుంది

☐ ఆశ్చర్యకరమైన వేగంతో పరిపక్వమైన వంట, వివరిదాకా చిన్నమంట మీదే. ఇంధనపు ఖర్చులు బాగా కలిసివస్తాయి.

☐ శుభ్రం చేయడం సులభము! ప్రత్యేక జాగ్రత్తలేవీ అవసరం లేదు. అయినా ఏళ్లకొద్దీ తళతళలాడుతూంటాయి.

☐ రకరకాల వంటలకు వంటకాలకు ఆదర్శ కరంగా పూర్తి శ్రేణి. మీకు కావలసిన సైజులలో పాత్రలు.

ఇప్పుడే "సెలక్ట్" సరకులు!
మంచి విశిష్టకరమైన వంటల తయారీకి కావలసిన ప్రత్యేకంగా ఏర్చి కూర్చిన సరకు. మీకు ఇష్టమైనవి తీసుకోండి. ఎరుపు, నీలం, ఆకుపచ్చ పెట్టెలలో.
గమనించండి : అన్ని అవకాశాలకు ఆదర్శకరమైన పారితోషికాలు.




30 సంవత్సరాలకు పైనుండీ అసమానమైన స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలు తయారు చేస్తున్నారు

సాధారణ స్టెయిన్‌లెస్ స్టీల్ (ఎవర్‌సిల్వర్)

కాళీ కాపర్ బాటమ్

స్టెయిన్‌లెస్ స్టీల్ (ఎవర్ సిల్వర్) యొక్క విశిష్టత మన్నికతలతోబాటు రాగి యొక్క అతి శక్తివంతమగు ఒకే సమమగు ఉష్ణ వాహకతనిస్తుంది.

**Made to International Standards**



ప్రసిద్ధమైన వంట పాత్రల డీలర్స్ అందరివద్ద లభిస్తాయి

అమ్మకపు ఏజెంట్లు : శ్రీవిద్యా ఏజెన్సీస్ కుంభేశ్వరర్ సన్నిధి, కుంభకోణము-612 001 (తమిళనాడు)

డీలర్ షిప్‌లకు సంప్రదించండి : మెస్సర్స్ సాము & కో పో.బా. నం. 1049 యమ్. జి. రోడ్డు, ఎర్నాకులము కొచ్చిన్-682 011 ఫోను : 31139

G. KB. 6 Tel.

"ఎంత బాగా మాట్లాడ గలరండీ! నేను పేద దాన్ని అయినా నాకు మానాభిమానాలు వున్నాయి. మీ అబ్బాయివల్ల గర్భవతినయ్యాను గనక, దానికి ప్రతిఫలంగా మీనుండి డబ్బు రాబట్టుకోవాలనే ఉద్దేశంతోనే నిక్కడికి రాలేదు. మీ డబ్బు మీ దగ్గరే వుంచుకొండి ...ఇకపోతే మీరన్నట్లు డాక్టర్ని సంప్రదించాల్సి వస్తే డబ్బు అవసరం అవుతుంది. కాని– నేను డాక్టర్ని సంప్రదించకపోతే...."

ఆశ్చర్యపోయారు ఆయన.

ఈసారి పిడుగు ఆయన నెత్తి మీద పడ్డట్టు ఖంగు తిన్నారు.

"అంటే....అంటే...."

"నేను కడుపు తీయించుకోడం లేదు."

మరీ ఆశ్చర్యపోయారాయన.

"మరి....మరి....ఏం చెయ్యాలనుకుంటున్నావు?" కంగారు కంగారుగా అడిగారు ఆయన. ఇంతసేపూ ఎంతో గంభీరంగా వున్న మనిషి శాంతి మాటలకు నీరసించిపోయారు.

"మరీ అంత కంగారుపడకండి. నే నేదో కోర్టుకెక్కి మీ ఆస్తిలో వాటా కావాలని దావా వెయ్యను. అటువంటి ఆలోచనలు కూడా మాలాంటి పేదవారికి రావు. మీలాంటి పెద్దింటివాళ్ళు ఆస్తుల కోసం కోర్టుల కెక్కుతారు. ఒకరి ప్రాణాల్ని మరొకరు తీసుకుంటారు. కాబట్టి నా విషయంలో మీరు నిశ్చింతగా వుండవచ్చు...." అభయం యిస్తున్నట్లుగా అంది శాంతి.

ప్రసాదరావుగారి మనసు శాంతించింది.

"అదికాదమ్మా! పెళ్ళికాకముందే కడుపు తెచ్చుకున్న 'పతిత' అనే అపకీర్తిని భరిస్తావా" ఆయన మాటల్లో శాంతికి నక్కవినయమే తొంగి చూసింది.

"చూడండి ప్రసాదరావుగారూ! నిర్భాగ్యులు, దౌర్భాగ్యులు ఈ దేశంలో చాలామంది వున్నారు, నేనూ ఆ కోవకు చెందినదాన్నే. అందుకే మీ సానుభూతి నా కనవసరం. కాని ఒక్కమాట మాత్రం గుర్తుంచుకోండి. మీరూహించినట్లు స్త్రీ ఎంతమందికి పడితే అంతమందికి మనసివ్వలేదు. స్త్రీ ఒకరికే మనసిస్తుంది. ఒకరినే ఆరాధిస్తుంది. ఆ వ్యక్తి కోసం ఆఖరికి ప్రాణాలను సైతం అర్పిస్తుంది. అదే మన పవిత్ర భారత దేశంలో స్త్రీ చేసుకున్న దౌర్భాగ్యం. నేనూ భారత స్త్రీనే....మీ ఉద్దేశం ప్రకారం నా కడుపులో పెరుగుతున్న ప్రాణాన్ని రూపుమాపుకొని మరొకరికి ఇల్లాల్ని కమ్మంటారు,



లిప్‌స్టిక్ వేసుకునేవారు వెంటనే ఒక చిన్న ఐస్ ముక్కను పెదవి మీద పెట్టి మెల్లిగా అదిమి తీయాలి. ఇలా చేస్తే – రంగు ఎండిపోకుండా, రోజంతా అలాగే వుంటుంది. —కల్పన

అంతేనా?....నో....అది ఎన్నటికీ జరగదు. గతాన్ని మరిచిపోయి, మరొకరి జీవితంలో ప్రవేశించి ఆ వ్యక్తి జీవితాన్నీ, నా జీవితాన్నీ నరకప్రాయం చేసుకోలేను. నాకు పెళ్ళి అయినా కాకపోయినా నేను మీ అబ్బాయి వల్లనే మాతృమూర్తిని కాబోతున్నాను. నాకున్న ఆశ అల్లా నా కడుపులో పెరిగే బిడ్డే. వాడి కోసమైనా జీవిస్తాను. ఆ బిడ్డ కోసమే నా సర్వస్వాన్నీ ధారపోస్తాను...ఇకపోతే....ఈ సంఘమూ, ఈ వ్యవస్థా అంటారా? వాటికి భయపడటం మానేశాను....నా జీవితాన్ని నాశనం చేసిన ఈ వ్యవస్థ కోసం నే నెందుకు భయపడాలి?... నా మీద సానుభూతి చూపించలేని ఈ సంఘం కోసం నే నెందుకు భయపడాలి?....నా జీవితాశయం వేరు....నా ఆదర్శాలు వేరు....అంతే.... అంతే....నేను నమ్ముకున్న సిద్ధాంతాల కోసమే నేను బ్రతుకుతాను" ఆవేశంగా అంటున్న శాంతిని చూడటానికి కూడా ధైర్యం చాలలేదు ప్రసాదరావుగారికి.

ఆయనకు శాంతి విషయం యింత తేలిగ్గా పరిష్కార మవుతుందనిపించలేదు. శాంతి పదిమందినీ పిలిచి అల్లరిచేసి, తన ఇంటి పరువు బజారున పడేస్తుందనుకున్నాడు. లేకపోతే తన కొడుకు రాసిన ప్రేమ లేఖలు కోర్టులో పడేసి, ఆమె కడుపులో పెరుగుతోన్న ప్రాణాన్ని ప్రత్యక్ష సాక్ష్యంగా కోర్టులో ఋజువు చేస్తుందని భయపడ్డాడు. కాని తనూహించిన దేమీ జరగలేదు. శాంతికి నయానా భయానా ముందు నచ్చజెప్పి, వినకపోతే ప్రాణాలు తియ్యడానికైనా సంసిద్ధుడయ్యాడు తను. కాని జరుగుతున్న దేమిటి?....

శాంతి నిజంగా మంచి పిల్ల.

శాంతి ఎంతో ఉత్తమురాలు.

ఆమె ఆదర్శాల ముందూ, ఆశయాల ముందూ, ఆమె నిర్భయంగా వెల్లడించే అభిప్రాయాల ముందూ తను నిజంగా ఓడిపోయాడు.

'హేట్సాఫ్ శాంతీ .... క్షణక్షణానికీ ఎదిగిపోతున్న నీ ఔన్నత్యానికీ, నీ ఔదార్యానికీ నేను తలొంచుతున్నాను....రియల్లీ....నేనే నీ ముందు ఓడిపోయాను' తనలో తనే అనుకున్నారు ప్రసాదరావుగారు.

అంతలోనే అభిమానం అడ్డొచ్చింది.

వంశ గౌరవమూ, ప్రతిష్ఠా, పరువూ అడ్డొచ్చాయి....

అంతలోనే–తనలో శాంతి యెడల ఏర్పడుతోన్న సద్భావాన్ని తుడిచేసుకొని, మళ్ళీ గంభీరంగా మారిపోయారు ప్రసాదరావుగారు.

శాంతి లేచి నిలబడింది.

వారించలేదు ప్రసాదరావుగారు.

శాంతి తన చేతివ్రేలికి వున్న ఉంగరాన్ని తీసి, ప్రసాదరావుగారికి ఇస్తూ — "ఇది మీ అబ్బాయి ఆలోచనా రహితంగా, ఆవేశంలో, నా శీలాన్ని అపహరించిన క్షణంలో నా చేతివ్రేలికి తొడిగాడు. కాని ఇది వుంచుకునేంత స్వార్థపరురాల్ని కాదు. మీ వస్తువు మీరే వుంచుకోండి" అంది.

ఆయన ఆ ఉంగరాన్ని అందుకున్నాడు.

శాంతి ఆయనకు నమస్కారం చేసి వెనక్కి తిరిగి గబగబ అడుగులేసుకుంటూ గేటు చేరుకుంది. గేటు తెరచుకుని రోడ్డెక్కి ఆఖరిసారిగా వెనక్కి తిరిగి ప్రసాదరావుగారి బంగళా వైపు చూసింది.

ఆశ్చర్యం!!

బాల్కనీలో నిలబడి తనవైపే చూస్తున్న రాజశేఖరం!!

ఒక స్త్రీ జీవితంతో ఆటలాడుకుని, ఆమె శీలాన్ని అపహరించి, ఆమెను నట్టేట్లో ముంచి, మరో స్త్రీ మెడలో త్వరలో తాళి కట్టబోతున్న నయవంచకుడు!

చేసిన వాగ్దానాలు నిలబెట్టుకోలేక, తండ్రిని ఎదిరించి ప్రేమించిన స్త్రీని పెళ్ళాడలేని వ్యక్తిత్వం లేని పిరికి వెధవ!

కసిగా అనుకుంది శాంతి.

అంతే! ఇంక అక్కడ ఒక్క క్షణం నిలబడలేకపోయింది. పెద్ద పెద్ద అడుగులేసుకుంటూ బస్టాండు వైపు నడిచింది.

[ముగింపు వచ్చే సంచికలో]

# తోటకూర



ఆకు కూరల్లో మిక్కిలి శ్రేష్టమైంది 'తోటకూర'. ఇది స్వతహాగా మన దేశానికి చెందింది. కాని ప్రస్తుతం శీతల దేశాల్లో భారి ఎత్తున సాగు చేయబడుతుంది. నేడు ప్రపంచ వ్యాప్తంగా 60 రకాల తోటకూర మొక్కలున్నాయి. మన దేశంలో 25 రకాలకు చెందిన మొక్కలున్నాయి. మన తెలుగు దేశంలో ముఖ్యంగా ఎర్ర తోటకూర, తెల్ల తోటకూర, పెరుగు తోటకూరలు చాలా ప్రసిద్ధి పొందాయి. చాలమంది తెలుగువాళ్ళు 'తోటకూర' అంటె చెవి కోసుకుంటారు. అమెరికాలో గల 'పెన్సిల్‌వేనియా'లో ఇటీవలే 'తోటకూర'పై అంతర్జాతీయ సదస్సు జరిగింది. ఈ సదస్సులో 70 దేశాలకు చెందిన 120మంది శాస్త్రజ్ఞులు పాల్గొన్నారు.

తోటకూరలో అనేక పౌష్టిక పదార్థాలున్నాయి. 'ఎ', 'సి' విటమిన్లు, ఐరన్, సోడియం, కాల్షియం మొదలైన ఖనిజ లవణాలతోపాటు ప్రోటీన్లు, అమినో ఆమ్లాలు పుష్కలంగా ఉన్నాయి. చంటి పిల్లలు పాలు త్రాగే కాలంలో ప్రతి రోజు తల్లులు ఒక గ్లాసెడు తోటకూర రసాన్ని విధిగా త్రాగటం మంచిది. తోటకూర రసాన్ని త్రాగడంవల్ల తల్లి ఆరోగ్యం, శిశువుల ఆరోగ్యం పెంపొందుతుంది. శిశువుల ఎముకలు, దంతాలు తోటకూరలో గల కాల్షియంవల్ల గట్టిబడుతాయి. కాలేయం, స్ప్లీన్, పిత్తాశయం లాంటి ముఖ్యమైన అవయవాలు, మెదడులోని రక్త కణాలు చక్కగా అభివృద్ధి చెంది, శిశువు ఆరోగ్యానికి సహాయపడతాయి. శిశువులు పెరిగినకొద్ది, వారి మేధ కూడ సక్రమమైన పద్ధతుల్లో అభివృద్ధి చెంది, శిశువుల్లో చిన్నప్పటి మంచే బుద్ధి కుశలతను పెంచేటందుకు తోటకూర రసంలో గల అంశాలు తోడ్పడతాయి. యువకులు, ముసలివాళ్ళు, పిల్లలు కూడా ప్రతి రోజు తోటకూర రసాన్ని త్రాగితే వారి ఆరోగ్యం చెక్కు చెదరదు. అజీర్ణ వ్యాధి హరించిపోయి, జీర్ణక్రియక్రమేణా పునరుద్ధరింపబడుతుంది. గుండెలో మంట, నరాల బలహీనత తొలగిపోతాయి. దంతక్షయం అరికట్టబడుతుంది. కంటి చూపు వృద్ధి చెందుతుంది. 'చత్వారం' దరిదాపులకు రాదు. ఉబ్బస రోగులు తోటకూర రసాన్ని సేవిస్తే ఉపశమనం కలుగుతుంది.

### కూరలు పోషక పదార్థాలు

తోట కూర:

వీటిల్లో అనేక రకాలున్నాయి. తోటకూర, కొయ్య తోటకూర, పెరుగు తోటకూర, ఎర్రతోటకూర మొదలైనవి. అయితే యివన్నీ కూడా మొక్కలుగా భూమికి మూర ఎత్తువరకూ పెరుగుతాయి. కొన్ని తోటకూర కాడలు ఆరడుగుల ఎత్తువరకూ కూడా పెరుగుతాయి. ఇందులో కొయ్యతోట కూర భూమిమీద తీగవలె పాకుతుంది. పెరుగుతోట కూర తెల్లగా వుంటుంది.

ప్రతి 100 గ్రాముల తోటకూరలోనూ— 85.8 గ్రాముల తేమ, 4.5 గ్రా॥ ప్రొటీన్లు, 0.5 గ్రా॥ క్రొవ్వు పదార్థం, 3.1 గ్రా॥ ఖనిజ పదార్థం, 5.7 గ్రా॥ పిండి పదార్థం 0.50 గ్రా॥ కాల్షియం, 0.10 గ్రా॥ భాస్వరం, 21.4 మిల్లిగ్రాముల ఇనుము, 2,500 నుంచి 11,000 యూనిట్ల దాకా విటమిన్ ఎ, 0.03 మి.గ్రా॥ విటమిన్ బి, 0.9 మి.గ్రా॥ నికోటినిక్ ఆమ్లము, 0.10 మి.గ్రా॥ రిబోఫ్లోవిన్, 173 మి.గ్రా॥ విటమిన్ సి, వున్నాయి. వీటి కెలోరీ విలువ-47.

తోటకూరతో పులుసు, పచ్చడి, కూర చేసుకుంటారు. కూరలో అల్లం, పచ్చిమిరపకాయలు చేర్చి వండితే రుచిగా వుంటుంది. కొందరు పులుసు ఆపబెట్టి వండుకుంటారు. తోటకూర కాడ కూడా కూర వండుకుంటారు. అయితే ఈ కూర త్వరగా జీర్ణం కాదు. తోటకూర ఆకులు సన్నగా తరిగి వుడకబెట్టి వార్చి పప్పుకూరగా చేసుకోవచ్చును. కొందరు గోంగూరపచ్చడి లాగా తోటకూర పచ్చడి కూడా చేసుకుంటారు.

తోటకూరలో ఇనుము, విటమిన్, ఎ, సిలు పుష్కలంగా వున్నాయి. ఈ కూర కంటికి మంచిది. చలవ చేస్తుంది. అయితే కొయ్యతోట కూర వేడి చేస్తుంది. దీనిని బాలెంతలకు పథ్యపు కూరగా వాడతారు. వాతాన్ని హరింపజేస్తుంది- అని చెబుతుంది ఆయుర్వేదశాస్త్రం.

హంగేరిలో తోటకూరపై జరిపిన ప్రయోగాల్లో ‘లైసిన్’ అనే అమినో ఆమ్లం అధిక శాతంలో ఉన్నట్లు కనుకోవడం జరిగింది. చంటిపాపల ఆరోగ్యానికి ‘లైసిన్’ చాలా అవసరం. మామూలుగా మనం చంటిపాపలకు వాడే చుక్కల మందు ‘సిరప్’లల్లో ‘లైసిన్’ తప్పక ఉంటుంది. తోటకూర రసంతో శిశువుల ఆరోగ్యానికి దోహదం చేసే సిరప్‌లను, చుక్కలను తయారుచేసేటందుకు ప్రయత్నాలు ముమ్మరంగా జరుగుతున్నాయి.

కొంతమంది అమెరికన్ శాస్త్రజ్ఞులు తోటకూరపై, నేపాల్ దేశంలో ప్రయోగాలను జరుపుతున్నారు. వారి ప్రయోగాల్లో తోటకూర ఆకులతో పాటు, తోటకూర గింజలను కూడ తినవచ్చునని తెలియవచ్చింది. తోటకూర గింజల్లో కూడ పౌష్టికాహారం, మనం నిత్యం తినే ‘బియ్యం’ జొన్నల్లో గల పౌష్టికాహారం కంటె రెండు రెట్లు ఎక్కువ ఉంటాయని తెలుసుకోవడం జరిగింది. కాబట్టి వీటిని కూడా ఆహారంగా మనం తీసుకోవచ్చును. నూనె గింజలను సాగుచేసే పద్ధతుల్లో తోటకూర పంటను సాగుచేసి, వాటినుండి తోటకూర గింజలను పొందేటందుకు గల అవకాశాలను వ్యవసాయ నిపుణులు పరిశీలిస్తున్నారు.

ప్రస్తుతం, అమెరికా, మెక్సికో దేశాలు సంయుక్తంగా తోటకూర పై విశిష్ట ప్రయోగాలను జరుపుతున్నాయి. అమెరికా, మెక్సికో దేశంలో కొన్ని వందల హెక్టార్లలో తోటకూర పంటను సాగు చేస్తున్నారు. దిన దినం ఈ పంట ఈ దేశాల్లో వ్యాప్తి చెందుతున్నది. కలకత్తాలో గల ‘నేషనల్ బొటానికల్ గార్డెన్’ వారు అధిక నాణ్యత, దిగుబడి నిచ్చి, రోగ నిరోధక శక్తిగల సరికొత్త హైబ్రిడ్ తోటకూర వంగడాలను రూపొందించేటందుకు తీవ్ర కృషి చేస్తున్నారు. మైసూర్‌లో గల జాతీయ ఆహార పరిశోధన సంస్థవారూ తోటకూరలో గల పౌష్టిక అంశాలపై ప్రయోగాలు జరిపి, తోటకూరలో గల ప్రోటీన్లు అగ్రశ్రేణికి చెందినవని ప్రకటించారు.

ప్రపంచంలో ఏర్పడిన ఆహార కొరతను, ప్రోటీన్ల కొరతను భర్తీ చెయ్యడానికి అందరికీ సులువుగానూ అందుబాటులోనూ వున్న బలవర్ధక ఆహారం - ధరలు మండుతున్న ప్రస్తుతపు గడ్డు రోజుల్లో కేవలం ‘తోటకూరే’ అందుకు సందేహం లేదు.

—చిలువేరు స్వరూపాసాగర్

# స్పాంజీలతో ఫ్లవర్ వాజ్



నిన్న, మొన్నటివరకు స్పాంజితో బొమ్మలు చేయటం ఎక్కువగా ఉండేది. ఇప్పుడది పాతబడింది. అయితే ఆ పద్ధతిలోనే ‘ఫ్లవర్‌వాజ్’ చేసుకుంటే క్రొత్తదనంతోపాటు అందంగాను, గొప్పగాను ఉంటుంది.

ఈ ఫోటోలోని ‘వాజు’ను తయారుచేయటానికి సుమారు అరమీటరు స్పాంజిషీటు, ఏదైనా రంగు చమ్కీ చిప్స్, గుండు సూదుల ప్యాకెట్టు ముఖ్యంగా కావల్సినవి.

ముందుగా అట్టముక్క నొకదాన్ని దోసగింజ ఆకారంలో అంటే అడుగు గుండ్రంగా వుంటూ, పైకి పోనూ కోసుగా వచ్చేట్లు కత్తిరించుకోవాలి. తర్వాత స్పాంజిషీటును బల్లపై పరిచి,



దోసగింజ ఆకారం

అట్టముక్కను దాని మీదుంచి, అదే ఆకారం, కొలతతో స్పాంజిని ముక్కలుగా కత్తిరించుకోవాలి. ఈ ఫోటోలోని వాజుకి నేను $12 \times 2 = 24$ ముక్కల్ని వాడాను. ఈ ముక్కల్ని రెట్టింపు సంఖ్యలో అంటే మనం పది అతకదల్చుకుంటే ఇరవై, 12 అయితే 24 ఇలా కత్తిరించుకోవాలి.

తర్వాత ఆ ముక్కలను జత చొప్పున తీసుకొని, రెంటిని కలిపి నిలువుగా మధ్యకు మడిచి, కొసన, మధ్యన, పైచివర స్పాంజిరంగు దారంతో గట్టిగా కుట్టాలి. ఇలా అన్ని ముక్కల్ని జతలుగా కుడితే 12 తయారవుతాయి.

ఇలా తయారైన జతల్ని ఒకదాని ప్రక్కగా మరొకదాన్నుంచి, అడుగున, మధ్యన, పైకొసన మొదటి కుట్లతోనే అతకాలి. అంటే అలాంటి రెండు జతలు కలిపి కుట్టినపుడు మధ్యన డైమండ్ ఆకృతిలో ఖాళీ లేర్పడతాయన్నమాట.



డైమండ్ ఆకృతి

ఇలాగే పన్నెండు జతల్నీ కలిపి కుట్టేసరికి ఫ్లవర్‌వేజు తొడుగు గుండ్రంగా తయారౌతుంది. బొమ్మకైతే ఇది గౌను భాగమన్నమాట. ఇలా తొడుగు కుట్టుకున్నాక చమ్కీచిప్స్ ఒక్కోటీ గుండుసూదితో వాజు మడతల్లో గుచ్చాలి.

వాజుకన్నా చిన్నదిగా వుండే డబ్బానో, సీసానో తీసుకుని, అందులో ప్లాస్టిక్ పూలుంచి, దానికి ఈ స్పాంజి తొడుగు దించితే చిత్రంలో కనిపిస్తున్న ఫ్లవర్‌వాజు తయారౌతుంది.

ఇందులోకి ప్లాస్టిక్ పూలతోబాటు ప్లాస్టిక్ వైరుతో కండెలల్లి పెడితే ఇంకా అందంగా వుంటుంది. ఫోటోలో ‘ఆర్చ్’లా కనిపిస్తున్నది అలాంటి వైరుకండే. అలాగే మిగిలిన స్పాంజి ముక్కల్ని చిన్న పూలుగా కుట్టి కూడా ఇందులో ఉంచొచ్చు. అలాంటి గులాబీయే యిప్పుడు ఫోటోలో మీరు చూస్తున్నది.

కావాలనుకుంటే దీన్నే ఎక్కువ ముక్కలతో పెద్దగా చేసుకోవచ్చు. అలాగే చమ్కీ చిప్స్‌కి బదులు స్పాంజి ముక్కలనే చిన్న చదరాలుగా కత్తిరించి, లేతరంగు వాజైతే ముదురు రంగు ముక్కల్ని, ముదురు రంగు వాజుకైతే లేతవీ ఉపయోగించవచ్చు.

అంతా కలిపి అరగంట పట్టదు ఇది చేయటానికి. చాలా సులువుగా తయారుచేసుకోగలిగే ఈ అందమైన వాజును మీరూ చేసి చూడండి.

—జె. వారిజ

# భాషలు నేర్చుకోండి

| తెలుగు | తమిళం | కన్నడం | మలయాళం | మరాఠి | గుజరాతి | ఒరియా |
|---|---|---|---|---|---|---|
| ప ఫ | ப | ಪ ಫ | പ ഫ | प फ | પ ફ | ପ ଫ |
| పా ఫా | பா | ಪಾ ಫಾ | പാ ഫാ | पा फा | પા ફા | ପା ଫା |
| పి ఫి | பி | ಪಿ ಫಿ | പി ഫി | पि फि | પિ ફિ | ପି ଫି |
| పీ ఫీ | பீ | ಪೀ ಫೀ | പീ ഫീ | पी फी | પી ફી | ପୀ ଫୀ |
| పు ఫు | பு | ಪು ಫು | പു ഫു | पु फु | પુ ફુ | ପୁ ଫୁ |
| పూ ఫూ | பூ | ಪೂ ಫೂ | പൂ ഫൂ | पू फू | પૂ ફૂ | ପୂ ଫୂ |
| పృ ఫృ | — | ಪೃ ಫೃ | പൃ — | पृ फृ | પૃ ફૃ | ପୃ ଫୃ |
| పౄ ఫౄ | — | — — | — — | — — | — — | — — |
| పె ఫె | பெ | ಪೆ ಫೆ | പെ ഫെ | — — | — — | — — |
| పే ఫే | பே | ಪೇ ಫೇ | പേ ഫേ | पे फे | પે ફે | ପେ ଫେ |
| పై ఫై | பை | ಪೈ ಫೈ | പൈ ഫൈ | पै फै | પૈ ફૈ | ପୈ ଫୈ |
| పొ ఫొ | பொ | ಪೊ ಫೊ | പൊ ഫൊ | — — | — — | — — |
| పో ఫో | போ | ಪೋ ಫೋ | പോ ഫോ | पो फो | પો ફો | ପୋ ଫୋ |
| పౌ ఫౌ | பௌ | ಪೌ ಫೌ | പൗ ഫൗ | पौ फौ | પૌ ફૌ | ପୌ ଫୌ |
| పం ఫం | ப் | ಪಂ ಫಂ | പം ഫം | पं फं | પં ફં | ପଂ ଫଂ |
| పః ఫః | — | ಪಃ ಫಃ | പഃ ഫഃ | पः फः | પઃ ફઃ | ପଃ ଫଃ |

తమిళంలో మన ప, బ లకు–ఒకే అక్షరం [ப] వాడతారు.

[వచ్చే సంచికలో మరికొన్ని]

మీ అందానికి మేలు
చేకూర్చే మేకప్ మొదట మీ
చర్మానికి మేలు చేకూర్చాలి.

వివిధరకాల మేకప్‌లు మిమ్మల్ని ఆకర్షణీయంగా చేస్తాయి. అవి చేసే మేలు అంతే మరి. కేవలం క్రూక్స్ వారి లాక్టో-కేలమైన్ మాత్రమే మీ చర్మానికి నిజంగా మేలు చేకూరుస్తుంది. అది మీ చర్మాన్ని మనోహరంగానూ, యవ్వనంతో ఉట్టిపడేట్లు చేస్తుంది. నిర్మలంగా తాజాగా అందంగా. ఇంత తక్కువ శ్రమతో, మీ చర్మ సౌందర్యానికి మరేదీ అంత మేలు చేయదు. అంచేతే అది పరిపూర్ణమైన మేకప్. వాడి చూడండి.
మీ చర్మసౌందరం ఎంత మనోహరంగా వుంటుందో మీరే గమనించండి.
ఆదో ఆకర్షణీయమైన అనుభూతి మరి!




3 వీలైన సైజుల్లో దొరుకుతుంది:
120 మిలీ, 60 మిలీ
మరియు 30 మిలీ

క్రూక్స్ లాక్టో-కేలమైన్
ఒక రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్ ఈ మార్క్‌ను ఏ విధంగానైనా అతిక్రమించినవారు శిక్షింపబడతారు.



లాక్టో-కేలమైన్ కొనేముందు అసలైనదని రుజువు చేసుకునేందుకు క్రూక్స్ చిహ్నం కోసం, తీసివేయబడని క్రూక్స్ సీల్ కోసం తప్పక చూడండి.

డూఫార్-ఇంటర్‌ఫ్రాన్ లి.
పోస్ట్ బాక్స్ నం. 6582, బొంబాయి 400 018

క్రూక్స్
# లాక్టో-కేలమైన్ అందంగా ఉండటానికి సరిక్రొత్త రహస్యం

Sista's-DIL-680A/Tel/79

# నిప్పుతో చెలగాటమా?

మన ఇళ్ళల్లో సామాన్యంగా జరిగే అగ్ని ప్రమాదాలు ఒక్కొక్కప్పుడు అతి బీభత్సకరంగా పరిణమిస్తాయి. ఆధునిక విజ్ఞాన ప్రసాదితాలైన స్టౌ, కుక్కర్, గ్యాస్ స్టౌ, ఎలక్ట్రిక్ హీటర్, ఎలక్ట్రిక్ యిస్త్రీ పెట్టె మొదలైన వాటిలో మనకు ఎంత సౌలభ్యం దొరుకుతుందో వాటిని అజాగ్రత్తగా వాడితే అంత ప్రమాదమూ ఎదురవుతుంది. గత సంవత్సరం బొంబాయిలో జరిగిన అగ్ని ప్రమాదాన్ని ఒకదాన్ని మనం పరిశీలిస్తే ఈ విషయం నిరూపణ అవుతుంది.

కన్యాలాల్ బొంబాయిలో ప్రముఖ వర్తకులలో ఒకడు. ఆయన తన భార్య తారాబాయితో కలసి మొదటి ఆట సినిమాకి వెళ్ళాడు. ఆయన పెద్ద భవంతిలో ఒక అంతస్తులో వుంటున్నాడు. ఆయన నివాసంలో మహరాజ్ అనే నౌకరూ, ధీమన్, నయన్, కీర్తి అనే ఆయన సంతానమూ వుండిపోయారు. కన్యాలాల్ సినిమాకి వెళ్ళేముందు మహరాజ్ గ్యాస్ స్టౌ మీద పాలు పొంగించి, స్టౌ ఆర్పి వంట గదంతా పరిశుభ్రం చేశాడు. స్టౌ ఆరిపోయింది కాని గ్యాస్ కొద్దిగా వెలువడుతూండటం కన్యాలాల్ పరివారంలో ఎవరూ చూడలేదు.

ఆ రాత్రి 11 గంటలకు శేట్ దంపతులు సినిమా నుండి తిరిగి వచ్చేసరికి ప్రతి గది నిండా పెట్రోలు వాయువు నిండిపోయి వుంది. ధీమన్, నయన్, కీర్తి పడకగదిలో దోమతెరల క్రింద గాఢనిద్రలో వున్నారు. శేట్ పెద్దకొడుకు సుధీర్ మటుకు టెర్రేస్ మీద విడిగా వున్న గదిలో చదువుకుంటున్నాడు.

కన్యాలాల్ శేట్ తన నివాసంలోనికి రాగానే సిగరెట్ అంటించుకోవడానికి అగ్గిపుల్ల గీశాడు. శేట్ దంపతుల దుస్తులు క్షణంలో నీలిమంటల్లో దహనం కాసాగాయి. ఆ నీలిమంటలు పడకగదిలోకి వ్యాపించి పరుపులూ, దోమతెరలూ బట్టలు అంటుకున్నాయి. తారాబాయి పిల్లల దగ్గరకు పెడబొబ్బలు పెట్టుకుంటూ పరుగెత్తింది. కన్యాలాల్ శేట్ కిటికీ తెరచి సహాయం కోసం అరిచాడు. అదృష్టవశాత్తూ ఇరుగుపొరుగువారు త్వరలోనే మేల్కొని అగ్నిమాపక దళానికి ఫోన్ చేశారు.

సుధీర్ తప్ప కన్యాలాల్ పరివారంలో సభ్యులందరూ దారుణమైన గాయాలతో ఆసుపత్రికి తరలించబడ్డారు. రెండు రోజుల మరణయాతన తర్వాత నయన్ చనిపోయింది. తరువాత మూడు రోజులకు తారాబాయి, మూడు వారాల తరువాత ధీమన్ చనిపోయారు. కుటుంబంలో గాయాలతో బతికి బయటపడింది కన్యాలాల్, కీర్తీ. అయితే వారు చాల వికారంగా మృత్యు స్వరూపాల్లాగా దారుణ సంఘటనకి ప్రతీకగా మిగిలిపోయారు.

బొంబాయి అగ్నిమాపక దళంవారు తమ వృత్తి నిర్వహణలో తెలిసివచ్చిన కొన్ని విషయాలను ఇలా చెప్పారు.

"ఇంధనంగా వుపయోగించే నూనెలు అజాగ్రత్తగా వాడటం వలననే తరచు అగ్ని ప్రమాదాలు ఇళ్ళల్లో సంభవిస్తూంటాయి. కన్యాలాల్ కుటుంబంలో జరిగినట్టు ఎక్కడోకాని ఎప్పుడోకాని జరగదు. ఒక్కటి జరిగితే ఏం-ఏ ప్రమాదానికీ తీసిపోనంతటి ఘోర ప్రమాదం అది. అగ్ని ప్రమాదం ఎలాంటిదైనా ప్రాణ నష్టం, ఆస్తి నష్టం-లేదా రెండింటిలో ఒకటైనా జరిగితీరడం ఖాయం. ఒకోసారి ప్రాణాలు ప్రమాదంలో పోయి వుంటేనే బాగుండు ననిపించేటంతగా భయంకర స్వరూపాలు మిగులుతాయి. జాతీయ అగ్నిమాపక దళంవారు సేకరించిన వివరాల్లో ఒక్క బొంబాయి నగరంలోనే 1976-77 సంవత్సరాల్లో 285 ప్రాణాలు అగ్ని ప్రమాదాల్లో ఆహుతయ్యాయంటే మనకి గుండె ఝల్లుమనక మానదు. ఆస్తి నష్టం షుమారు 5 కోట్ల 25 లక్షల రూపాయిలు।

అగ్నిమాపక దళం అధికారులు పౌరులకు కొన్ని జాగ్రత్తలూ హెచ్చరికలూ జారీ చేసి అగ్ని ప్రమాదాలను నివారించమని కోరుతున్నారు.

ఆ జాగ్రత్తలు ఇవి :—

1. రాత్రివేళల్లో వంటకి పనికివచ్చే సాధనాలను పరీక్షించి చూసుకోవాలి.

నిద్రపోయేముందు, బయటికి వెళ్ళేముందు వంట గ్యాస్‌ను విడుదలచేసే సిలిండరు గ్యాస్‌ను విడుదల చేయడంలేదనే విషయం నిర్ధారణ చేసుకోవాలి. ఎలక్ట్రిసిటీతో పనిచేసే సాధనాలకు ప్లగ్స్ తీసివేసినట్టు కూడా నిర్ధారణ చేసుకోవాలి. బొగ్గులతో



వంట చేసేవారు బొగ్గులన్నీ శుభ్రంగా ఆరిపోయినట్టు చూచుకుని వాటిని ఒక బుట్టలోకి ఎత్తి వుంచుకోవాలి. వంట గదిలో ఎప్పుడూ నీళ్ళ తొట్టెను వుంచుకోవాలి. మసిగుడ్డలు కాలినా, బొగ్గులు అటూ యిటూ మండుతూ తూలినా ఈ నీరు వుపయోగిస్తుంది. అగ్గిపుల్లల వుపయోగం కాగానే వాటిని ఈ నీటి తొట్టెలో వేస్తే ప్రమాదం కొంత నివారణ అవుతుంది.

2. పొగత్రాగడంలో నియమాలు పాటించాలి :

సిగరెట్లను అజాగ్రత్తగా పట్టుకుని పొగత్రాగడం, ఎక్కడపడితే అక్కడ సిగరెట్లు కాల్చడం ఇళ్ళల్లో అగ్ని ప్రమాదాలు సంభవించడానికి దోహదం చేస్తాయి. శయ్య మీద పరుండి సిగరెట్ కాల్చడం



అంత దురలవాటూ ప్రమాదకరమూ మరొకటి లేదు. అగ్గిపుల్లలను వెలిగించి ఇష్టంవచ్చినట్టు విసరకూడదు. సిగరెట్ పీకలు ఆర్పకుండా విసరడం పరిసరాల్లో జ్వాలలు రేపవచ్చు. ఒక్కొక్కరు సిగ

రెట్ పీకలను చెత్తబుట్టల్లో వేసి ప్రమాదాలు సృష్టిస్తారు. సిగరెట్ నుసి రాల్చడానికి యాష్ ట్రే వాడటం, పరిమితమైన ప్రమాదం లేని స్థలాల్లోనే పొగ త్రాగడమూ చేయాలి. సిగరెట్ పీకలకు ప్రత్యేకమైన యిసుక తొట్టెను వాడటం మంచిది.

3. అగ్ని ప్రమాదాలు తప్పించుకునే పథకం వేసుకోవాలి :

ఈ మాటలో మనకి హాస్యం దొరకవచ్చు. కాని ప్రమాదాలు సంభవించినప్పుడు తడబాటుపడి ప్రమాదాలకు బలయ్యేకంటె ముందే ప్రమాదం జరిగినప్పుడు తప్పించుకోవడానికి ప్రత్యేక పథకం వేసుకోవాలి. ప్రమాదంలో కుటుంబంలో ప్రతి ఒక్క



సభ్యుడూ ఎలా మెలగాలో 'రిహార్సల్' వేసుకోవాలన్నమాట. అగ్ని ప్రమాదాలు ఒకోసారి చీకట్లో జరగవచ్చును. పొగతో వూపిరి సలపకపోవచ్చును. చేతికి అందుబాటులో టార్చిలైట్లు వుంచుకోవడం మంచిది. మీ యింట్లో చిన్నపిల్లలు లేదా బలహీనులు వుంటే వారిని బయటకు తీసుకువెళ్ళే బాధ్యత ఎవరిదో నిర్ణయించుకోండి. ప్రమాదానికి దూరంగా తప్పించుకుపోయినవాళ్ళు యిక లోపలికి తిరిగివెళ్ళే ప్రసక్తి వుండకూడదు. ఆ రకంగా యింటి నుండి బయటపడాలి.

సాధ్యమైనంతవరకూ ఇంట్లో వున్న అందరినీ అగ్నికి అందనంత దూరాన వుంచినట్టు నిర్ధారణ కాగానే ప్రమాదం జరిగిన గది తలుపులూ కిటికీలూ మూసి వుంచాలి. తాజాగా ఆక్సిజన్ ఎప్పటికప్పుడు లోపలి జ్వాలకు అందే ప్రమాదం తప్పుతుంది (అయితే ఒక్కోసారి తలుపులూ కిటికీలే ముందు దగ్ధమై వుండవచ్చు). మీరు బయటపడండి. ఆ తర్వాత అగ్నిమాపక దళానికి కబురు అందించండి.

కాలుతోన్న ఇంటి తలుపులు చటుక్కున తెరవాలని చూడకండి. లోపలవున్న జ్వాల ఒక్కసారిగా మీ మీదకు ఆకస్మిక దాడి జరపవచ్చును. కాని తలుపులు తాకలేనంత వేడిగా వుంటే మీరు వాటిని తాకాలని చూడకండి. చల్లగా వుంటేనే తలుపులను నెమ్మదిగా ముందుకి తోసిచూచి అప్పుడు లోపలికి అడుగుపెట్టండి. పై కప్పు నిప్పుతో వుంటే నేల మీద ప్రాకుతూ వెళ్ళండి. దట్టమైన పొగలు క్రమ్మి వుంటే దుస్సాహసంతో ముందుకి వెళ్ళకండి. ఆ పొగలో ఏ మూల ఏ ప్రమాదం పొంచివున్నదో మన వూహకి అందదు.

మండిపోతోన్న భవంతి నుండి బయటపడటానికి లిఫ్టును ఎన్నడూ వుపయోగించరాదు. మెట్లమీదుగా దిగడం క్షేమం. కిటికీలోంచి దూకవలసివస్తే చేతుల మీద అటుప్రక్కకి వ్రేళ్ళాడి నేల నుండి మీరున్న ఎత్తు తగ్గేలాగా జాగ్రత్తపడి దూకండి. కిటికీ రెక్కకు తాడు కట్టి ఆ తాడు వెంబడి కూడా క్రిందకు జారవచ్చును. అవకాశం దొరికితే మీరు దూకవలసిన స్థలంలో తలగడలు, దుప్పట్లు లాంటి మెత్తటి వస్తువులు మొదట విసిరి వాటిమీద దూకవచ్చును.

4. పిల్లలను అగ్నితో ఆడకుండా చూడండి.

అగ్గిపుల్లలు పిల్లల అందుబాటులో వుండకుండా జాగ్రత్తపడండి. అగ్గిపుల్లలు వెలిగించగలిగే వయస్సు వచ్చిన పిల్లలకు అగ్గిపుల్లలను జాగ్రత్తగా వెలిగించ గలిగేలాగా శిక్షణను యివ్వండి. నిప్పు



నుండి, ఇంధనాల నుండి దూరంగా వుండేటట్టు చిన్నపిల్లలకు అలవాటు చేయాలి. ఎలక్ట్రిక్ హీటర్ల జోలికి పిల్లలను వెళ్ళనివ్వరాదు. దీపావళి లాంటి పండుగల్లో అంతగా బాణాసంచా కాల్చుకోవలసివస్తే వాళ్ళను బహిరంగ స్థలంలో కాల్చుకొనమనండి. అయితే పెద్దవాళ్ళు వాళ్ళ మీద ఒక కన్ను వేసి వుంచాలి.

5. తరచుగా మీ యింటిని తణిఖీచేయండి.

విదేశాల్లో అగ్నిమాపక దళాలు తరచుగా పౌరుల నివాసాలను తణిఖీచేసి వెళ్తాయి. భారత దేశంలో ఆ పద్ధతి ప్రవేశపెడితే బాగుంటుంది. మన యిళ్ళల్లో మనమే తణిఖీచేసుకుని ఈ లోటును భర్తీచేసుకోవచ్చును.

మన ఇళ్ళల్లో వుండే ఎలక్ట్రిక్ వైరింగ్‌ను తరచు తణిఖీ చేసుకోవాలి. షార్ట్ సర్క్యూట్ ప్రమాదం లేకుండా చూచుకోవాలి. అగ్ని ప్రమాదాల్లో యాభై శాతం షార్ట్ సర్క్యూట్ వల్లనే సంభవిస్తోన్నట్టు సర్వేలో తేలింది. ప్రతి ఏడాదీ మనం వైరింగును తణిఖీ చేసుకున్నా చాలును. వైరింగులో లోపం కనిపిస్తే అశ్రద్ధచేయకుండా వెంటనే తగిన ఏర్పాట్లు చేసుకోవాలి. పాయింటు వున్నచోట అవసరంవున్న



ప్లగ్ మాత్రమే వుంచడం మంచిది. బల్బులు వెలిగే పాయింటు నుండి ఎప్పుడూ మరో లైనుకు కరెంటు తీసుకోరాదు. అన్ని ప్లగ్‌లకూ తగిన సామర్ధ్యంకల



ఫ్యూజులున్నట్టు నిర్ధారణ చేసుకోవాలి. అతుకులతో వైర్లు బాగుచేసుకునేకంటె కొత్త వైర్లు వేసుకోవడం వుత్తమం. తివాచీలూ, లినోలియం, చాపల అడుగునుండి వైర్లను తీసుకువెళ్ళరాదు. తాకిడికి అవి మండవచ్చును.



బాయిలర్‌ను కొనుక్కునేటప్పుడు కొంచెం ధర ఎక్కువయినా ప్రెషర్ ఏక్టివేటెడ్ ఎస్కేప్ వాల్వ్ వున్నది కొనుక్కోవాలి. ఎలక్ట్రిక్ ఇస్త్రీ పెట్టెకు ప్లగ్ తగిలించి (విద్యుత్ సరఫరా అవుతూండగానే) ఎన్నడూ విడిచి వెళ్ళరాదు. ఇస్త్రీ పెట్టె క్రింద వేసే దిమ్మ విద్యుత్తును ప్రవహింపనిచ్చేది కారాదు.

రెండవ తరగతివీ, పాడయినవీ అయిన హీటర్లనూ కుక్కర్లనూ వాడరాదు. కిటికీ రెక్కలకు దగ్గిరగానో, తెరలకు అందుబాటులోనో ఎప్పుడూ వంట చేయవద్దు. స్టౌలు, హీటర్‌లు వెలుగుతూండగా ఎన్నడూ వాటిలో ఇంధనం పోయకూడదు. ఇంధనం వంట గదికి వెలుపలనే వుండాలి. గ్యాస్ కుక్కర్‌ను వాడుకునేటప్పుడు రబ్బర్ ట్యూబును తరచుగా పగుళ్ళు లేకుండా చూచుకోవాలి. గ్యాస్ తప్పించుకుని వస్తోంటే లేదా అనుమానం వచ్చినా వెంటనే ప్రధాన సరఫరా జరిగే వాల్వును మూసెయ్యాలి. సమీపంలో ఏ రకం అయిన మంట వున్నా ఆర్పెయ్యడం మంచిది. వెంటనే కిటికీలు తెరచి గదిలో ఏమైనా గ్యాస్ వుంటే బయటికి పోయేలాగా జాగ్రత్తపడాలి. వెంటనే మీరు అశ్రద్ధచేయకుండా గ్యాస్ సరఫరా చేసే కార్యాలయానికి ఫోన్ చేయండి.



పకోడీలు వేయించేటప్పుడు నూనె మండవచ్చును. అలాంటి సమయంలో ఆ నూనె మీద నీరు చల్లరాదు. నీటి తుంపరలు మంటను వుధృతం చేస్తాయి. వత్తులు తగ్గించడమో, గ్యాస్ సరఫరా ఆపుచేయడమో తక్షణం చేసి మంట యింకా వుంటే

నూనె కళాయి మీద గోనెపట్టా లాంటి ముతకబట్ట కప్పాలి. కళాయిలో మూడోవంతు నూనె కంటె హెచ్చు నూనె వేయకపోవడం కూడా ఒక ప్రమాద నివారణ చర్య.



గ్యాస్ కుక్కర్లను నేలమట్టానికి వుంచి వుపయోగించరాదు. చీర చెంగులకు జ్వాల అంటుకునే ప్రమాదం వుంది. గ్యాస్ కుక్కర్లకు దూరంగా కాయగూరలు, ఇతర దినుసులు వుంచుకోవాలి. ఎక్కువమంది గృహిణులకు కుక్కర్ల మీదుగా వంగి బీరువాలో వున్న దినుసులను అందిపుచ్చుకునే దురలవాటు వుంది. అలాంటప్పుడు ఆమె బట్టలకు మంట అంటుకునే ప్రమాదం పొంచి వుంటుంది. వంట సమయంలో శరీరం ముందుభాగం కప్పేలాగా ఖద్దరుబట్ట ధరించడం మంచిది. పైగా సింథటిక్ బట్టలతో వంట చేయకూడదు. పనికిరాని కాగితం ముక్కలు, బట్టల పీలికలు ఎప్పటికప్పుడు వంటయింటి నుండి బయటకు వెళ్ళే ఏర్పాటు చూచుకోవాలి. అగ్ని ప్రమాదాల్లో వీటికి తగినంత పాత్ర వుంది. పెట్రోలును యిళ్ళల్లో వుంచడం నేరం. చిన్నమొత్తంలో వుంచుకోవలసివచ్చినా జాగ్రత్తగా మూత బిగించి సురక్షితమైన స్థలంలో వుంచుకోవాలి. పెయింట్లూ, ఇతర ఇంధనాలూ మూతలు బిగించి గుర్తుగా వంట గదికి దూరంగా వుంచుకోవాలి. ఇళ్ళల్లోనే టైలరింగ్ చేసేవాళ్ళూ, పెయింట్ చేసే




వాళ్ళూ పెద్దమొత్తంలో బట్టలూ, పెయింట్లూ నిలవ చేసి వుంచడం ప్రమాదానికి దారితీస్తుంది. ఈ చర్యలన్నింటికీ తోడుగా మనం అగ్ని ప్రమాదాలకు ఎలాంటి చర్యలు తీసుకోవాలో సామాన్య ప్రజలకు తెలియ చెప్పాలి. చిత్రాలతో, చలన చిత్రాలతో ఎక్కువమందికి తెలియ చెప్పవచ్చు. అగ్ని ప్రమాదాల సమయంలో వెంటనే అగ్నిమాపక దళంవారికి తెలియపరచాలి. అగ్నిమాపక దళంవారి కర్తవ్యానికి సహాయం చేయకపోయినా ఫరవాలేదు. అడ్డు తగలకుండా వుంటే చాలు.

చివరిగా - ఎవరి యింటిని వారే సురక్షితంగా వుంచుకోవాలి. ఈ విషయంలో స్త్రీల పాత్రే హెచ్చు.

—ఎమ్. సత్యవతీదేవి



# వైద్య సలహాలు

## -డాక్టర్

శ్రీమతి వి.

నాకు రక్తపు పోటు వ్యాధి వుంది. రెండు సంవత్సరాలుగా రకరకాల మందులు వాడాను. ఎలాంటి ప్రయోజనమూ కనబడలేదు. అందువల్ల మళ్ళీ మరోరకం మాత్రలు రాసిచ్చారు. మామూలు రోజులలో ఒకటి, నెత్తురుపోటు ఎక్కువగా వున్న దినాలలో రెండు ప్రకారం తీసుకుంటున్నాను. దీని వల్లనో ఏమో మరి నా పెదవులు కొద్దిగా వాచాయి. ఇప్పుడు నొప్పిగా కూడా వుంటున్నాయి. మాత్రలు తగ్గించమంటారా? అలాగే తీసుకోమంటారా?

రక్తపు పోటు వుంటే ఆహారంలో ఉప్పు తగ్గించాలి. ఆవకాయ అసలు ముట్టుకోకూడదు. క్రమం తప్పకుండా రోజూ కొంతదూరం నడిచి వెళ్ళిరావడం చాలా మంచిది. ఇక మందులు ఎక్కువ చేయడం తగ్గించడం అన్న విషయం మాత్రం డాక్టర్‌ను నేరుగా సంప్రదించి డాక్టర్ సలహా మేరకే చేయాలిగాని మీ ఇష్టప్రకారం చెయ్యకూడదు.

ఎస్. ఎ.

మా పెద్దమ్మాయికి నాలుగేళ్లు నిండాయి. ఆరోగ్యంగానే వుంది. కాని రాత్రుళ్ళు నిద్రపోయేప్పుడు పళ్ళు కొరుకుతూ వుంటుంది. ఇది ఎందువల్ల?

పాప మలం పరిశోధనచేసి అందులో పురుగులు వున్నాయేమో తెలుసుకోండి. వున్నట్టయితే దానిని పోగొట్టడానికి వైద్యులను సంప్రదించి మందు ఇవ్వండి. చాలామందికి సాధారణంగా ఎలాంటి చికిత్స లేకపోయినా రోజులు గడిచినకొద్దీ అదే నయమైపోతుంది.

ఆర్. యస్.

మా అమ్మాయికి ఒక సంవత్సరం తొమ్మిది నెలలు వయసు. అప్పుడప్పుడు రొమ్ములో పడిశం పట్టి శ్వాసించడానికి ఇబ్బంది పడుతూ వుంటుంది. కొద్దిగా జ్వరం కూడా వస్తూ వుంటుంది. అలాంటప్పుడు డాక్టర్‌కు చూపి మందులు వాడడంతో నయమైపోతుంది. కొన్నాళ్ళకు యథాప్రకారం మళ్ళీ అదే జలుబు పట్టుకుంటుంది. ఇలా ఎందువల్ల వస్తుంది? నయం చేయడం ఎలా? చెప్పగలరు.

రెండేళ్ళప్రాయంలో వున్న పాపకు తరచూ రొమ్ము పడిశం రావడానికి ముఖ్యమైన కారణం ప్రైమరీ కాంప్లెక్స్; ఆస్త్మాటిక్ బ్రోంకైటిస్; ఈసినోఫీలియా బ్రోంకైటిస్; కడుపులో నులిపురుగులు చేరడం-వీటిలో ఏదైనా కావచ్చు. అంచేత మీరు శిశువైద్య నిపుణుని సంప్రదించి వైద్యపరిశోధనచేసి మందులు ఇప్పించినట్లయితే ఇది తప్పకుండా నయమైపోతుంది. అయితే ఓర్పుగా మందులు ఇప్పించడం ఎంతైనా అవసరం.

శ్రీమతి ఎ.

నా వయసు ముప్పై తొమ్మిది సంవత్సరాలు. ఐదుగురు పిల్లలు. ఋతుస్రావం సక్రమంగానే అవుతోంది. కాని అయిన పదిహేనో రోజు నుంచి శరీరం భారంగానూ, వక్షోజాలు బిగుసుకుపోయి బాధ వేస్తాయి. ఇరవైయ్యో రోజునుంచి కడుపంతా కలియబెట్టినట్లు వాంతు లవుతాయి. బొడ్డుకు దిగువ వుండుండి బాధపుడుతుంది. దయచేసి దీనికి నివారణోపాయం చెప్పగలరు.

గర్భాశయం సమీపంలో పుండు ఏర్పడడమే దీనికి ముఖ్యకారణం కావచ్చు. అంచేత ఆలస్యం చేయకుండా వైద్యుని సంప్రదించి గర్భాశయపరీక్ష చేసుకుని. మందులు వాడండి.

కుమారి పి.

నా వయసు పందొమ్మిది సంవత్సరాలు. సక్రమంగానే ఋతుస్రావం జరుగుతుంది. కాని గర్భాశయ ద్వారం గుండా తరచు గాలిపోతూ వుంటుంది. ఇది ఎందువల్ల జరుగుతుంది? దీనిని ఆపడం ఎలా? దయచేసి చెప్పగలరు.

కడుపులో పురుగులు, క్రిములు చేరడం వల్ల ఇలా గాలిపోతూ వుండవచ్చు. మలపరీక్ష చేసుకుని తగిన చికిత్స పొందితే నయమైపోతుంది.

జి. ఎన్.

మా ఆయన వయసు నలభై సంవత్సరాలు. ఆయనకు పదేళ్ళ క్రితం 'టి. బి. మెనింగిటిస్' వచ్చి ముప్పైమూడు రోజులు స్పృహ లేకుండా పోయింది. ప్రభుత్వ ఆస్పత్రిలో చేర్చాము. ఆ సమయంలో కుడిచేయి, కాలు స్పర్శజ్ఞానం కోల్పోయాయి. ఏభై స్ట్రెప్టోమైసిన్ ఇంజక్షన్లు, ఐ. న్. హెచ్. మాత్రలూ వాడాము. పూర్తిగా నయమైపోయింది. అయితే అదే జబ్బు 1972 లో మళ్ళీ వచ్చింది. ఎంత చికిత్స చేసినా పూర్తిగా కోలుకోలేకపోయారు. ప్రస్తుతం ఆయన

### లోకజ్ఞానం – సమాధానాలు

1. సుమేరియన్. క్రీస్తు పూర్వం 3300 సంవత్సరం నాటికే సుమేరియన్ భాష, లిపి ఆచరణలో వున్నాయి.
2. ట్రిగ్వేలీ. నార్వే దేశస్థుడైన ఈయన 1946 - '53 మధ్య ఆ పదవిని నిర్వహించారు.
3. ముద్రణా యంత్రం.
4. జె. ఇ. లున్‌డ్‌స్ట్రన్. స్వీడన్ దేశస్థుడైన ఈయన 1855 లో అగ్గిపుల్లలని కనిపెట్టాడు.
5. నిప్పన్. అంటే జపాను వారి భాషలో 'ఉదయిస్తున్న సూర్యుడు' అని అర్థం.
6. సోవియట్ రష్యాకు చెందిన వ్లాడిమిర్ ల్యాఖోవ్, వాలరీ రైయుమిన్. ఫిబ్రవరి 25, 1979 న బయల్దేరిన సోయూజ్ - 34 అనే అంతరిక్షనౌకలో వీరు 175 రోజులపాటు అంతరిక్షయానం చేసి ఇటీవలనే భూమికి తిరిగి వచ్చారు.
7. 1913 లో. "గీతాంజలి" కావ్యానికి.
8. ఈల్ అనే చేప.
9. సెప్టెంబర్ 1, 1858. విక్టోరియా మహారాణి ఇంగ్లండుని పరిపాలిస్తున్న కాలంలో
10. గుల్జారీలాల్ నందా. పండిట్ జవహర్లాల్ నెహ్రూ, లాల్‌బహదూర్‌శాస్త్రిల అకాల మరణాల తర్వాత రెండుసార్లు ఆయన తాత్కాలిక ప్రధానిగా నియమింపబడ్డారు. రెండుసార్లు కలిపి మొత్తం 25 రోజుల పాటు ఆయన ఆ పదవిని నిర్వహించారు.

మాటలలో స్పష్టత వుండడం లేదు. చదివింది జ్ఞాపకం వుండటం లేదు. దీనిని బాగు చేయడం ఎలా ? దయచేసి చెప్పగలరు.

టి. బి. మెనింగిటిస్ వచ్చినవారు కనీసం రెండేళ్ల వరకైనా వదలకుండా చికిత్సపొందాలి. డాక్టర్‌ను సంప్రదించకుండా మధ్యలోనే మందులు ఆపి వేయడం వల్లనే మీ ఆయనకు ఈ ప్రమాదం జరిగింది. శరీరబలహీనత ఏర్పడింది. ఆయన కోలుకోవాలంటే మీరు జాగ్రత్తగా సహకరించాలి. భోజనంలో గ్రుడ్లు, చేపలు లాంటి మాంసాహారం బాగా చేర్చుకోడం మంచిది. రోజూ సూప్ ఇవ్వండి. ప్రతిరోజూ కొంతదూరం నడిపించి తీసుకురావడం చాలా అవసరం.

జ. యస్.

మా పాప ఒకటిన్నర సంవత్సర ప్రాయంలో వేక్సినేషన్ వేయించినప్పుడు ఆరు దినాల కల్లా మితిమించిన జ్వరంతోపాటు విరేచనాలు కాసాగాయి. రెండు రోజుల తర్వాత ఫిట్స్ ప్రారంభమయ్యాయి. ఆస్పత్రికి తీసుకెళ్ళి చూపాము. వైద్య పరిశోధనల తర్వాత ఎన్సెఫెలిటిస్ జబ్బు అని రెండు నెలలపాటు చికిత్స చేశారు. ఇది పూర్తిగా నయం కావడానికి మరి కొంత కాలం పడుతుందని పంపివేశారు. డాక్టర్ సలహా మేరకు ఆరేళ్ళ ప్రాయం వరకు మందులు ఇప్పించి ఆ తర్వాత ఆపివేశాము. కొన్ని వ్యాయామాలు చేయడం వల్ల కాళ్లు చేతులు ఆరోగ్య స్థితికి రాగలవని చెప్పారు. ఇప్పుడు పన్నెండేళ్లు నిండాయి. వయసూ వచ్చింది. అయితే ఇతరుల సాయం లేకుండా ఏ పనీ చేసుకోలేని స్థితిలో వుంది. లేచి కూర్చోడం కూడా ఎంతో శ్రమపడి చేస్తుంది. కాళ్లు చేతులు చాలా బలహీనంగా వున్నాయి. ఇది నయం కావడానికి మార్గం వుందంటారా ?

పోస్ట్ ఎన్సెఫాలటిక్ సీక్వెల్ అనబడే మెదడు జ్వరంతో మీ పాప బాధపడుతోంది. క్రమం తప్పకుండా చికిత్స కొనసాగించడం వల్ల; ఫిజియోథిరాపీ, వొకేషనల్ ట్రెనింగ్ మొదలైన శిక్షణల ద్వారా ఆమె భవిష్యత్తును కొంత వరకు ఆశాజనకం చేయవచ్చు. ఐతే, ఇలాంటి జబ్బులను శాశ్వతంగా నయం చేయడం కష్టమే. మీరు ఓర్పుతో జాగ్రత్తగా శ్రద్ధగా ప్రయత్నించినట్లయితే రానురాను కొంత అభివృద్ధిని సాధించవచ్చు. □



## వి. కోటేశ్వరమ్మ

ఆంధ్రదేశంలో మాంటిసోరి విద్యా సంస్థల పేరు వినని వారంటూ ఉండరు. 10 మంది పిల్లలతో చిన్న సంస్థగా ప్రారంభమైన మాంటిసోరి స్కూలు ఈ రోజున 4000 మంది పిల్లలతో రాష్ట్రంలోని ప్రధాన విద్యా సంస్థలలో ఒకటిగా భాసిస్తున్నది. ఈనాడు ఈ సంస్థ మహిళల కళాశాలగా అభివృద్ధి చెంది 2000 మంది విద్యార్థినులతో అగ్రగామిగా ఉంది. కె. జి. (కిండర్ గార్టెన్) నుండి పి. జి. (పోస్టు గ్రాడ్యుయేషన్) వరకు ఒకే విద్యాసంస్థలో నదుపాయాలు ఉండటం అరుదు. కె. జి. లో చేరిన బాలిక పోస్టు గ్రాడ్యుయేట్ డిగ్రీ తీసుకుని ఈ విద్యాసంస్థ నుండి వెళ్ళవచ్చు. విజయవాడలో ఈ సంస్థ ఇంత అభివృద్ధి చెందడానికి మూల కారకురాలు శ్రీమతి వి. కోటేశ్వరమ్మ.

మాంటిసోరి మహిళా కళాశాల ప్రిన్సిపాల్‌గా ఉన్న శ్రీమతి కోటేశ్వరమ్మ జాతీయ బహుమతి గ్రహీత.

1925 మార్చి 5న జన్మించిన ఆమె సైన్సులో పట్టా పుచ్చుకుని, తెలుగు సాహిత్యంలో ఎం. ఏ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులైనారు. కళాశాల లెక్చరర్, అనేక పాఠ్య గ్రంథాలను రచించిన శ్రీ వి. వి. కృష్ణారావుతో ఆమెకు వివాహం అయింది. ఒక కుమారుడు, ఇద్దరు కుమార్తెలు వారి సంతానం.

శ్రీమతి కోటేశ్వరమ్మ వెల్లూరు కస్తూరిదేవి గరల్స్ హైస్కూలులో బి. ఇడి అసిస్టెంట్‌గా చేరి, పటమట పరిషత్ స్కూలులో 1½ సంవత్సరాలు పని చేశారు. తర్వాత స్వంతంగా జర్మన్ విద్యావేత్త మేరియా మాంటిసోరి పేరిట నర్సరీ స్కూలును ప్రారంభించారు. ఆమె విద్యారంగానికి చేసిన సేవలకు ప్రశంసగా కేంద్ర ప్రభుత్వం 1971-72 సంవత్సరంలో జాతీయ స్థాయిలో ఉత్తమ ఉపాధ్యాయురాలిగా ఎన్నికచేసి గౌరవించింది.

ఈ రోజున మాంటిసోరి విద్యా సంస్థలకు రు. 35 లక్షలు విలువజేసే చక్కని భవనాలు, హాస్టల్, ఆడిటోరియం, క్రీడాస్థలం, లైబ్రరీ, బోధన సామగ్రి లేబొరేటరీలు ఉన్నవి. నర్సరీ పిల్లలకు లక్ష రూపాయలు విలువచేసే పుస్తకాలు, బొమ్మలు లైబ్రరీ ఉన్నవి. లలిత కళల విభాగంలో శాస్త్రీయ సంగీతం, నృత్యం, మృదంగం బోధిస్తున్నారు.

కళాశాలలో టైప్‌రైటింగ్, షార్ట్‌హాండ్, హోం సైన్సు తరగతులున్నవి. ఇవికాక డిగ్రీ, ఇంటర్మీడియట్, ఎం. ఏ తరగతులు-తెలుగు, ఇంగ్లీషు మీడియంలో నిర్వహిస్తున్నారు.

సంఘ సేవకురాలిగా కూడా శ్రీమతి కోటేశ్వరమ్మ ఎన్నో సేవా కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఆకాశవాణి విద్యార్థుల కార్యక్రమాల కమిటీ, సెకండరీ విద్యా బోర్డులలో ఆమె సభ్యురాలు. బాల నేరస్థుల కోర్టుకు ఆమె గౌరవ మేజిస్ట్రేటుగా ఉన్నారు. నాగార్జున విశ్వవిద్యాలయం ఆమెను సెనెట్ సభ్యురాలిగా ఎన్నుకున్నది. 'లూయీ పాశ్చర్', 'శ్రీమతి ఇందిరాగాంధీ', 'భారతదేశంలో స్త్రీ విద్య', 'స్త్రీలు, వృత్తులు, వ్యాపకాలు', 'పిల్లలు-మంచీ చెడు' మొదలైన పుస్తకాలు తెలుగులో ఆమె రాశారు.

"ఎంతోమంది ఎన్నో కలలు కంటారు. ఆ కలలు ఎందరికి నిజమవుతాయి ? కె. జి. నుండి పి. జి. వరకు విద్యనిచ్చే సంస్థను నెలకొల్పాలనుకున్న నేను కన్న కల నిజమయింది. ఇంతకంటే జీవితంలో సాధించవలసింది ఏముంది ?" అని ఆమె ఎంతో సంతోషంగా చెప్పారు.

—వై. రత్నమాల

# చిట్టి కథ

"స్సార్ ! ఈ లెటర్ని మా అక్క మీకిమ్మంది."

చేతిలో వున్న ఏదో డిటెక్టివ్ నవల్లోంచి ఓ అందమైన గులాబీ రంగు కాగితాన్ని ఇటూ అటూ భయంగా చూస్తూ దొంగచాటుగా తీసి యిచ్చి, వచ్చినంత హడావుడిగానూ చెప్పాడా అబ్బాయి. సుమారు పద్నాలుగు, పదిహేనేళ్ళుండవచ్చు ఆ అబ్బాయికి!

"అక్కా ! అంటే....?" ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు ప్రతాప్.

"అదిగో....ఆ ఎదురు డాబాలో వుంటూందే.... ఆమె !"

"! నిజంగా !" వెంటనే ప్రతాప్ కళ్ళు మెరిశాయి....చేతులు ఆత్రంగా అందుకున్నాయా లేఖను. తన పని ముగించి, దొంగచాటుగానే కనుమరుగయ్యాడా అబ్బాయి తన బాధ్యత అంతటితో తీరినట్టుగా !

చెట్టు చాటుకుపోయి ఓసారా లెటర్ని ముద్దు పెట్టుకుంటూ, పదిలంగా దాన్ని విప్పాడు ప్రతాప్.

"డియర్ !

మీరెవరో నాకు తెలియదు. కాని, మీరు మా యింటి ఎదురుగా ఉన్న చెట్టుక్రింద క్రమం తప్పకుండా నిల్చోవడం మొదలెట్టిన తొలినాడే నా మనసు మీ వశమైంది. కాని మీ ఊరు, పేరులు తెలియవు నాకు. మన ప్రేమ ఫలించే మార్గాన్ని మీరే ఆలోచించండి. ఇంతకుమించి నేనేం చేయగలనో నా కర్థం కావడంలేదు.

ఇట్లు,

మీ ఎదురుడాబా అమ్మాయి."

పేరు తెలియజేయని ఆ అమ్మాయి గడుసుతనానికి నవ్వుకుంటూ, లేఖలోని అక్షరాలు అందంగా లేకున్నా ఆ అమ్మాయి అందచందాలతో ఆ లోటును సరిపుచ్చుకుంటూ, లేఖలోని ప్రేమామృతాన్ని పదేపదే గ్రోలుతూ మురిసిపోయాడతను.

కొద్ది క్షణాల అనంతరం తన కర్తవ్యం గుర్తు వచ్చి, వెంటనే రూమ్‌కి చేరుకొని, ఓ పాతిక కాగితాలు తగలేసి, ఇరవై ఆరో కాగితంలో కాబోలు తన లేఖను వ్రాయగలిగా డిలా....

"డియర్ ఎదురుడాబా అమ్మాయికి !

రేపు సాయంత్రం అయిదున్నర గంటకు 'ఫలానా' పార్కుకి వస్తారని వేయి కళ్ళతో.... ఎదురుచూస్తుంటా !

మీ....

చెట్టుక్రింది అబ్బాయి."

మర్నాడు ఉదయం అదే చోట చేరి అదే అబ్బాయి కనిపించేంతవరకూ చూసి, ఆ లెటర్ని అందజేసాడు ప్రతాప్.

మర్నాడు సాయంత్రం అయిదున్నరకు వేయి కళ్లున్న డిజైన్ గల షర్ట్ వేసుకుని మరీ ట్రిమ్‌గా తయారై పార్కుకి వచ్చిన ప్రతాప్ ఊహకు విరుద్ధంగా....అక్కడ ఎదురుడాబా అమ్మాయి వలపు చూపుల బదులుగా, నలుగురు దుష్టపాత్రధారుల్లాంటి దుడ్డుకర్ర ధారులు ఎదురై ప్రతాప్ శౌర్య ప్రతాపాలను పరీక్షింపబోవటంతో, విస్మితుడయ్యాడు ప్రతాప్.

రెండ్రోజులు పోయాక, ఒంటినిండా గాయాలతో, వాటికి కట్టిన కట్లతో....గ్రహాంతర యాత్రికుడిలా హాస్పిటల్ నుండి వస్తూ ఆ డాబా దాటుతూండగా ఆ అబ్బాయి మళ్లీ ఎదురయ్యాడు అతడికి. అతడ్ని చూసి సందేహంగా ఓ క్షణం ఆగిన ప్రతాప్‌కి మరో లేఖ నందించాడా అబ్బాయి.

విప్పి అక్కడి కక్కడే చదివాడు ప్రతాప్.

"ఎలా వుంది సార్ ఒళ్లు? క్షమించాలి ! నాకు అక్కలు అస్సలు లేరు. ఆ ఎదురుడాబా ప్రక్క పెంకుటిల్లు మాది ! ప్రక్కింటి అమ్మాయి కోసం ప్రతిరోజూ మీ 'చెట్టుక్రింది పాట్లు' చూస్తూంటా ! నాకు డిటెక్టివ్ కథలన్నా, అందులోని 'త్రిల్స్' అన్నా చెప్పలేని యిష్టం. మీరు ప్రతిరోజూ వూరికే అలా చెట్టుక్రింద పడిగాపులు కాయటం నాకేం 'త్రిల్' అనిపించటంలేదు. మొన్న నేనే వ్రాసిన లెటరుకు మీ సమాధానం అందంగానే ఆ అమ్మాయి వాళ్ళ నాన్నగారికి మీ లెటర్ని పదిలంగా అందజేయగలిగాను. ఇంతే సంగతులు. సారీ....!" అని వుందందులో.

తిరిగి చూసిన ప్రతాప్‌కి చుట్టు ప్రక్కల ఆ అబ్బాయి జాడ కనిపించలేదు.

—ఎస్. వి. రమాదేవి



# బామ్మగారి పేజీ

ఏమర్రా!

వెనకటికో కథ వుంది – జ్ఞాపకం వచ్చింది. ఓ బ్రాహ్మడు ఒకరింటికి విందుకి వెళ్ళి, సుష్టిగా భోంచేశాట్ట. భోజనం అంటే ఏమిటి - తన కడుపు పట్టేటంత మేరా, ఏ మాత్రం ఖాళీ వుంచకుండా పూర్తిగా పట్టేశాడన్నమాట. పాపం, వంటకాలన్నీ రుచికరంగా వుండి వుంటాయిమరి! అదిగో, అలా కడుపు నిండా నెయ్యి, బూర్లు, గార్లు, బొబ్బట్లు - ఎన్నో తినేశాడు - ఆయాసం వచ్చేసింది. లోపలికి వెళ్ళిన పదార్థాలు జీర్ణం కావడానికి చోటేదీ? దాంతో అరుగు మీద పడుకుని, 'అబ్బ' 'ఇస్సూ' అంటూ, దొర్లుతూ తెగ ఆయాసపడుతున్నాడు. ఆ ఇంటావిడ బయటికి వచ్చి అతని అవస్థ చూసి, జాలిపడి, "చాలా ఆయాస పడుతున్నార్లా వుంది. నాలుగు వాము గింజలు ఇస్తాను. నమిలి మింగండి" అంది. దానికి అతను ఏమన్నాడో తెలుస్రా - "అమ్మా! వాముగింజలు వెళ్ళేంత స్థలమేగనక వుంటే, మరో రెండు బొబ్బట్లు పట్టేయనా"–అని మూలిగాట్ట! చూశారా - అలా కడుపునిండా - అని కాకుండా, కడుపు ప్రమాణం దాటి తింటే ఏమవుతుంది?– ఆయాసం, అజీర్ణం మంటలలా వుంచండి! అదెంత పోని? ఎంత ప్రమాదం? ప్రాణానికే ముప్పు రావచ్చునే. అందుకనే అంటారు - మనవాళ్ళు– 'ఆకలికి అన్నం తినాలి' అని. అంటే, ఆకలి తీర్చుకోడానికి తినాలిగాని, తింటున్నంతసేపూ ఇష్టమైన వంటకాలు బాగుంటాయి కాబట్టి జిహ్వ కట్టుకోలేక తెగతినకూడదు - అని!

మరోటుందర్రా - మనవాళ్ళు వడ్డించేటప్పుడు కూడా, తింటున్నారుగదా అని తెగ వడ్డించేస్తూ వుంటారు. 'వడ్డించారు గదా, పారేయకూడదు' అని, తినేవాళ్ళు తింటూవుంటారు. ఇది ఇలా పోతూవుంటే, ఎప్పటికి తెముల్తుంది? 'మొహమాట పడకండి, తినండి' అని పదిసార్లు అడిగి వెయ్యడం, అవతలివాళ్ళు తింటూవుంటే ఆనందించడం, తృప్తిపడడం - గొప్ప విషయమే. ఇంటికొచ్చిన వాళ్ళకి కడుపునిండా అన్నం పెట్టాల్సిందే. కాని, మరి దానికీ ఒక మితి లేదూ! 'నిదానంగా భోంచేయండి' 'సావకాశంగా తినండి' అంటే గొంతులో వేలు పెడితే, తిన్నది వేలుకు అందేంత వరకూ కాదు. అవసరమైనంతవరకే తినాలి. మనవాళ్ళు ఏమన్నారంటే, రెండుపాళ్ల నీళ్ళు లేదా తక్కిన ద్రవ పదార్థాలు, ఒక పాలు గట్టి పదార్థాలతో కడుపు నింపుకుని, తక్కిన భాగాన్ని వాయు సంచారానికి వదిలిపెట్టాలన్నారు. అలా అయితే, తిన్నది జీర్ణం అవుతుంది; ఒంటా పడుతుంది.

ఐనా మరి, ఒకవేళ తప్పో జారో పొరపాటునో, కావాలనో ఇష్టం వచ్చినట్టుగా తినేశాం అనుకోండి- ఇందాక చెప్పిన బ్రాహ్మడిలా అవస్థ పడుతున్నారనుకోండి - అప్పుడేం చెయ్యాలి?

ఎన్నో విరుగుడులు వున్నాయనుకోండి. కనీసం అందుబాటులో ఇంట్లో ఎప్పుడూ వామూ, జీలకర్ర, శొంఠి ఇలాంటివి వుంచుకోవాలి. ఆ ఇంటావిడ చెప్పినట్టు వాము పది పదిహేను గింజలు నమిలితే, ఆ ఆయాసపు బాధ కొంతవరకు తగ్గుతుంది. అంతే కాదర్రా - వాము కడుపులోని చాలా రోగాల్ని హరించేస్తుంది. దానికి ఎలాంటి గుణం వుందంటేనుట - ఏ రూపంలో మీరు వాము తీసుకున్నా, అది లోపలికి వెళ్ళి-క్రిముల్ని వెదికి వెదికి, పట్టి–చంపుతుందట. కడుపు ఉబ్బడం, అజీర్ణం, వాయువు చేరడం, శ్లేష్మం చేరడం - ఇలాంటి వాటన్నింటికీ వాము పనిచేస్తుంది.

'అజీర్ణపురోగికి ఆకలెక్కువ' అని సామెత. సామెతేమిటి, ఈ మాట నిజమే. ఓ పక్క– అజీర్ణంతో బాధపడుతున్నా, మరోపక్క– అవీ ఇవీ తినాలనిపిస్తూ వుంటుంది. అలాంటప్పుడు, అన్నం తినేముందు మొదటి ముద్దలో ఇంత వాము కలుపుకుని, అంటే కాస్త వాము గరిటలో నూనె వేసి, వేచి తినాలి. అలా, మూడు నాలుగు రోజులు తింటేచాలు. అజీర్ణం హరిస్తుంది. మరీ అజీర్ణం ఎక్కువగా వుందనుకోండి, లేదా అజీర్ణం వల్ల విరేచనాలు కూడా అవుతున్నాయనుకోండి, అప్పుడు కొద్దిగా శొంఠి, కొద్దిగా వాము కలిపి మెత్తగా నూరి, వేడినీళ్ళతో వేసుకోవాలి. వాము, శొంఠి రెండింటికీ వేడి చేసే గుణాలున్నాయనుకోండి. అయినా, రెండు మూడు పూటలు తీసుకుంటే అజీర్ణమూ తగ్గుతుంది; ఆ విరేచనాలూ కడతాయి. ఇలా వాము ఎన్నో మేళ్ళు చేస్తుంది. అందుకనే ఆయుర్వేద వైద్యంలో వాము బాగా వాడతారు.

ఐందా—

మొన్న మా మనవరాలు, కాలేజీ చదువు కొచ్చింది లెండి. అడిగిందీ – "బామ్మా బామ్మా! శొంఠి ఎలా పుడుతుంది? ఏ చెట్టుకి కాస్తుందీ?" అని. 'ఓ సి నీ చదువు బంగారంగానూ' అనిపించింది నాకు. "అది నీ తప్పు కాదులే....నీ చదువులూ నీ పెంపకం అలా వున్నాయి" అన్నాను. అలా–శొంఠి గురించి చాలామందికి తెలియదు.

శొంఠి తొలి రూపం అల్లం. అల్లమే శొంఠి అవుతుంది. అల్లాన్ని బాగా ఉడికించి, తర్వాత ఎండ బెడతారు. అదే శొంఠి. ఎన్నాళ్ళయినా శొంఠి చెడిపోకుండా అలాగే వుంటుంది. ఈ శొంఠి కూడా వాములాగే ఎన్నో మేళ్ళు చేస్తుంది. అజీర్ణంగా వున్నా, ఆకలి లేనట్టుగా వున్నా, కొద్దిగా శొంఠిపొడి, ఉప్పు కలిపి మొదటి ముద్దతో అన్నం తింటే, ఆకలి పుడుతుంది. అజీర్ణం తగ్గుతుంది. ముఖ్యంగా కడుపులో వాయువులు చేరితే, శొంఠి ఎంతో మంచి పని చేస్తుంది. ఏ కషాయం చేసుకోవాలన్నా, శొంఠి లేకుండా వుండదు. కొందరు 'శొంఠి కాఫీ' అని చేసుకుంటారు. మీరు తాగారో లేదో! మామూలుగా వేడి పాలలో పంచదార కలిపి, అందులో శొంఠి పొడి కలుపుకుని తాగడం అన్న మాట! ఇది చాలా మంచిపని చేస్తుంది. చాలామంది, 'శొంఠి నీరు' తాగుతారు. ముఖ్యంగా మలయాళ దేశంలో. మరుగుతున్న నీళ్ళలో శొంఠి పొడి వేసి కాస్సేపు కాచుతారు. చల్లారిన తర్వాత ఆ నీళ్ళు తాగుతారు. కొందరు జీలకర్ర పొడి కూడా వేస్తారు. దీనివల్ల తిన్నది సులభంగా జీర్ణం అవుతుందని ఒకటి – నీటిలో ఏవైనా దోషాలుంటే పోతాయని ఒకటీ. మొత్తానికి శొంఠి కూడా ఉదర రోగాలన్నిటినీ హరిస్తుంది.

ఈ వాము, శొంఠీ చేసే మేళ్ళు ఇవే కాకుండా ఇంకా ఎన్నో వున్నాయనుకోండి. నేను మామూలుగా వచ్చే వ్యాధులు—వీటితో సులభంగా ఎలా నయం అవుతాయో చెప్పాను. అజీర్ణ రోగాలను పోగొట్టడానికి ఇంకా ఎన్నో వస్తువులున్నాయి. అయినా, సులభంగానూ చవకగానూ దొరికే ఈ వస్తువులు అందుబాటులో వుంచుకోడంలో తప్పేముంది?—సాధారణంగా అందరిళ్ళలోనూ వుంటాయనుకోండి. లేకపోయినా, కొనిపెట్టుకోడంలో పెద్ద ఖర్చేం వుండదు. ఇలాంటి వ్యాధులకి అనవసరంగా డాక్టర్ల దగ్గరకి పరుగెత్తి మందులూ మాత్రలూ తీసుకోడం కంటె, ఇది ఎంతో నయం కాదూ! అయినా "అడుసు తొక్కడం ఎందుకు- కాళ్ల కడగడం ఎందుకు"–అని, ముందు చెప్పిన బ్రాహ్మడిలా మితిమీరి తినడం ఎందుకు – అజీర్ణ రోగం తెచ్చుకోడం ఎందుకు?—వ్యాధి వచ్చిన తర్వాత మందులు తీసుకోడం కంటె, వ్యాధి రాకుండా చేసుకోడం నయం కాదూ! □

# శీలరక్షిణి



"నేను గ్రామాంతరం వెళ్తున్నాను గదా-నా భార్య ఒంటరిగా వుంటుంది గదా - అలాంటప్పుడు దుండగులు లాంటి వాళ్లెవరైనా వచ్చి, నా భార్య శీలాన్ని చెడగొడితే ? – అప్పుడు గతేమిటి ? జరిగిపోయిన తర్వాత విచారించి లాభం ఏమిటి ? అందుకు అలాంటిది జరగకుండా ముందుగా ఓ పథకం ఆలోచిస్తే ? -" అని దీర్ఘంగా ఆలోచించాడు-11 - 12 శతాబ్దాల కాలంనాటి మనిషి. అతనికో ఆలోచన తట్టింది-నడుంకి కట్టుకునే ఒడ్డాణం లాంటి 'ఇనప' ఆభరణం చేయించి, భార్యకి తొడిగి, అది విడదీయడానికి రాకుండా తాళం కూడా వేసేసి, తాళం చెవులు తనతో తీసుకెళ్ళాడు....అలా 'శీల రక్షణి'

❋

**'చేస్టిటీ బెల్ట్స్' పేరుతో**
**వ్యవహరించబడే ఇనపకచ్చడాలు**
**ఇంకా కొన్ని దేశాల్లోని ప్రాంతాల్లో**
**అమల్లో వున్నాయా ?**
**ఈ 'అమానుషచర్య'ను ఎవరూ**
**గర్హించడం లేదా ?**

❋

(Chastity Belt) ఉదయించి వుండాలని ఒక కథనం.

మరో కథనం—

"ఏమండీ, మీరు పరదేశం వెళ్తున్నారు. ఇక్కడంతా రౌడీమూక. నా మానానికి భంగం తలపెడితే, నేనేం చెయ్యగలను ? ప్రాణం కంటె మానం గొప్పది గదా. మరి దాన్ని కాపాడ్డానికి నేనొక సూచన చెబుతాను. అలా చేయించి, నాకు తొడిగి మీరు వెళ్ళిపోండి. పోతే నా ప్రాణం పోతుందిగాని, మానం మాత్రం పోదు" అని ఒక 'పతివ్రత' సలహా యిచ్చినట్టూ, ఆ సలహా ప్రకారం ఆ భర్త 'శీలరక్షణి' వేయించినట్టూ.

ఆ శతాబ్దాల కాలంలోనే యూరప్ దేశంలోని కొందరు స్త్రీలు 'విచ్చలవిడి'గా తిరిగేవారనీ-వాళ్ళు అలా ప్రవర్తించకుండా 'శీలరక్షణి' ముందుగా అక్కడ ఆరంభమైందనీ ఇంకో కథ. అంతకుముందు ఆ స్త్రీలు తప్పుగా ప్రవర్తించినట్టుగా అనుమానం కలిగితే, వాళ్లకి 'అగ్నిపరీక్ష' పెట్టేవారుట. ఆ పరీక్షలో వాళ్ళు నెగ్గలేకపోతే, బహిరంగంగా వాళ్లను 'సజీవ దహనం' చేసేవారుట. ఈ విధానం మరీ 'దారుణం'గా వుందని వాళ్ళే తెలుసుకున్నారు కాబోలు, అలా జరగకుండా— ముందు జాగ్రత్తల కోసం అని 'శీల రక్షణి'ని తొడగడం ఆరంభించి వుండాలి.

ఏమైనా, ఈ విధానం ముందుగా ఏ దేశంలో వుండేది ? ఏ కాలంలో వుండేది ? - అనేది ఇదమిత్థంగా తేల్చి చెప్పడం కష్టం.

పౌరాణిక యుగంలో ఈ విధానం లేదు. ఎంచేతంటే మన పురాణాల్లో ఎక్కడా అలాంటి విషయం ప్రస్తావించబడలేదు. వెయ్యి సంవత్సరాల కిందట కూడా లేదనడానికి మరో ప్రమాణం-వాత్సాయనుడి 'కామ సూత్రాలు'లో ఎక్కడా దీని విషయం లేకపోవడం ! వాత్సాయనుడు వెయ్యేళ్ల కిందట 'కామ సూత్రాలు' రాశాడు. పర్షియా, చైనావారి సాహిత్యంలో కూడా 'శీలరక్షణి' విషయం ప్రస్తావించబడలేదు.

వీటన్నిటిని బట్టీ చూస్తే - ఈ విధానం 11, 12 శతాబ్దాల మధ్యకాలంలో ఎప్పుడో ఆరంభమై వుండొచ్చు. అయితే, ఏ దేశం ముందుగా ఆరంభించిందీ కూడా సరిగ్గా తెలీదు.

ఈ 'అమానుషమైన విధానం' మనదేశానికి అంతగా దిగుమతి కాలేదుగాని, బ్రిటన్, అమెరికా, ఘోరమైనదనీ - సంఘ సంస్కర్తలు నచ్చజెప్పి సహగమనాన్ని మానిపించారు. అలాంటిది, ఇంకా ఈ 'శీలరక్షణి' అనబడే, ఇనప కచ్చడాల ధారణ నుంచి కొన్నిదేశాలు బయటపడలేదంటే, ఆశ్చర్యంగానే వుంటుంది !

ఆ రోజుల్లో—

ఈ బెల్టులన్నీ ఒకే రూపంలో వుండేవి కావు. ఒక్కొక్క దేశం ఒక్కో విధానాన్ని అనుసరించేది. కొందరైతే ఆభరణాల్లాగా అందంగా, పైన

ఇంకా ఈ విధానం కొన్నిచోట్ల అమల్లో వున్నదని వింటున్నప్పుడు, ఎవరికైనా బాధగానే వుంటుంది. స్త్రీ పురుష సమానతలు, హక్కులు, 'విమెన్స్ లిబ్' 'వనితా దశాబ్దం' మొదలైన మాటలు చెప్పే ఈ ప్రపంచమేనా, ఇలాంటి కృత్యాలు చేస్తున్నది ? – అనిపిస్తుంది. కొంత కాలం వరకూ మనదేశంలో 'సతీ సహగమనం' వుండేది. పురుషుడు చనిపోతే, అతని భార్య కూడా అతనితోపాటు ఆ చితిలోపడి కాలి బూడిదై పోవలసిందే ! 'తాను చితిలో దూకను' అని పట్టుబడితే, పెద్దలే బలవంతంగా ఆమెను నెట్టేసేవారు. ఇది ఎంతో అమానుషమైనదనీ, సజీవదహనం మహా

గ్రీక్, ఇటలీ, స్పెయిన్ దేశాల్లో బాగా వాడుకలో వుండేది.

ఇప్పటికీ ఈ విధానం ఇంకా కొన్ని దేశాల్లో అమలులో వుందిట. ఇంగ్లండ్ దేశంలోని ఒక కంపెనీ, ఈ 'బెల్ట్స్'ను తయారు చేస్తాం దనీ, వాటికోసం ఇతరదేశాల నుంచి కూడా రోజూ ఎన్నో ఆర్డర్లు వస్తుంటాయనీ చెప్పు కుంటారు. (చిత్రంలో చూస్తే, అర్థం అవుతుంది) లతలు, పువ్వులూ మొదలైన డిజైన్లువేసి చేయించే వారుట - బిగించుకునే వాళ్ళు ముచ్చట పడతారని కాబోలు! ఉత్తర ఇటలీ దేశం కళాత్మకమైన వస్తువులు తయారు చెయ్యడానికి పేరు పొందింది. ఈ 'చేస్టిటీ బెల్ట్'లు కళాత్మకంగా తయారు కావడం ముందుగా అక్కడే మొదలైంది. మోడెనో యువ రాజు, అంతటి కళాత్మకమైన బెల్ట్‌నే తయారు చేయించి చార్లోటీ ఆగ్లేకు తొడిగాట్ట! అలాగే, ఫ్రాన్స్‌లో కింగ్ హెన్రీ-4, తన రాణి గాబ్రియలి డి ఎస్ట్రీస్‌కి - అతి కళాత్మకమైన 'రక్షణి'ని బహూ కరించాడుట. తాను యుద్ధానికి వెళ్ళినప్పుడల్లా ఆమె దాన్ని ధరించవలసిందిగా ఆయన కోరాడు(!)ట! అతని మీద తనకున్న ప్రేమవల్ల, ఆమె అలాగే చేసి, దాని తాళం చెవిని అతనికే ఇచ్చి వేసేదట!

ఆ రోజుల్లోని మరొక ఉదంతం: ఒక భర్త చీటికీ మాటికీ తను ఊరు వెళతానని చెప్పి, భార్యకు బెల్ట్ బిగించేవాడు. ఎక్కడో తిరిగొచ్చి 'ఊరు ప్రయాణం వాయిదా పడింది' అనేవాడు. అలా రోజూ ఆమెకు బెల్ట్ తగిలిస్తూ బాధ పెట్టేవాట్ట. రాత్రి పడక వేళకి మాత్రం తాళం తీసి, బెల్ట్ విప్పించేవాడట. అలా ఆమెను అతను చాలా నిర్దయగా, నవ్వుతూనే క్రూరంగా హింసించేవాడట. ఓసారి ఎక్కడి నుంచో వచ్చి, తాళం ఎక్కడో పోయిందని చెప్పి, చాలాసేపుగా ఆమెను ఏడిపించాట్ట. అది నిజమో, అబద్ధమో తెలీక, ఆ బాధ భరించలేక ఆమె అలాగే, ఆ 'బెల్ట్'తోనే మరణించిందిట! ఆ తర్వాత అతను లబోదిబో మన్నాడో, ఏమన్నాడో మనకి అనవసరం గాని, ఆ 'బెల్ట్'తో అతను భార్యతో 'ఆడుకోడం' మాత్రం చాలా బాధాకరమైనవిషయం. తమ మానసిక తృప్తికోసం, అలా చాలామంది 'బెల్ట్'లు బిగించి, ఆనందించేవారు.

నిజానికి, తన భర్త మీద ప్రేమ, అభిమానమూ వున్న ఏ స్త్రీకైనా ఇలాంటి 'రక్షణి' అవసరం వుందా? ఒకవేళ లేకపోతే - ఇలాంటి 'రక్షణి'లు వాళ్ళని కాపాడగలవా? - అదంతా ఏదో, ఆ మగ వాడి ఊహ, తృప్తీ. తన భర్తకి నిజంగా తన మీద ప్రేమలేదు - ఉంటే ఇలా 'బెల్ట్' బిగించి, తనని బాధించడు - అని తెలుసుకున్న కొందరు ఇల్లాళ్లు, అలాంటి భర్త మీద తనకి మాత్రం భక్తి, ప్రేమ ఎందుకని - అతను అటు వెళ్ళగానే ఆమె మారుతాళాలతో బెల్ట్ తీసేయించి - తన దారిన పోయేదిట.

అందుకేనేమో - యుద్ధాల్లో పాల్గొనే సైనికులే ముందుగా ఈ విధానాన్ని ప్రవేశపెట్టినట్టుగా ఈ 'బెల్ట్'ల చరిత్ర చెబుతుంది. భర్త బలవంతం చేతనో, తన ఇష్టపూర్వకంగానో ఇలాంటివి ధరించ డానికి ఆ స్త్రీలు అంగీకరించినా, తర్వాత తర్వాత చాలా బాధ పడేవారు. కాళ్ళు దగ్గరగా పెట్టుకోడా నికీ, సుఖంగా కూర్చోడానికీ, సరిగ్గా నడవడానికీ కూడా వీలులేని పరిస్థితుల్లో పడేవారు. అంచేతనే, భర్తలు అలా వెళ్ళిన తర్వాత, కొందరు కొందరు మారుతాళాలతో వాటిని తీసేసి, భర్త రాకకు ముందుగా తిరిగి వాటిని అమర్చుకునేవారుట! ఆ విషయం తెలుసుకున్న భర్తలు, తర్వాత తర్వాత తమ భార్యలను ఏ మిష మీదనైనా శిక్షించదలచుకుని, ఈ 'బెల్ట్స్' తొడిగి వెళ్ళిపోయేవారుట.

అయితే రాను రాను, ఈ విధానం తగ్గుతూనే వచ్చింది. మరి, అది స్త్రీల తిరుగుబాటువల్లనో,

# హేమలతాలవణం



విజయవాడలోని సుప్రసిద్ధ సంఘ సేవకురాలు శ్రీమతి హేమలతాలవణం పేరు వినని వారంటూ ఉండరు. దివిసీమ తుపాను బాధితులకు విశేష సేవచేసి ఆమె ప్రభుత్వం, ప్రజల ప్రశంసల నందుకున్నారు. శ్రీమతి హేమలత **1932**లో వినుకొండలో జన్మించారు. ఆమె తన తండ్రిగారైన ప్రసిద్ధ కవి శ్రీ గుర్రం జాషువా వద్ద సాహిత్యంలో పరిచయం సంపాదించుకున్నారు. గుంటూరు హైస్కూలులో విద్యాభ్యాసం చేసి, మద్రాసు క్వీన్‌మేరీస్ కాలేజి నుండి పట్టా తీసుకున్నారు. బి. ఎ. లో తెలుగులో ఆమె 'యూనివర్సిటీ ఫస్ట్' వచ్చారు.

నాస్తికోద్యమ నాయకులు శ్రీ గోరా పెద్ద కుమారుడు శ్రీలవణంతో **1960**లో సేవాగ్రాంలో ఆమెకు వివాహం జరిగింది. అప్పటి నుండి శ్రీ గోరాగారి కుటుంబ సభ్యులతోపాటు అనేక సాంఘిక కార్యక్రమాలలో ఆమె పాల్గొంటూ ఉన్నారు. నాస్తిక విధానాన్ని అనుసరిస్తూ, మనిషిని మనిషిగా గౌరవించి, ఆర్థిక, సాంఘిక గౌరవావకాశాలను యిచ్చేది 'నాస్తిక విధానం' ఒక్కటే అని ఆమె ప్రచారం చేస్తున్నారు.

సాంఘిక అసమానతలు తొలగించడానికి కులమత రహిత సమాజ నిర్మాణ కార్యక్రమాలు చేపట్టి, అస్పృశ్యతా నివారణకు కులాంతర, మతాంతర వివాహాలను ప్రోత్సహిస్తూ, వారు స్వయంగా ఎన్నో వివాహాలు జరిపించారు. రాష్ట్ర కుల నిర్మూలన సంఘానికి శ్రీమతి హేమలత ఉపాధ్యక్షులు.

స్త్రీ వ్యక్తిత్వాన్ని, సంపూర్ణ స్వేచ్ఛా గౌరవాలనూ పెంపొందించాలనే లక్ష్యంతో స్త్రీల సమస్యల పరిష్కారానికి ఆమె కృషి చేస్తున్నారు. 'నాస్తిక మార్గం' మాసపత్రిక సంపాదకులలో ఆమె ఒకరు.

ప్రస్తుతం తుపాను బాధిత ప్రాంతాలలో శ్రీమతి హేమలత మాతాశిశు సంరక్షణ కేంద్రాలను నడుపుతున్నారు. అంతర్జాతీయ మానవతావాదుల సంఘం ఆహ్వానంపై ఆమె భర్తతోపాటు ఇటీవల యూరప్, ఇంగ్లాండ్, అమెరికా దేశాలలో పర్యటించి వచ్చారు.

ప్రతి మనిషికి, ఆర్థిక, సాంఘిక గౌరవంతోపాటు సమాన అవకాశాలు లభించి, కూడు, గుడ్డ, వృత్తి ఉండాలనే ఆశయంతో ఆమె కృషి చేస్తున్నారు.

—మీరా

అయిష్టతవల్లనో, పురుషుల 'జాలి'వల్లనోగాని 'శీలరక్షిణి' బాగా తగ్గు ముఖం పట్టింది. పట్టినా కూడా, మళ్లీ కొన్నికొన్ని దేశల్లో కొందరు కొందరు పురుషులు నేటికీ ఈ విధానం పట్ల సుముఖత చూపిస్తున్నారనడం - అమానుషమే.

పారిస్ నగరంలో 1932లో హెన్రీలిటీర్ అయన అనే పారిస్‌లోని 'క్లునీ మ్యూజియమ్' చూడ్డానికి వెళ్ళి, అక్కడ ప్రదర్శనలో వున్న 'చేస్టిటీ బెల్ట్'ను చూసి 'ముచ్చట' పడి, శస్త్ర చికిత్సకు ఉపయోగపడే సాధనాలను తయారు చేసే ఒక కంపెనీకి చెప్పి, అలాంటిది చెయ్యమన్నాడట. చేయించిన తర్వాత, తను పొరుగూరుకో, పొరుగింటికో వెళ్ళేటప్పుడల్లా అది తన భార్యకిచ్చి వేసుకోమని నిర్బంధం చేసేవాడట. అతని చర్యలను సమర్థించిన మరికొందరు పురుష పుంగవులు - తాము కూడా ఆ 'బెల్ట్'లు ఆర్డర్లిచ్చి చేయించుకున్నారుట. అలా అలా, ఆ విధానం మళ్ళీ కొంత ఉధృత రూపం దాల్చిందిట.

ఐతే, ఇవి స్త్రీలే తెప్పించుకుంటున్నారా, పురుషులే తెప్పించి, తమ భార్యలకు తొడుగుతున్నారా అన్నది సరిగ్గా తెలియడం లేదని కొందరు అన్నా - స్త్రీలు తెప్పించుకుని, తమకు తాముగా 'అమానుషంగా' బిగించుకుంటారనడానికి లేదు! "ఇది కేవలం పురుషుల చర్యే. తన చర్యను సమర్థించుకోడానికి అతను స్త్రీల మీదకు నెడుతున్నాడు" అన్నది సులువుగానే అర్థం చేసుకోవచ్చు.

1970 ప్రాంతాల ఇంగ్లండ్‌లోని ఒక పట్టణంలో ఇలాంటి 'బెల్ట్'లు తయారుచేసే రెన్విక్ అనే అతను - "ముందు నేను సరదాగా తెప్పించుకుంటున్నారేమో అనుకున్నాను. కాని కాదు. ఇలాంటి బెల్ట్స్ కావలసిన వాళ్ళందరూ తమ భార్యలవో, ప్రియురాళ్ళవో కొలతలు తీసుకుని సరిగ్గా అదే కొలతలతో చెయ్యమని రాస్తున్నారు. కొందరైతే, డిజైన్స్ కూడా 'ఇలా వుండాలి' అని ఆదేశిస్తున్నారు. అయితే ఇవన్నీ మగాళ్ళ దగ్గర్నుంచి వచ్చిన ఆర్డర్లేగాని, స్త్రీల దగ్గర్నుంచి వచ్చినవి మాత్రం కాదు" అని చెప్పాడు.

మరి, ఈ విషయం తొమ్మిదేళ్ళ కిందట జరిగినట్టుగా తెలుస్తున్నా, ఈ తొమ్మిదేళ్ళలోనూ ఈ విధానం పూర్తిగా సమసిపోయి వుంటుందని అనుకోడానికి లేదు. కచ్చితంగా ఇది కొన్ని దేశాల్లో, కొన్ని ప్రాంతాల్లో ఇంకా అమల్లో వుండే వుండాలి.

మానవ ప్రపంచం అన్నిటా ఇంతగా ముందంజ వేస్తూ, ఒక పక్క 'ప్రగతి' 'మానవత్వం' అని మాట్లాడుతూ, మరోపక్క అమానుషమైన 'శీలరక్షిణి'లను ఉపయోగిస్తూ వుండడం, ఉపయోగిస్తూ వుంటే చూస్తూ వూరుకోడం ఎంతవరకూ న్యాయం?—ఎంతవరకూ సమంజసం?

ఇవి ఎవరు తెప్పిస్తున్నారు? ఎవరు చేయిస్తున్నారు? ఎవరు చేస్తున్నారు? నిజంగా భార్యల ఇష్టంమీదనే వారు వారికి ధరింపజేస్తున్నారా? లేక అబలలను చేసి వారిని బెదిరించి, హింసిస్తూ ధరింపజేస్తున్నారా?—

సభ్యతా ప్రపంచం ఊరుకోకూడదు; ఆరా తియ్యాలి! □




మచిలీపట్నం ఇన్నర్‌వీల్‌క్లబ్ సభ్యులు అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా తుఫాను బాధితులకై నిర్మించిన గిలకలదిండి బెస్తవాడలోని పిల్లలలో తొంభైమందికి టీకాలు పొడిపించారు. విటమిన్ టాబ్లెట్లు పంచిపెట్టారు, కృష్ణాజిల్లా కలక్టర్ సతీమణి శ్రీమతి ఉమాకందా ఈ కార్యక్రమాలకి ప్రారంభోత్సవం చేశారు. ఆనాటి కార్యక్రమంలో పాల్గొన్న ఇన్నర్‌వీల్‌క్లబ్ కార్య నిర్వాహకవర్గం, సభ్యులు ఈ చిత్రంలో వున్నారు.



ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమిచే రచయిత్రుల సలహా సంఘ సభ్యురాలుగా యిటీవల శ్రీమతి కొండముది రుక్మిణీదేవి నియమితురాలైనారు. శ్రీమతి రుక్మిణీదేవి కథానికా రచయిత్రిగా, నవలా కారిణిగా, వ్యాసకర్తగా విశేషమైన పేరు గడించారు.

# వార్తావనిత

విజయవాడ ఎస్. ఆర్. ఆర్. అండ్ సి. వి. ఆర్. ప్రభుత్వ కళాశాలలో చదువుతున్న కుమారి కె. ఎల్. విద్యావతి హిమాలయాలలోని ఉత్తరకాశీ నెహ్రూ పర్వతారోహణ కేంద్రంలో నెల రోజుల పాటు శిక్షణ పొంది వచ్చారు. ఆంధ్రదేశం నుండి ఈసారి ఈ శిక్షణకు ఎన్నికైన ఏకైక వనిత కుమారి విద్యావతి కావడం విశేషం. అంతకు ముందు ఆమె విశాఖపట్నంలో ఐ. ఎన్. హెచ్. ఎస్. 'కళ్యాణి'లో శిక్షణ పొందారు. పర్వతారోహణలో 'ఐస్ యాక్స్' మెడల్‌ని పొందిన విద్యావతి ఆ బహుమతిని అందుకుంటున్నారు.

'మీరా'



ముప్ఫయిరెండవ స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా విశాఖ నార్తు లయన్ లేడీస్‌క్లబ్బు మహిళలు పెదవాల్తేరులోని పురపాలక ఉన్నత ప్రాథమిక పాఠశాలను దత్తత తీసుకుని, ఉత్సవ వేడుకలను జరిపించారు. లయన్ లేడీస్ కో-ఆర్డినేషన్ ఛెయిర్మన్ శ్రీమతి ఆప్మామెహదీ పతాకావిష్కరణచేసి, ఆటల పోటీలలో గెలుపొందినవారికి బహుమతులు పంచిపెట్టారు. క్లబ్బు అధ్యక్షురాలు శ్రీమతి సరస్వతీదేవి స్కూలుకు కావలసిన సౌకర్యాలన్నీ చూస్తామని వాగ్దానం చేసారు.

—విలేకరి





హైదరాబాద్ జ్యోతి మహిళామండలి తమ నాలుగవ వార్షికోత్సవాన్ని యిటీవల వైభవంగా జరుపుకున్నారు. ఆనాటి వినోద కార్యక్రమాల్లో - ఒక భాగంగా బేబి సురేఖ, వందనా, జ్యోతి, రాజకుమారి నృత్య ప్రదర్శనలిచ్చారు. శ్రీమతి వసంత, కుమారి శ్రీదేవి 'ఒథెల్లో' నాటికలోని ఒక దృశ్యాన్ని ప్రదర్శించారు. ఆ సందర్భంగా తీసిన పై చిత్రంలో కార్యదర్శి శ్రీమతి సరోజ, ఉపాధ్యక్షురాలు శ్రీమతి భువనేశ్వరి, ముఖ్య అతిధి సెరినాదాస్, శ్రీమతి కుమార్‌నాయక్, గ్వేన్ ఫోర్బ్స్, కుమారి హేమలత, అధ్యక్షురాలు శ్రీమతి ఆర్. కుసుమ వున్నారు.

శ్రీకాకుళంలోని శ్రీనివాస మహిళామండలివారు ఇటీవల సంగీత పాఠశాలను ప్రారంభించారు. శ్రీకాకుళం జాయింట్ కలెక్టర్ సతీమణి శ్రీమతి ఆండాళ్ వెంకటశివయ్య ప్రారంభోత్సవం చెయ్యగా, శ్రీమతి విమలా రామచంద్రరావు (విశాఖపట్నం గ్రామీణ చైర్మన్ సతీమణి) ఆ సందర్భంలో బీదవారికి బట్టలు వంచిపెట్టారు మండలి కార్యదర్శి శ్రీమతి వరద సరోజిని, ఉపాధ్యక్షురాలు శ్రీమతి గుడివాడ రామలక్ష్మి మొదలైనవారు మాట్లాడగా శ్రీమతి తిమ్మరాజు హైమావతి స్వీయకవితాగానం చేశారు. —టి. వి



విశాఖపట్నం నార్తు ఇన్నర్‌వీల్‌క్లబ్బు టి. ఎల్. ఎన్. సభాహాలు (వాల్తేరు ఆంధ్రా యూనివర్శిటీ)లో ఇటీవల జరుపుకున్న ప్రతిష్టాపనోత్సవంలో నూతన సంవత్సరానికి అధ్యక్షురాలుగా శ్రీమతి కనకవల్లీ రామ్‌గోపాల్. కార్యదర్శిగా శ్రీమతి అమృతా వరదారెడ్డి, కోశాధికారిగా శ్రీమతి సత్యవతీ అప్పారావు తదితరులు పదవీస్వీకారం చేసారు. శ్రీమతి భగవంతి రామ్‌చంద్ అధ్యక్షత వహించిన ఆనాటి సభకు ఇన్నర్‌వీల్ డిస్ట్రిక్టు-315 కు లోగడ "ఛెయిర్‌మన్"గా వ్యవహరించిన శ్రీమతి అనితాసేన్ ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. గౌరవ అతిధిగా పాల్గొన్న శ్రీమతి గుణవతి రామచంద్రన్ నూతన కార్యవర్గానికి శుభాశీస్సులందజేశారు. శ్రీమతి అనితాసేన్ శాస్త్రీయబాణిలో రెండు గీతాలను మధురంగా పాడి సభాసదులను ఆనందింపజేశారు. —విలేకరి



అనంతపురం ఇన్నర్‌వీల్‌క్లబ్ అధ్యక్షురాలుగా శ్రీమతి కె. కళావతిని ఇన్నర్‌వీల్ క్లబ్ ఛెయిర్-విమెన్ శ్రీమతి ఉమా. ఆర్. ఉల్లల్ నియామకం చేశారు.



రాజమండ్రి ఇన్నర్‌వీల్‌క్లబ్ ప్రతిష్టాపనా కార్యక్రమం యిటీవల స్థానిక శ్రీదుర్గా కల్యాణమంటపంలో జరిగింది. క్లబ్ అధ్యక్షురాలు శ్రీమతి బి. మృదులా కమలాకర్ పేద బాలలకు దుస్తులను, కార్యదర్శి శ్రీమతి కె. నిర్మలా ప్రశాంత్ కుమార్ పేద స్త్రీలకు చీరెలు వంచిపెట్టారు.



## బ్లడ్ తెరపీ జర్నల్

వైద్యులకీ, ప్రజాసామాన్యానికీ కూడా ఉపయోగపడుతున్న 'బ్లడ్ తెరపీ జర్నల్' అన్న పత్రిక-బొంబాయిలో డిసెంబర్లో జరగబోతున్న 'ఏషియన్ కేన్సర్ కాంగ్రెస్' సభ సందర్భంగా ఒక ప్రత్యేక (అంతర్జాతీయ) సంచికను తీసుకురాబోతున్నది. రక్తానికి సంబంధించిన పలు వ్యాధులు, కేన్సర్ మొదలైన దారుణమైన జబ్బులూ ప్రపంచంలో ప్రజలను పట్టి పీడిస్తున్నాయి. ఇలాంటి భయంకరవ్యాధుల్ని అరికట్టడానికి ఎన్నో పరిశోధనలు అవసరమవుతాయి. ఎప్పటికప్పుడు ఆ విశేషాలనూ విషయాలనూ తెలియజేసే పత్రిక-'బ్లడ్ తెరపీ జర్నల్'. డిసెంబర్‌లో వెలువడే 'అంతర్జాతీయ ప్రత్యేక సంచిక'కు రక్తవ్యాధులు, కేన్సర్‌కు సంబంధించిన వ్యాసాలను (ఆంగ్లంలో) వ్రాసి పంపవలసిందిగా రచయితలనూ, వైద్యులనూ, తక్కిన ఉత్సాహవంతులనూ వీరు కోరుతున్నారు. చిరునామా :

Blood Therapy Jorunal,
16 B/22, Devnagar, New Delhi-110005



విశాఖపట్నం సౌత్ లయన్ లేడీస్‌క్లబ్బు కార్య కర్తలు ఇటీవల కిన్నెరా ఓపెన్ ఎయిర్ థియేటరులో **1979-80**వ సంవత్సరపు అధ్యక్షురాలుగా శ్రీమతి చంద్రారూబెన్, కార్యదర్శిగా శ్రీమతి సుశీలా పట్టాభిరామన్, కోశాధికారిణిగా శ్రీమతి రత్నావళి గుప్తా తదితరులు పదవీస్వీకారం చేశారు.

—విలేకరి

నంద్యాల లయన్ లేడీస్‌క్లబ్ ఆధ్వర్యంలో క్లబ్ అధ్యక్షురాలు డాక్టర్ బి. అన్నపూర్ణ స్థానిక దానియేతపురం ప్రాథమిక పాఠశాల విద్యార్థులకు పాఠ్యపుస్తకాలు, నోటుపుస్తకాలు, పలకలు పంచి పెట్టారు. ఈ కార్యక్రమంలో పాల్గొన్న లయన్ లేడీస్ బి. సురేఖ, ఆర్. సరస్వతి కూడా ఈ చిత్రంలో వున్నారు.






తాడేపల్లిగూడెం లయన్ లేడీస్‌క్లబ్ ఆధ్వర్యంలో ప్రారంభించబడిన పురపాలక బాలల గ్రంథాలయానికి శ్రీమతి ఎల్. జయలక్ష్మి, పురపాలక పిల్లల పార్కుకి మునిసిపల్ కమిషనర్ శ్రీ ఎల్. వెంకటేశ్వరరావు ప్రారంభోత్సవం చేశారు. లయన్ లేడీస్‌క్లబ్ అధ్యక్షురాలు శ్రీమతి దారా సీతాదేవి కూడా ఈ చిత్రంలో వున్నారు.

—తా. వి.

## మరణం

గత సంచికలో వచ్చిన "మమతలు" అన్న కథ రాసిన ఆకెళ్ళ వరలక్ష్మి - ఆగస్ట్ **31**వ తేదీన తన **22**వ ఏట అకస్మాత్తుగా మరణించినట్టుగా, ఆమె భర్త సూర్యనారాయణ కాకినాడ నుంచి తెలియజేశారు. "ఈ మధ్యనే ఆమె ఒక నవల కూడా మొదలుపెట్టింది. తన ఆఖరి కథను మీ పత్రికలోనే చూసుకోగలిగింది" అని, ఆయన విచారంగా లేఖ రాశారు. ఆమె అకాల మరణానికి 'వనిత' చింతిస్తున్నది.



## స్మృతి

సమధికోత్సాహంతో జాతీయోద్యమంలోనూ, పలు సేవా సంస్థల్లోనూ పాల్గొని, విశిష్టవ్యక్తిగా వెలిగిన శ్రీమతి కామేశ్వరమ్మ కుప్పుస్వామి ఇటీవల బెంగళూరులో కాలధర్మం చెందారు. ఆమె వయసు **72** సంవత్సరాలు.

శ్రీమతి కామేశ్వరమ్మ ఆంధ్రదేశంలో పుట్టి, పెరిగి, **1929**లో మద్రాసు విశ్వవిద్యాలయం ద్వారా పట్టభద్రులయ్యారు. హైద్రాబాదులోని ఒక విద్యాలయంలో పని చేస్తూ వుండగా ఉప్పు సత్యాగ్రహం పిలుపుతో రాజీనామా ఇచ్చి స్వాతంత్ర్య సమరంలో జేరారు; తూర్పు గోదావరిజిల్లా కాంగ్రెస్ కమిటీకి అధ్యక్షురాలిగా ఎన్నికైనారు. స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నందుకుగాను ఆమె వెల్లూరు జైల్లో శిక్ష అనుభవించారు. **1932**లో ఆమె ప్రొఫెసర్ కుప్పుస్వామిని వివాహం చేసుకున్నారు. శ్రీమతి కామేశ్వరమ్మ మైసూరురాష్ట్రంలో ఖాదీ ఉద్యమాన్ని విస్తృతం చెయ్యడంలోనూ, పలు పాఠశాలలు నెలకొల్పడంలోనూ ఎంతో కృషి చేశారు. అప్పట్నుంచి ఎన్నో పదవులను నిర్వహిస్తూ, పలు సంస్థల ద్వారా సాంఘికసేవ చేస్తూనే వచ్చారు. మద్రాసు రెడ్‌క్రాస్ సంస్థకు ఆమె చాలాకాలం ప్రధాన కార్యదర్శిగా వున్నారు. **1953**లో 'టూరంటో'లో అంతర్జాతీయ మహిళాసభ జరిగినప్పుడు, భారత ప్రభుత్వం ఆమెను ఆ సభలో పాల్గొనవలసిందిగా పంపింది. ఆమె పలుదేశాలు పర్యటించారు; పలు పట్టణాల్లో పలు విషయాల మీద ఉపన్యాసాలు చేశారు. సాంఘిక, స్త్రీ శిశు సంక్షేమశాఖలో ఆమె నిర్విరామంగా కృషిచేశారు. శ్రీమతి కామేశ్వరమ్మ స్త్రీ సంక్షేమానికీ, జాతికీ చేసిన సేవను, దేశం ఎప్పటికీ మరచిపోలేదు!

# పుట్టిన రోజులు

ఈ నెల పుట్టినరోజులు గల శిశువుల్లో - ఏడాది పిల్లల గ్రూపులో హెచ్. శిల్ప; రెండేళ్ళ పిల్లల గ్రూపులో ఎమ్. అపర్ణ 'పుట్టినరోజు' బహుమతులకు ఎన్నికైనారు. నిర్ణయింపబడిన పై ముగ్గురితో పాటు, మొత్తం మీద మూడు గ్రూపుల లోనూ ఆరోగ్యంగా కనిపిస్తున్న మరో ముగ్గురిని ఎన్నికచేసి ప్రచురిస్తున్నాము. నవంబర్ సంచికలోని ఈ శీర్షికకు ఫొటోలు పంపేవారు - వివరాలతో సహా (ఫొటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి. ఫొటో వెనుక పెన్సిల్‌తో వివరాలు రాయాలి. ఫొటోలు 'క్వార్టర్ సైజుకు తక్కువ సైజుల్లో వుండకూడదు. తిప్పి పంపడానికి తగినన్ని తపాలా బిళ్ళలుగల కవరు జతపరచాలి.) అక్టోబర్ 5వ తేదీలోగా మాకు చేరేలా పంపగోరుతున్నాము.



ఎమ్. అపర్ణ (వెల్దుర్తి) పుట్టిన తేదీ: 27-10-77
తల్లి పేరు: ఎమ్. శాంతి.



హెచ్. శిల్ప (నాగర్ కర్నూల్) పుట్టిన తేదీ: 23-10-78
తల్లి పేరు: హెచ్. ఉమామహేశ్వరీ బాయి.



సి హెచ్. సుమన్ (పెరిసెపల్లి) పుట్టిన తేదీ: 6-10-78 తల్లి పేరు: సి హెచ్. రాజేశ్వరి.



డి. టి. విష్ణువందన్ (దావణగెరె)
పుట్టిన తేదీ: 11-10-76
తల్లి పేరు: డి. టి. లక్ష్మిదేవి.



కె. వంధ్య (వాల్తేరు) పుట్టిన తేదీ: 12-10-78
తల్లి పేరు: కె. సత్యవతి.



Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026.

## కోమలమైన, నాజూకైన

# టిప్స్ అండ్ టోస్

కొత్తగా ప్రవేశమైన ఛాయలు.

మీ తత్వంలో దాగిన ఆ సుకుమారానికి, మా కొత్త రకాల సున్నితమైన గోళ్ళ రంగులతో మెరుగులు దిద్దుకోండి. లేత ఛాయకు ముదురు రంగు, ముదురు ఛాయకు లేత రంగుతో అలంకరించుకోండి. ఆ అలంకరణలో మీ గోళ్ళను చూసు కొని అందంగా తనివి తీరా మురిసి పోండి.

కళాత్మకంగా ఉండే కొన్ని:

నం. 40 లేడీ లిలాక్
నం. 41 బడ్డింగ్ బెయిజ్
నం. 42 బేబీ బ్లష్
నం. 46 పింక్ రిఫ్రెయిన్
నం. 47 వ్యానిలా ఫ్రాస్ట్

పేస్టల్స్ మరియు డార్క్, పెరల్స్ లేక ప్లెయిన్స్—ఈ కొత్త రకాలతో మీ టిప్స్ అండ్ టోస్ కిట్ పరిపూర్ణ మవుతుంది.

ఇంకా: లనోలిన్ సమృద్ధిగాగల టిప్స్ అండ్ టోస్ నెయిల్ లస్టర్ రిమూవర్ కూడా దొరుకుతుంది.

అన్ని ప్రముఖ దుకాణాలలో చూడవచ్చు.

## టిప్స్ అండ్ టోస్

## గోళ్ళకు మెరుపు
## గోళ్ళకు మేకప్




టిప్స్ అండ్ టోస్ వారి నుండి చిట్కాల యొక్క ఉచిత పుస్తకం కోసం మీ డీలర్ని అడగండి. సరుకున్నంతవరకే మరి.

# క్రేక్‌జాక్-జనం అంతా మనసుపడేది

Parle Krackjack Biscuits

Krackjack

విడిగా
అమ్మబడవు—
అనుకరణలుంటాయి...
జాగ్రత్త!

కొందరిది తియ్యనిదని వాదిస్తారు
మరికొందరిది ఉప్పనిదని
పట్టుబడతారు కాని మరువలేని
మజా రుచిగలదని అందరూ
ఒప్పుకుంటారు

పార్లే

everest/78/PP/255-tl

**క్రాక్‌జాక్** బిస్కట్లు-తియ్యగా, ఉప్పగా, నోరూ రించేలా.